# పీఠిక

ఇట్టిగ్రంథ మిదివరలో తెనుగులో లేదన్నలోపమునుగ్రహించి దీనిని ప్రకటింప సాహసించినాము. లోకోక్తిఅంటే ప్రపంచజ్ఞానసార సుధాఘుటిక అన్నమాట. సంస్కృతలోకోక్తులను తెలియనివాడు అనాగరకు డవుతాడు. ఈలోకోక్తులను తెలుసుకొనిప్రయోగింపగలిగిన వాడు మాటనేర్పరి కానడమేకాకుండా జ్ఞానవంతుడుకూడా అవుతాడు. ఆర్యజాతివారయిన ఆంధ్రులు ఈసంస్కృతన్యాయములను తెలుసుకోవడము అత్యావశ్యకము.

సంస్కృతవాఙ్మయమును చదువుతూఉన్నప్పుడు తనకంట బడిన లోకోక్తులనన్నిటిని సంగ్రహించి వాటిని ఇదివరకుసంగృహీత ములయినవాటికిచేర్చి తేటమాటలతో తెనుగున అర్థవివరణమును వ్రాసి, మేము ప్రకటింపననుజ్ఞయిచ్చిన గ్రంథకర్తగారికి మేమెంతయు కృతజ్ఞులము.

ఇట్లు
ప్రకాశకులు,
ప్రపంచమతగ్రంథమాలాకార్యస్థానము.
రాజమహేంద్రవరము.

శ్రీ

# సంస్కృత లోకోక్తులు

1. అకామస్య క్రియా కాచి ద్దృశ్యతే నేహ కర్హిచిత్.
యద్యద్ధి కురుతే జంతు తత్త త్కామస్య చేష్టితమ్॥

కామము (కోరిక) లేనివాడు ఏపనినీన్నీ చేయడు. పురుషుడుచేసే పనిఅంతా కామముమూలముగానే జరుగుతున్నది. సకలకర్మాచరణ కారణమున్ను సర్వానర్థబీజమున్ను అయినకామమును విడిచిపెట్ట వలెను. కామమే మనుష్యుని మోక్షముపొందకుండాచేసే శత్రువు. అందుచేత దానినివిడిచిపెట్టవలెను. ఈవిషయమే శ్రీమద్భగవద్గీతలో "కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః మహాశనో మహాపాప్మా విద్ధ్యేద మిహ వైరిణమ్" అనిచెప్పబడిఉన్నది.

2. అకృతవ్యూహాః పాణినీయాః

పాణినిని అనుసరించే వైయాకరణులు విశిష్టమయిన ఊహను చేయరు అని దీనిఅర్థము. అనగా బుద్ధిమంతులయిన ఊహాపోహాకుశలులు ఒకకార్యమునుచేయడమువల్ల వినాశము కలుగుతుందని తెలుసుకొని ఆకార్యమునుచేయరు.

3. అక్లిష్టాఽభావకస్యాఽభావకల్పనాపేక్షయాక్లిష్టాఽభావస్యైవ తత్కల్పనముచితమ్.

సిద్ధించనికోరిక లనేకములుకోరడముకంటె ఫలించని ఆకోరికలు కొంచెముగా కోరడము మంచిది. (చూ. అవశ్యాఽపేక్షిత...; నిత్యాఽనిత్యయోః...; సావకాశనిరవకాశయోః...; కృత్రిమాఽకృత్రిమయోః...; సహచరితాఽసహచరితయోః...; ప్రధానాప్రధానయోః...; ఉపజీవ్యోపజీవకయోః...; గౌణముఖ్యయోః...; మొదలయినన్యాయములు.)

4. అర్కే చే న్మధు విందేత కిమర్థం పర్వతం వ్రజేత్।
ఇష్టార్థస్య చ సంసిద్ధౌ కో విద్వాన్ యత్న మాచరేత్॥

తనయింటి ఒకమూలలో తేనెపట్టుపట్టి తేనెదొరుకుతూఉంటే, ఆ తేనెకోసము కొండలలోనికి పోవడ మెందుకు? తనకు కావలసినది ఎదురుగాదొరుకుతూఉంటే బుద్ధిమంతుడయినవాడు దానికోసము పెద్ద ప్రయత్నముచేయవలెనా?—ఇట్లే తనలోనే బ్రహ్మమును తెలుసుకొనువాడు ఆబ్రహ్మమునువెదకడముకోసము తీర్థయాత్రలు చేయనక్కరలేదు అని దీనిభావము.

5. అక్షేత్రే బీజ ముత్సృష్ట మంతరైవవినశ్యతి.

సరియైనభూమిలోవిత్తనమునాటకపోతేఅదిమధ్యలోనేనశిస్తుంది

6. అంగగుణనిషేధే తాదర్థ్యాత్.

ఒక్కటేఅర్థము కలవగుటచేత ఒకవస్తువుయొక్క అంగమును దానిగుణమునుకూడ నిషేధించవలెను. "అవ్వపేరే ముసలమ్మ" అని తెనుగుసామెత.

7. అంగారన్యాయము.

అంగారమనగా బొగ్గు. కాలుతూఉన్న బొగ్గును ముట్టుకొంటే చేయికాలుతుంది. చల్లారిన బొగ్గునుముట్టుకొంటే మసిఅవుతుంది. అట్లే దుష్టుడుకూడాను. కనుక దుష్టులకు దూరముగాఉండవలెను.

8. అంగులీదీపికయా ధ్వాంతధ్వంసవిధిః.

వ్రేళ్ళతో చిన్నవత్తిదీపమును పట్టుకొని చీకటిని ధ్వంసము చేస్తానని అనడము. పెద్దపని చేయవలసిఉన్నప్పుడు స్వల్పప్రయత్నము చేస్తే ఈన్యాయము వర్తిస్తుంది.

9. అంగుల్యగ్రే కరిణాం శతమ్.

నావ్రేలికొనతో నూరుఏనుగులను ఎత్తితిని అనిచెప్పడము. నమ్మదగని డంబములు కొట్టేటప్పుడు ఈన్యాయము పనికివస్తుంది.

10. అగతికగతిన్యాయము.

గతిలేక ఒకరినిఆశ్రయించడము. "గతిలేనివాడు గాడిదకాళ్ళు పట్టుకొన్నట్టు" అని తెనుగుసామెత.

11. అగ్నిశిఖాన్యాయము.

అగ్నిజ్వాల స్వాభావికముగా మీదికేపోతుంది. అట్లే ఆత్మ కూడా ఊర్ధ్వగతినే పొందుతూఉంటుంది అని ఆర్హతులు(జైనమతస్థులు) అంటారు.

12. అగ్న్యానయనన్యాయము.

'నిప్పుతీసుకొనిరా' అనిచెప్పినప్పుడు ఏదయినా ఒకవస్తువుమీద ఉంచి నిప్పునుతీసుకొనిరా అని వేరేచెప్పనక్కరలేదు. ఉత్తచేతితో నిప్పుముట్టుకొంటే చేయికాలుతుందని ప్రత్యేకముగా చెప్పవలెనా? (చూ.జలానయనన్యాయము.)

13. అచలం గుణవృత్తమ్.

సత్త్వరజస్తమోగుణములు ప్రవర్తించలేదు అనుకొనడము. నావలో నదిమీద పోతూఉన్నవానికి ఒడ్డునఉన్న చెట్లునడుస్తూఉన్నట్టు కనబడినా అవి నిజముగాకదలుచుండలేదు అని తెలుసుకొన్నవానికి తత్త్వమెట్లు తెలియునో, అట్లే సత్త్వరజస్తమోగుణములు ప్రవృత్తిని పొంది జీవాత్మను నడిపించుచున్నవి అనేభ్రాంతిని విడిచినవానికి తత్త్వము తెలియును.

14. అచింత్యాః ఖలు యేభావా నతాం స్తర్కేణ సాధయేత్

చింతనచేయడమునకు వీలులేనిభావములనుగురించి వ్యర్థముగా తర్కముచేయకూడదు. ఈజగత్తు ఎట్లుపుట్టినది? దీని కాధారమేమిటి? దీనికి నిమిత్తకారణమేమిటి? ఇది యెట్టిపరిణామమును పొందుతుంది? ఈమొదలయినప్రశ్నలకు సరియైన సమాధానము దొరకదు. అందుచేత వాటినిగురించి ఆలోచించడము వ్యర్థము.

15. అచేతనేష్వపి చేతనవ దుపచారో దృశ్యతే.

అచేతనపదార్థములనుగురించికూడా చేతనములనుగురించి మాట్లాడినట్లే మాట్లాడుతాము. "రాయివచ్చి నాచేతికితగిలింది" అనే టప్పుడు రాతికి ఒకచేతనపదార్థమునకువలె గమనమున్నదని ఆరోపిస్తాము.

16. అజగరవృత్తిన్యాయము.

అజగరమనగా కొండచిలువ. దానిదేహము స్థూలముగా ఉండడముచేత సులభముగా కదలలేదు. కాని కదలకుండాఉండి తనదగ్గరకు వచ్చినజంతువులను ఒక్కసారిగా మ్రింగివేస్తుంది. దానినోటబడితే మరి తప్పించుకొనడానికి వీలులేదు.

17. అజహాత్స్వార్థావృత్తిన్యాయము.

ఒకమాటచెప్పినప్పుడు ఆమాటయొక్క అర్థమేకాక దానితో సంబంధించిన మరిఒకఅర్థముకూడా వెంటనంటిఉంటే దానికి అజహాత్స్వార్థావృత్తి అనిపేరు. "గొడుగులు వేసుకొన్నమనుష్యులు వెళ్లుతున్నారు" అనిచెప్పినప్పుడు గొడుగులు వేసుకోనివారు వెళ్ళలేదు అని కూడా తెలుస్తున్నది. "ఈపెరుగును కాకులుముట్టుకోకుండా చూస్తూ ఉండు" అనిచెప్పితే కుక్కలుముట్టుకోకుండా చూడవద్దు అని చెప్పలేదనుకోకూడదు. భిక్షుకుడు ఒకయింటిలో బిచ్చముపుచ్చుకొని మరి ఒక ఇంట బిచ్చముపుచ్చుకొన్నప్పుడు మొదటిబిచ్చమును పారవేయడు. బిచ్చములనన్నిటిని కూడబెట్టుకొంటాడు. అట్లే ఒకమాటకొకఅర్థమున్నా దానికి మొదటిఅర్థముతో సంబంధించినఅర్థములు కూడా వెంటనంటి ఉంటవి.

18. అజాకృపాణీయన్యాయము.

మేకవచ్చినది దానిమీదకత్తిపడినది అన్నట్లు. అకస్మాత్తుగా ఒకకీడుకలిగినప్పుడు ఈన్యాయమును ఉదాహరిస్తారు. (చూ. కాకతాళీయన్యాయము.)

19. అజాగళస్తనన్యాయము.

అనగా మేకమెడలోనిచన్నులవలె నిరర్థకమయినది అనిఅర్థము.

20. అజాతపుత్రనామోత్కీర్తన న్యాయము.

పుట్టనికొడుకుగుణములను పొగడినట్లు. ఎప్పుడోకలుగబోయే దానిని తలంచుకొని ఉప్పొంగడము.

21. అజ్ఝల్న్యాయము.

అచ్చులు ప్రాణములవంటివి. హల్లులు బొందివంటివి. అచ్చులను స్వయముగాఉచ్చరింపవచ్చును. హల్లులను ప్రత్యేకముగా ఉచ్చరింపలేము. అవి అచ్చులతో గూడిఉన్నప్పుడే వాటిని ఉచ్చరింపగలము. అట్లే ప్రాణమున్నంతసేపే బొంది జీవించిఉంటుంది.

22. అండకుక్కుటీన్యాయము.

గ్రుడ్డులోనుంచిపిల్లపుట్టుతుంది. పిల్లపెద్దదయి మళ్ళీ గ్రుడ్లుపెట్టుతుంది అందుచేత గ్రుడ్డుముందో పిల్లముందో నిర్ణయించడము కష్టము.

23. అండకుక్కుటీన్యాయము.

"గ్రుడ్డుముందా కోడిముందా?" "గ్రుడ్డుముందా పిల్లముందా". అని దీనికి సరియైన తెనుగుసామెత. (చూ. బీజవృక్షన్యాయము, బీజాంకుర న్యాయము.)

24. అణురపి విశేషోఽధ్యవసాయకరః.

అధ్యవసాయము అంటే ఈపనిని నేనుచేయవలెను, ఇది నావిధి అనితలచి ఆపనిలో ప్రవేశించడము. ఎంతఅల్పుడయినా ఈపని నేను చేయవలసినది, ఇది నావిధికృత్యము, అని ఎప్పుడయితే తలస్తాడో అప్పుడు ఆపనిని మిక్కిలిశ్రద్ధతోను ప్రయత్నముతోను చేస్తాడు.

25. అణురపి విశేషోఽ ధ్యవసాయకరః

ఇదమిత్థమని నిర్ణయించేవిషయము స్వల్పమయినదయినా దానికే ప్రాబల్యముహెచ్చు.

26. అంతతోఽశ్మాఽపి జీర్యతే.

తుదకు రాయికూడా అరిగిపోతుంది.

27. అంతరేణాపి నిమిత్తశబ్దం నిమిత్తార్థో గమ్యతే.

'నిమిత్తము' అనేశబ్దమును ప్రయోగింపకపోయినా నిమిత్తార్థము గోచరిస్తూనే ఉంటుంది. 'విషము మృత్యువు' అన్నప్పుడు 'మృత్యువు నిమిత్తము' అనేఅర్థము తెలుస్తూనేఉన్నది. (చూ. విషంమృత్యుః; లాంగలం జీవనమ్; ఆయుర్ఘృతమ్.)

28. అంతర్దీపికాన్యాయము

ఇంటిలోఉన్న దీపము అన్నిప్రక్కలకూ తనవెలుతురును ఇచ్చినట్లు. "ఈ ఆత్మనునిత్యమున్ను సత్యముచేతను తపస్సుచేతను సమ్యజ్జ్ఞానముచేతను బ్రహ్మచర్యముచేతను పొందడమునకు వీలవుతుంది" అనేవాక్యములో నిత్యశబ్దము సత్యము, తపస్సు, జ్ఞానము, బ్రహ్మచర్యము, అనేనాలుగుశబ్దములతోను ప్రత్యేకముగా అన్వయిస్తుంది.

29. అంతస్సారో, బహిశ్శీతమ్.

లోపలమంట, పైకిచలవ. లోపలకుటిల పైకినయ.

30. అంతే యా మతి స్సా గతిః

చచ్చేటప్పుడు ఏమితలచుకొంటే ఆభావమును ఆరూపమును కలిగి, తిరిగీ జన్మమెత్తుతారు. ఈవిషయమే భగవద్గీతలలో—

యం యం వాఽపి స్మరన్ భావం త్యజ త్యంతే కలేబరమ్
తం త మే వైతి కౌంతేయ సదా తద్భావభావితః.

అని చెప్పబడిఉన్నది.

31. అంతే రండావివాహశ్చే దాదావేవ కుతో న సః

రండావివాహమే చేసుకొనడానికి నిశ్చయించుకొన్నప్పుడు, ఆ పని కట్టకడపటకు చేసుకోవడమెందుకు? మొదటనే చేసుకోవచ్చును.

32. అతర్క్యా కుట్టనీకూటరచనా విధేరపి.

తాప్పకర్తయొక్క మాయమాటలు బ్రహ్మకైనా తెలియవు.

33. అశస్మిన్ సః ఇత్యేత ద్భవతి.

కొండమంచుచున్నది అంటే కొండమీాదచెట్లు మండుచున్న వని అర్థము. బ్రహ్మదత్తుడు సన్యాసిని అనుసరించుచున్నాడు అంటే సన్యాసి ఏమిపనులు చేస్తున్నాడో బ్రహ్మదత్తుడుకూడా ఆపనులే చేస్తున్నాడు అని అర్థము. గంగలో గొల్లపల్లె ఉన్నది అంటే గొల్లపల్లె గంగఒడ్డున ఉన్నది అనిఅర్థము. కఱ్ఱలను ప్రవేశపెట్టు అంటే ఒకమనిషిచేతికిచ్చి పంపు అని అర్థము.

34. అతితృష్ణా న కర్తవ్యా తృష్ణాం నైవ పరిత్యజేత్.

ఎక్కువ ఆశాకూడదు; ఆశను విడిచిపెట్టనూకూడదు.

35. అతి దేశన్యాయము.

ఏదేశములో ఉంటే ఆదేశమువారి ఆచారములను అనుసరించడము. ఒకస్థానమును పొందిఉన్నప్పుడు ఆస్థానమునకు తగినధర్మమును ఒకనియందు ఆరోపించడము.

36. అతి సర్వత్ర వర్జయేత్.

ఏవిషయములోనూ మితిమీారి ఉండకూడదు.

37. అతిస్నేహః పాపాశంకీ.

స్నేహం మెక్కువఅయితే పాపముకలుగుతుందేమో అని భయము.

38. అతీతమహిషీస్నేహన్యాయము.

గృహస్థాశ్రమములోఉన్నప్పుడు ఒకడు ఒకగేదెను పెంచినాడు. దానిమీాద అతనికి ఎంతో ప్రేమఉండేది. అతడు గృహస్థాశ్రమమును వదలి, గురువునుండి తత్త్వోపదేశమును పొందినప్పటికీ, గేదెమీాద ప్రేమనుమాత్రము వదలిపెట్టలేకపోయినాడట. ఇటువంటిసందర్భములలో ఈన్యాయమును ఉదాహరిస్తారు.

39. అత్యంతబలవంతోఽపి పౌరజానపదా జనాః
దుర్బలైరపి బాధ్యంతే పురుషైః పార్థివాశ్రితైః

పల్లెలలోను పట్టణములలోను ఉండేజనులు ఎంతబలవంతులయినా రాజుయొక్క ఆశ్రయమును పొందిన దుర్బలసేవకులచేతకూడా బాధలుపొందుతారు. బలవంతుడయినవానిని దుర్బలుడు మరియొక బలవంతునిసహాయముచేత బాధింపగలడు.

40. అత్యుచ్ఛ్రాయః పతనహేతుః.
మిక్కిలీమీదికిపోవడము పడడమునకే.

41. అథ సన్నిహితాదపి వ్యవహితం సాకాంక్షం బలీయః

ఒకశబ్దముతో అన్వయముగల మరిఒకశబ్దమువాక్యములోదూరముగాఉన్నా అన్వయములేని దగ్గరశబ్దముకంటె ఎక్కువబలము కలిగి ఉంటుంది. తనకు హితుడయినవాడు దూరదేశములోఉన్నా దగ్గరఉన్న ఉదాసీనునికంటె తనకు ఎక్కువ ఉపకారముచేస్తాడు.

42. అథ సన్నిహితాదపి వ్యవహితం సాకాంక్షం బలీయః

రెండుశబ్దములు కలిసిఉన్నా, వాటిఅర్థముకంటె ఆకాంక్షతో కూడిఉన్న శబ్దములు వాక్యములో దూరముగాఉన్నా వాటిఅర్థము ఎక్కువబలము కలిగిఉంటుంది.

43. అదగ్ధ దహన న్యాయము.

అగ్ని కాలినదానిని మరికాల్చదు. కాలకుండాఉన్నదానిని దహిస్తుంది. ఒకరు పచ్చగాఉంటే జనులు చూచి ఓర్వలేరు. కాయలుగలచెట్టుకే రాళ్ళదెబ్బలు.

44. అదృష్టపాదపే దేశే ఏరండోఽపి ద్రుమాయతే
చెట్లులేనిదేశములో ఆముదపుచెట్టే మహావృక్షము.

45. అదోషమైవ సగుణో విగుణే.
దుష్టుడు ఒకరికి కీడుచేయకుండడమే వానిలోని సుగుణము.

46. అంధకవర్తకీయన్యాయము.

గుడ్డివాని చేతిలో చిక్కుకొన్న పిచికవలె. అనుకోకుండా కలిగిన లాభనష్టముల విషయములో ఈన్యాయము వర్తిస్తుంది. చూ. కాకతాలీయన్యాయము.

47. అంధకూపపతనన్యాయము

సరియైనమార్గమును చూపిస్తే దానిని వదలిపెట్టి తప్పుదారిని పడి గుడ్డివాడు నూతిలోపడినట్లు, వేదోక్తమార్గమును విడిచిపెట్టి అజ్ఞాని నరకములో పడుతాడు.

48. అంధగజన్యాయము.

కొంతమందిగుడ్డివాళ్ళు ఒకనివద్దకుపోయి ఏనుగు ఏలాగు ఉంటుంది అనిఅడిగినారు. వాడు వారిని ఒకఏనుగుదగ్గరకు తీసుకొనిపోయి 'ఇదిగోఏనుగ, దీనినిపట్టుకొని చూడండి' అన్నాడు. వాళ్ళలోఒకడు చెవులు పట్టుకొని తడవినాడు. ఒకడు తొండముతడవినాడు. ఒకడుకాళ్ళు పట్టితడవినాడు. ఒకడుతోకపట్టుకొన్నాడు. అందరూఏనుగ ఏలాగు ఉంటుందో తెలుసుకొన్నా మనుకొన్నారు. ఇంటికిపోయినారు. ఏనుగు ఆకారమునుగురించి వివాదముచేయ నారంభించినారు. చెవులుపట్టుకొన్నవాడు ఏనుగ చేటవలె ఉన్నదన్నాడు. తొండముపట్టుకొన్నవాడు ఏనుగ పెద్దపామువలె ఉన్నదన్నాడు. కాళ్ళుపట్టుకొన్నవాడు ఏనుగ స్తంభమువలె ఉన్నదన్నాడు. తోకపట్టుకొన్నవాడు ఏనుగు లావుపాటితాడువలె ఉన్నదన్నాడు. ఈవిధముగానే మూఢులు అక్కడక్కడ కొన్ని శ్లోకములను నేర్చుకొని తత్త్వజ్ఞానము పూర్తిగా లేకపోయినా పరబ్రహ్మమును తెలుసుకొన్నా మనుకొంటారు.

49. అంధ గోలాంగూల న్యాయము.

ఒకడు ఒంటినిండా ఆభరణములుపెట్టుకొని తనబంధువులఊరికి వెళ్ళుతున్నాడు. దారిలో ఒకఅడవి ఉన్నది. ఆఅడవిమధ్యకు వెళ్లేసరికి

వానికి మరి దారికనిపించలేదు. ఎటుపోవడమునకును అతనికితోచక దుఃఖిస్తూఉండగా ఒకదొంగ అతనినిచూచినాడు. చూచి "ఏమయ్యా, ఏడుస్తున్నావు?" అనిఅడిగినాడు. వాడాదొంగకు తనవృత్తాంతము చెప్పినాడు. దొంగ వానిఆభరణములను అపహరింపనెంచి "అయ్యో, ఎందుకు బెంగపెట్టుకొంటావు? నాతో రా. నీకు మీబంధువులఊరికి దారి చూపిస్తాను" అని నమ్మకముపుట్టేటట్లు చెప్పినాడు. వాడుదొంగను నమ్మి వానివెంట పోయినాడు. దొంగ అతనిని మరిఒకఅడవిలోనికి తీసికొనిపోయి వానికళ్లలో బుగ్గిపోసి గుడ్డివానినిగాచేసి, ఆభరణములను దోచుకొని,ఒకఎద్దుతోకను వానిచేతికిచ్చి, "ఇదిపట్టుకొని ఎద్దు ఎటుతీసుకొనిపోతే ఆదారివెంట పో. అది మీబంధువులఊరికి తీసుకపోతుంది" అనిచెప్పినాడు. వాడామాటలనమ్మి ఎద్దుతోకవిడువకుండాపట్టుకొన్నాడు. ఎద్దు వానిని ముండ్లలోనికి తుప్పలలోనికి ఈడ్చుకొనిపోయినది. ఇట్లే అనాత్మను ఆత్మగా విశ్వసించినవానిగతికూడా అని తెలుసుకోవలెను.

50. అంధచటకన్యాయము.

గుడ్డివానిచేతిలో పిచిక అకస్మాత్తుగాపడితే వాడు దానిని పట్టుకొన్నాడు. అట్లే అదృష్టవశమున చిక్కినఫలమును తానారాధించే దైవము ఇచ్చినాడని తలంచడముకూడాను.

51. అంధదర్పణన్యాయము.

గుడ్డివానికి అద్దముచూపినట్లు (నిష్ప్రయోజనమన్నమాట.) చూ. ఊషరవృష్టిన్యాయము. మొ.వ.

52. అంధ పంగు న్యాయము.

ఇద్దరుబిచ్చగాళ్ళు ఉండేవారు. ఒకడుగుడ్డివాడు, ఒకడుకుంటివాడు. ప్రత్యేకముగా వారు బిచ్చమెత్తుకొనడము కష్టమైనది. అందుచేత గుడ్డివాడు కుంటివానిని తనభుజములమీద ఎక్కించుకొని

తిరుగుతూఉంటే కుంటివాడు దారి చూపిస్తూఉండేవాడు. అట్లే చేతను డైన పురుషుడు తనంతటతాను ప్రవర్తించలేక శరీరమునాశ్రయించి ప్రవర్తిస్తాడు.

53. అంధపరంపరాన్యాయము

గుడ్డివాడిని గుడ్డివాడు అనుసరించినప్పుడు మొదటివాడు పడితే రెండోవాడుకూడా పడుతాడు. (చూ. గడులికాప్రవాహ న్యాయము.)

54. అంధస్యై వాంధలగ్నస్య వినిపాతః పదేపదే.

గుడ్డివానిని ఊతగొన్నగుడ్డివాడు అడుగడుగుకూ పడుతూ ఉంటాడు. అట్లే అజ్ఞానిని ఆశ్రయించిన అజ్ఞానికూడాను.

55. అంధాఽనంధన్యాయము.

గుడ్డివానికి చూపువచ్చినట్లు, అజ్ఞానికి జ్ఞానమురావడము.

56. అధః పశ్యసి కిం బాలే గతం తారుణ్యమౌక్తికమ్.

బాలా, క్రిందికిచూస్తావేమి అనిఅడుగుతే నాయౌవనమనే ముత్యము క్రిందపడిపోయినది అని అన్నదట.

57. అధమా సేవకావృత్తిః

సేవకావృత్తి అతినీచమయినది.

58 అధికం తు ప్రవిష్టేన తద్ధానిః

ఎక్కువలాభముకలుగుతే దానివల్ల నష్టములేదు. ఒకశబ్దమును ప్రయోగించడమువల్ల అనుకొన్నదానికంటె ఎక్కువరసవంతమైన అర్థము స్ఫురిస్తే మరీమంచిది.

59. అధికం ప్రవిష్టేన తద్ధానిః

ఒకపనినిఅధికముగాచేయడమువల్ల ఆపనికి హానికలుగకపోయేట ప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది.

60. అధిక స్యాధికం ఫలమ్.

ఎంతఎక్కువగాదొరికితే అంతమంచిది.

61. అధ్యారోపాఽపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే.

తాడినిచూచి పామనుకొనడము, ముత్తెపుచిప్పను చూచి వెండిఅనుకొనడము, ఇట్టిదే అధ్యారోపము. ఇదిపాముకాదు, తాడు; ఇదివెండికాదు, ముత్తెపుచిప్ప; అనే నిశ్చయజ్ఞానమును పొందడము అపవాదము. తాడుపామనిన్నీ, ముత్తెపుచిప్ప వెండిఅనిన్నీ అనుకొనడము భ్రాంతివల్లకలుగుతున్నది. ఈభ్రాంతి ఇంకొకభ్రాంతికి మూలమవుతుంది. ఈరీతిగా భ్రాంతిప్రపంచము విస్తరిస్తూఉంటుంది. ఆభ్రాంతిని విడిచిపెట్టితే సత్యముబోధపడుతుంది. అట్లే, జగత్తు భ్రాంతిమూలకముగావిస్తరించి, ఆభ్రాంతిపోగానే, నిత్యము, సత్యము, సచ్చిదానందాత్మకము అయిన పరమాత్మ గోచరమవుతుంది.

62. అనంతరస్య విధి ర్వా భవతి ప్రతిషేధో వా.

"యజేన హన్యాత్" అనేవాక్యములో 'న'అనే అవ్యయము 'యజేత్' అనేక్రియతో నయినా అన్వయింపవచ్చును, హన్యాత్, అనే క్రియతో నయినా అన్వయింపవచ్చును.

63. అనధీతే మహాభాష్యే వ్యర్థా స్యాత్పదమంజరీ

అధీతేఽపి మహాభాష్యే వ్యర్థా స్యాత్పదమంజరీ.

వ్యాకరణమహాభాష్యము చదువుకోకపోతే శబ్దమంజరివల్ల ప్రయోజనములేదు. మహాభాష్యముచదువుకొంటే శబ్దమంజరివల్ల ప్రయోజనములేదు.

64. అనన్యలభ్య శ్శబ్దార్థః

శబ్దముయొక్కఅర్థమును ఆశబ్దమువల్లనే నిర్ణయింపవలెను.

65. అనన్యలభ్య శ్శాస్త్రార్థః

శాస్త్రార్థమును శాస్త్రముచేతనే నిర్ణయింపవలెను.

66. అనభ్యాసే విషం శాస్త్ర మజీర్ణే భోజనం విషమ్.

శాస్త్రమును తిరిగితిరిగి మననముచేసుకోకపోతే విషముగా పరిణమిస్తుంది. అజీర్ణముగా ఉన్నప్పుడు భోజనముచేస్తే విషమిస్తుంది.

67. అనవయవే శాస్త్రార్థసంప్రత్యయః

శాస్త్రములో ప్రత్యేకముగా చెప్పబడని విషయములకున్ను శాస్త్రవిధులుచెల్లుతవి. "బ్రాహ్మణునిచంపకూడదు, కల్లుతాగకూడదు" అనిచెప్పినప్పుడు, ఒక్క బ్రాహ్మణునే చంపకూడదు, ఒక్క కల్లునేత్రాగకూడదు, ఇతరులనుచంపవచ్చును, ఇతరమద్యపదార్థములు సేవింపవచ్చును అని అర్థముకాదు.

68. అనవస్థాన్యాయము.

ఉపపాద్యవిషయమునకున్ను ఉపపాదకవిషయమునకున్ను పొందికలేకపోవడము అనవస్థాన్యాయమని కొందరంటారు. అవ్యవస్థితమయిన పరంపరోపాధిచేత అనిష్టము కలుగడము అనవస్థాన్యాయమనికొందరంటారు.

69. అనాథప్రేతసంస్కారాత్ కోటియజ్ఞఫలం లభేత్.

దిక్కుమాలినశవమునకు దహనసంస్కారము చేయడమువల్ల కోటియజ్ఞముల ఫలము కలుగుతుంది.

70. అనాథో దేవరక్షితః.

దిక్కులేనివానికి దేవుడేదిక్కు.

71. అనారభ్యాధీతానాం చ ప్రకృతౌ వా ద్విరుక్తత్వాత్.

అధ్యయనముచేసినవారు తిరిగి అధ్యయనము చేయనక్కరలేదు. ఇది మీమాంసాశాస్త్రములో వచ్చేన్యాయము.

72. అనార్యసంగమా ద్వరం విరోధోఽపి సమం మహాత్మభిః

చెడ్డవారితోస్నేహముకంటె, మహాత్ములతోవిరోధము మేలు.

73. అనాశ్వాసితదుఃఖితే మనసి సర్వ మసహ్యమ్.

దుఃఖిస్తూఉన్నమనస్సును ఓదార్చేవారులేకపోతే అంతాఅసహ్యముగా కనబడుతుంది.

74. అనిర్వేదప్రాప్యాణి శ్రేయాంసి.

సాహసముచేయనిదే శ్రేయస్సుకలుగదు.

75. అనుకరణం హి శిష్టస్య సాధు భవతి.

శిష్టులయినవారినడవడిని అవలంబించడము మంచిది.

76. అనుక్తమ ప్యూహతి పండితో జనః

పండితుడయినవాడు చెప్పినదానినిబట్టి చెప్పనిదానినికూడా ఊహించుకొంటాడు.

77. అనుపదిష్టం సత్కథం శక్యం విజ్ఞాతు మసచ్చ కథం శక్యం ప్రతిపత్తుమ్.

ఉన్నదయినా చెప్పకపోతేఎట్లుతెలుస్తుంది? లేనిదానినితెలుసుకొనడము అసలే ఎట్లుసంభవిస్తుంది?

78. అనురాగోఽనురాగేణ ప్రత్యేష్టవ్యః

ఇతరులయెడల అనురాగమునుచూపి ఇతరులఅనురాగమును పొందవలెను.

79. అనువృత్తిన్యాయము.

అభ్యాసమువల్ల నైపుణ్యము వస్తుంది. "అభ్యాసం కూసువిద్య" అని తెనుగుసామెత.

80. అన్నమూలం బలం పుంసామ్.

పురుషులకు అన్నమువల్లనే బలముకలుగుతుంది.

81. అన్నస్య క్షుధితం పాత్రమ్.

అన్నమునకు ఆకలే కంచము.

82. అన్యగేహస్థితా ద్ధూమా న్న గేహాంతర మగ్నిమత్.

ఒకఇంటిలో పొగఉంటే మరిఒకఇల్లు తగలబడుతున్నదని అనుకోము.

83. అన్యద్భుక్త మన్యద్వాంతమ్.

ఒకటితింటే మరిఒకటి వాంతిచేసుకొన్నాడట.

84. అన్వార్థం పరిష్కృత మన్వార్థం భవతి.

ఒకప్రయోజనముకోసము ఆరంభింపబడినపనివల్ల ఇతరప్రయోజనములుకూడా కలుగును. పొలములకునీళ్ళకోసము కాలువత్రవ్వితే ఆనీళ్ళు త్రాగుటకున్ను ఇండ్లుకడుగుకొనడమునకున్ను కూడా ఉపయోగిస్తవి.

85. అన్యేన చాన్యస్య విధి ర్భవతి.

ఒకనికిచెప్పబడినవిధి మరిఒకనికి విధిఅయినట్లు, రాజులకూ రాజులకూ శత్రుత్వముంటే వారియుద్ధము ఏనుగులు గుఱ్ఱములు రథములు పదాతులవల్ల చేయబడుతుంది.

86. అన్యోన్యాశ్రయన్యాయము.

ఒకదానినొకటి ఆశ్రయించుకొని ఉండడము. ప్రజలు రాజునాశ్రయించుకొని ఉంటారు. రాజు ప్రజలనాశ్రయించుకొని ఉంటారు. అడవి పులినాశ్రయించుకొని ఉంటుంది. పులి అడవినాశ్రయించుకొని ఉంటుంది. చూచక్రికన్యాయము.

87. అన్వయవ్యతిరేకిన్యాయము.

ఎక్కడఒకవస్తువుఉంటే మరిఒకవస్తువుకూడా ఉంటుందో, ఎక్కడ ఆవస్తువులేకపోతే రెండోవస్తువుకూడా ఉండదో, అప్పుడు మొదటివస్తువు రెండోదానికి కారణమవుతుంది. దీనికే అన్వయవ్యతిరేకిన్యాయమంటారు. అగ్నిఉన్నచోట పొగఉంటుంది. పొగఉన్నచోట అగ్నిఉంటుంది. అగ్నిలేకపోతే పొగఉండదు. పొగలేకపోతే అగ్నికూడా ఉండదు.

88. అపంథానం తు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి.

తప్పుత్రోవలోపోయేవానిని సోదరుడైనా విడిచిపెట్టుతాడు.

89. అపవాదన్యాయము.

భ్రాంతిచేత ఒకవస్తువు మరిఒకవస్తువైనట్లు కనబడితే ఆభ్రాం

తిని తొలగించి, ఇదినిజముగా ఈవస్తువు అని తెలిపేదానికి అపవాదము అనిపేరు. స్తంభమునుచూచి మనుష్యుడనుకొన్నప్పుడు, అది మనుష్యుడుకాడు, స్తంభము అని నిశ్చయజ్ఞానముపొందించడమే అపవాదము.

90 అపసారి తాగ్నిభూతలన్యాయము.

భూమిమీద ఉన్న అగ్నిని అక్కడనుండితీసివేసినా, ఆస్థలమందు వేడిమాత్రముపోదు. అట్లే, దుష్టులతోకూడిఉంటే, వారినుండి తరువాతవిడబడినా, దుష్టగుణములుమాత్రము విడిచిపెట్టవు. (చూ. చంపకపటన్యాయము).

91 అపృష్టోఽపి హితం వదేత్.

అడుగకపోయినా హితమునుచెప్పవలెను.

92. అప్రాప్తే శాస్త్ర మర్థవత్.

అర్థమునరిగాతేలనప్పుడు, దానిని శాస్త్రమువల్ల నిర్ణయించవలెను.

93. అబాధే నోపపత్తౌ బాధో న న్యాయః.

ఒకపనికిఆటంకములేనప్పుడు, దానికి ఆటంకమున్నదనిచెప్పడము న్యాయముకాదు.

94. అబ్ధిఫేనాదిన్యాయము.

సముద్రములోని నురగవలె. నురగఅనిత్యమయినది. అట్లే, బ్రహ్మమను సముద్రములో నామరూపాత్మక మయిన ప్రపంచము అనిత్యమయినది.

95. అబ్భక్షన్యాయము.

ఈబ్రాహ్మణుడు నీళ్ళనుత్రాగి బ్రతుకుచున్నాడు. అన్నప్పుడు అన్నము తినేవాళ్ళుకూడా నీళ్ళుత్రాగినా, ఈబ్రాహ్మణుడు అన్నము మొదలయిన ఆహారమును తినడు. కేవలము నీటినిమాత్రము త్రాగి జీవిస్తున్నాడు, అనిఅర్థము.

96. అభక్ష్యప్రతిషేధేన వా భక్ష్యనియమః

ఈఆహారమునుతినకూడదు అనేనియమమువల్ల, ఇటువంటిఆహారమును తినవలెను అనేనియమముకూడా ఏర్పడుతుంది. ఇట్లుచేయకూడదు, అనిఅంటే, మరొకరీతిగా చేయవలెను అనిచెప్పినట్లే.

97. అభాండలాభః—

కోమటివానికి తనవస్తువులనుంచుకొనడమునకు కుండలు లేకపోయినా, ఎట్లో కాలక్షేపముచేసి వర్తకముసాగిస్తాడు. సాధనము చేతిలో లేకపోయినా, కార్యసంసిద్ధిప్రాప్తించేటప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

98. అభిభూతిభయాదసూనతః సుఖముజ్ఝంతి న ధామమానినః.

మానవంతులయినవారు అవమానభయముచేత సుఖమును, ప్రాణములనుగూడ వదలిపెట్టుతారుగాని, తమకీర్తిని వదలిపెట్టలేరు.

99. అభివ్యక్తపదార్థా యే స్వతంత్రా లోకవిశ్రుతాః.

శాస్త్రార్థా స్తేషు కర్తవ్యాః శబ్దేషు న తదుక్తిషు.

లోకములో స్వతంత్రార్థములుగలిగి ప్రసిద్ధములైన వస్తువులను తెలియజేసేశబ్దములనుగురించి శాస్త్రార్థము చేయవలెనుగాని, ఆశబ్దముల వ్యుత్పత్త్యర్థములవల్లకలిగే గౌణార్థములకు ప్రాధాన్యమీయకూడదు. (చూ. గౌణముఖ్యయో ర్ముఖ్యే కార్యసంప్రత్యయః)

100. అభీష్టస్త్రీవియోగార్తా సవివేకోఽపి బాధ్యతే.

తాముమోహించినకాంతలనుండి ఎడబాసి, వివేకవంతులు కూడా వ్యథపొందుతారు.

101. అభేదకాఽగుణాః-

గుణభేదములేకపోతే, వ్యక్తిభేదమూఉండదు.

102. అద్భి ర్గాత్రాణి శుధ్యంతి మనః సత్యేన శుధ్యతి.

శరీరము నీటిచేత శుద్ధమవుతుంది, మనస్సు సత్యముచేత శుద్ధమవుతుంది.

103. అభ్యంతరాశ్చ సముదాయే ఽవయవాః.

చెట్టుకదలుతున్నది అన్నప్పుడు, దానికొమ్మలతో కూడా కదలుచున్నది అని అర్థమవుతుంది. సముదాయమునుగురించి చెప్పిన విషయము, దానిలోని అవయవములకుకూడా చెందుతుంది.

104. అభ్యంతరే హి సముదాయేఽవయవః.

సముదాయముమీద చెప్పబడినఅర్థము, దానిఅవయవములకు కూడావర్తిస్తుంది. చెట్టుకదలుతున్నది, అన్నప్పుడు దానికొమ్మలు కూడా కదలుతున్నవి అని వేరేచెప్పనక్కరలేదు.

105. ఆమ్రవనన్యాయము.

మామిడితోట అనిపేరేగాని దానిలో ఇతరవృక్షములుకూడా ఉంటవి. మామిడిచెట్లు ఎక్కువగాఉండడముచేత ఆతోట కాపేరు వస్తుంది. (చూ. మల్లగ్రామన్యాయము, (బ్రాహ్మణగ్రామన్యాయము.)

106. అయస్కాంతన్యాయము.

స్తబ్ధుగాపడిఉన్న ఇనుపముక్కకు సూదంటురాయి చలనము కలిగిస్తుంది. అట్లే, కూటస్థమును అప్యయమును అయిన ఆత్మవల్ల ఇంద్రియములకు చలనముకలుగుతుంది.

107. అయాచితమండనన్యాయము.

ఒకవస్తువు అయాచితముగాలభించి, అది అలంకారముకూడా అయినప్పుడు అది అయాచితమండనమవుతుంది. అట్లే, "నీలమైన ఘటమును చేస్తున్నాడు" అన్నప్పుడు, నీలవర్ణమును చేస్తున్నాడు, ఘటమును కూడాచేస్తున్నాడు అని అర్థముసంభవించి, తరువాత నీలత్వమున్ను, ఘటత్వమున్ను ఒకవస్తువునందే సంక్రమిస్తవి.

108. అరణ్యచంద్రికాన్యాయము.

అడవిగాచినవెన్నెలవలె, సద్గుణములు నిరుపయోగములయినప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

109. అరణ్యరోదనన్యాయము.

(ఆడవిలో అబ్బాఅంటే, ఎవరికిఘట్టినావురా కొడకా అన్నట్లు, అని తెనుగుసామెత.) అడవిలోఏడుస్తే ఎవరూ విననట్లు నిష్ప్రయోజనమన్నమాట. (చూ. ఊషరవృష్టిన్యాయము).

110. అరసికజనసంభాషణాత్ రసికజనేన వరం వాక్కలహః

అరసికునితో స్నేహముగాసంభాషించడముకంటె, రసికుడయిన వానితో వాక్కలహముపెట్టుకోవడముమంచిది.

111. అర్ధకుక్కుటీన్యాయము.

కోడినికోసి సగమువండుకొని తిందాము, రెండోసగముచేత గ్రుడ్లనుపెట్టించుదాము అనుకొన్నట్లు.

112. అర్ధజరతీన్యాయము.

ముసలిపెండ్లాముగలవాడు దానిముఖమునుమాత్రముగ్రహించి, తక్కిన అవయవములను వదలిపెట్టినట్లు. అట్లే, ఉపనిషత్తులవల్ల వేదప్రామాణ్యమును అంగీకరించినవారు, బాధకవాక్యములనుకూడా అంగీకరిస్తే, వేదప్రామాణ్యమును అంగీకరించనట్లే అవుతుంది.

113. అర్ధం త్యజతి పండితః.

తనకున్న సమస్తమున్ను నష్టమయ్యేటట్లు కనబడినప్పుడు, పండితుడు సగమువదలుకొనిఅయినా, తక్కినసగమును రక్షించుకొంటాడు.

114. అర్థలౌకికన్యాయము.

అర్థము లోకమువల్లసిద్ధిస్తుంది. వేదము అలౌకికమయినా, దాని అర్థమును లోకమువల్లనే (భారతాదిగ్రంథములవల్లనే) తెలుసుకోవలసి ఉంటుంది.

115. అర్థవశాద్విభక్తివిపరిణామః.

అర్థమునుబట్టి విభక్తిఏర్పడుతుంది. "వానినిఆపనిచేయించుము" అంటే 'వానిచేత' అని తృతీయార్థము చెప్పుకోవలెను.

116. అర్ధవేశన్యాయము.

ఒకడికి కోడిమాంసముకూ తినవలెననిఉన్నది. దానివల్ల గుడ్లు లభించవలెనికూడా ఉన్నది. ఆకోడిమెడ నులిపివేసి, దానిమాంసమును తినివేస్తే, దానిగుడ్లుకూడా ఎట్లులభిస్తవి? (ఆవ్వాకావాలి, బువ్వాకావాలి, అని తెనుగుసామెత).

117. అర్ధవైశన్యాయము.

సగముచంపడము. (చూ. అర్ధకుక్కుటీన్యాయము.)

118. అర్థస్యపురుషోదాసోదాసస్త్వర్థోనకస్యచిత్.

పురుషుడు ధనమునకు దాసుడైఉంటాడుగాని ధనము ఎవ్వరికీ దాసురాలుగా ఉండదు.

119. అర్థస్యోక్తత్వేన పునః ప్రయోగవైయర్థ్యాత్.

చూ. ఉక్తార్థానామప్రయోగః

120. అర్థాతురో న గణయ త్యపకర్షదోషమ్.

ధనముమీాదఆశగలవాడు నీచత్వమునుగణింపడు.

121. అర్థా త్సమర్థో విద్వా నధిక్రియతే.

సార్థకమైన విద్వచ్ఛబ్దముచే పిలువబడేవాడే శాస్త్రార్థమును చెప్పసమర్థుడవుతాడు.

122. అర్థో ఘటో ఘోష ముపైతి నూనమ్.

సగముకుండ ఎక్కువశబ్దము చేస్తుంది.

123. అల మున్మత్తవచసి కావ్యదూష ణోద్భావనేన.

వెఱ్ఱివాడు కావ్యదూషణముచేస్తే దానిగొప్పతనము పోదు.

124. అల్పవిద్యో మహాగర్వీ.

కొంచెమువిద్యగలవానికి గర్వముహెచ్చు.

125. అల్పస్య హేతో ర్బహుహాతు మిచ్ఛన్
విచారమూఢః ప్రతిభాసి మేత్వమ్.

చిన్నపనికోసము పెద్దత్యాగముచేసే మూఢునివలె నీవునాకు కనబడుతున్నావు. పదిరూపాయల ఉద్యోగముకోసము ఆఉద్యోగమిచ్చేఅధికారికి ఆరునెలలజీతము ముందుగాలంచమిచ్చి, ఆఆరునెలలలోగానే ఆఅధికారిఅత్యాశచేత ఆఉద్యోగమును పోగొట్టుకొన్నట్లు.

126. అల్పారంభః క్షేమకరః

ఒక్కసారి పెద్దపరుగులు పరుగెత్తడము మంచిదికాదు కొంచెముగా ఆరంభించి పెద్దప్రయత్నములకు దిగవలెను.

127. అవయవప్రసిద్ధేః సముదాయప్రసిద్ధి ర్బలీయసీ.

ఒకసముదాయములోని ప్రత్యేకభాగముల ప్రసిద్ధికంటె సముదాయ మంతటియొక్క ప్రసిద్ధి బలవత్తరమయినది. ఒకసేనలో ప్రత్యేకముగా సైనికులు బలవంతులయినా వారిప్రత్యేకబలము సముదాయబలముముందు పనికిరాదు.

128. అవయవా అర్థవంతో న సముదాయః

అవయవములే అర్థవంతములుగాని సముదాయమునకు ప్రత్యేకముగా అర్థములేదు. ఎవనికి ఆవులుంటే వాడే వాటిపాలను అనుభవిస్తాడుగాని ఇతరులు అనుభవించరు.

129. అవయవార్థవత్వాత్సముదాయార్థ వత్త్వమ్.

వాక్యములోని భాగములకు అర్థముంటేనే వాక్యమునకంతటికీ అర్థమువస్తుంది. ఈపట్టణము ధనవంతమయినది అని చెప్పినప్పుడు ఆనగరములోని జనులందరూ ధనవంతులయి ఉండనక్కరలేదు. అందుచేత ఆవాక్యమునకు సంపూర్ణమైన అర్థము కుదురలేదు.

130. అవయవే కృతం లింగం సముదాయస్య విశేషకం భవతి.

అవయవమునకు ప్రత్యేకముగా చెప్పబడిన లింగమునుబట్టిసముదాయమునకు విశేషత్వము సిద్ధిస్తుంది. ఆవుకు కొమ్ములులేకపోతే దానిని బోడిఆవు అంటాము.

131. అవయవే శాస్త్రార్థసంప్రత్యయః

శాస్త్రములో ఒకసారి చేయవలసినదని చెప్పబడినవిధిని తిరిగీ తిరిగీచేయనక్కరలేదు. "వసంతకాలములో బ్రాహ్మణునికిఉపనయనము చేయవలెను" "గర్భాష్టమమున బ్రాహ్మణునికి ఉపనయనము చేయవలెను" అన్నప్పుడు ఒకసారి ఉపనయము చేసినతరువాత తిరిగీఉపనయనము చేయవలెనని అర్థము రాదు.

132. అనశ్యాపేక్షితాసపేక్షితయో రపేక్షితం స్మరణీయమ్.

తప్పకుండా ప్రస్తుతముకావలసినది అక్కరలేనిది అనేవాటిలో కావలసినదానినిగురించి స్మరించవలెను. తనపనినిమాని తనకుపనికిమాలినదానిని చేయకూడదు అనిఅర్థము.

133. అవిచారపురీమధ్యే యః పలాయతి జీవతి.

యుక్తాయుక్తవిచారములేని ఊరిలోనుండి ఎవడు పరుగెత్తిపోతాడో వాడే బ్రతుకుతాడు.

134. అవ్యావికన్యాయము.

'అవి' అంటే 'గొఱ్ఱె'. 'ఆవికము' అంటే 'గొఱ్ఱె సంబంధమయినది, అనిఅర్థము. గొఱ్ఱెమాంసముఅంటే గొఱ్ఱెసంబంధమయినమాంసమనిఅర్థము.

135. అశక్తా స్తత్పదం గంతుం తతో నిందాం ప్రకుర్వతే.

కొంచెముదూరమేపోలేనివారు అంతకంటేదూరముగాఉన్నస్థలమును నిందించుతారు.

136. అశక్తోఽహం గృహారంభే శక్తోఽహం గృహాభంజనే.

ఇల్లుకట్టించడానికి నాకుశక్తి లేదుగాని ఇల్లుపడగొట్టడానికి సమర్థుడనే. దుష్టుడు మేలుచేయలేడుగాని కీడుచేయడానికి సిద్ధమవుతాడు.

137. అశోకవనికాన్యాయము.

- రావణుడు సీతను లంకలోనికి తీసుకొనిపోయి రాక్షసస్త్రీలతో

"ఈమెను అశోకవనములో ఉంచండి" అని ఆజ్ఞాపించినాడు. అందుచేత సీతను అనేకచోట్ల ఉంచడమునకు వీలున్నా, రావణునిఆజ్ఞప్రకారము అశోకవనములోనే ఆమెను ఉంచవలసివచ్చినది- అని ఈన్యాయమునకు కొందరు గాథ నుదాహరిస్తారు.

రావణుడు సీతనుతీసుకొనిపోయి అశోకవనములో ఆమెనుఉంచండి అనిఆజ్ఞయిస్తే ఆమెనుఉంచడమునకు అనేకచోట్లుఉన్నా రావణునిఆజ్ఞచేత ఒకస్థలమునిర్దేశించబడినది గనుక ఆమెను ఇతరస్థలములో ఉంచడము నిషేధించబడినది- అని మరికొందరు చెప్పుతారు.

138. అశీలం కస్య నామ స్యా న్న ఖలీకారకారణమ్.

శీలములేని ఎవ్వనికి అవమానముగలుగదు? దుష్టస్వభావముగలవాడు అవమానముపొందుతాడు.

139. అశ్మలోష్టన్యాయము.

దూదితోపోల్చిచూస్తే మంటిబెడ్డ కఠినమైనదయినా రాతితో పోల్చిచూస్తే మృదువైనదే దుష్టులలోకూడా తారతమ్యముంటుంది. చూ. పాషాణేష్టకాన్యాయము.

140. అశ్రేష్ఠః శ్రేష్ఠానుసారీ.

శ్రేష్ఠుడుకానివాడు శ్రేష్ఠుడైనవాని నడవడిని అనుసరిస్తాడు. ఈఅర్థమే శ్రీమద్భగవద్గీతలో ఇట్లుచెప్పబడిఉన్నది. "య ద్య దాచరతి శ్రేష్ఠ స్త త్త దే వేతరోజనః, స య త్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే" అని.

141. అశ్వతరీగర్భన్యాయము.

కంచరగాడిదగర్భముతొల్చితే పిల్లనుకని చస్తుంది. అట్లే అజ్ఞానమునుంచి జ్ఞానముపుట్టగానే అజ్ఞానమునశిస్తుంది.

142. అశ్వభృత్యన్యాయము.

"ఈగుఱ్ఱమెవరిది?" అనిఅడుగుతే "పీడెవనిభృత్యుడో వానిది"

అన్నాడట. "పీడెవనిభృత్యుడు" అనిఅడుగుతే "ఈగుఱ్ఱమెవరిదో వాని భృత్యుడు" అన్నాడట. వస్తునిర్ణయముచేయనప్పుడు ఈన్యాయము పనికివస్తుంది.

143. అసంజాతవిరోధిత్వన్యాయము.

పుట్టనివిరోధమును కల్పించుకొనడము.

144. అసతి బాధకే ప్రమాణానాం సామాన్యే పక్షపాతః

ప్రమాణములకు బాధకములేకపోతే సామాన్యసూత్రమునే చేయవలెను.

145 అసహ్యాజ్ఞాతిదుర్వాక్యం మేఘాంతరిత శావ్రవత్.

జ్ఞాతిఅయినవాడు ఆడినదుర్భాషలు మేఘములునుంచిపుట్టిన అగ్నివలె సహించరానివై ఉంటవి.

146 అసాధారణ్యేన వ్యపదేశా భవంతి.

అసాధారణగుణములు కలిగిఉండడముచేత, ఒకజాతినుంచి ఒక వ్యక్తి ప్రత్యేకింపబడుతుంది.

147 అసిద్ధం బహిరంగ మంతరంగే.

అంతరంగికకార్యమున్నప్పుడు, దానికివ్యతిరిక్తమయిన బహిరంగ కార్యము నెవ్వరూచేయరు. 'అచః పరస్మిన్ పూర్వవిధౌ' అనేపాణినీయసూత్రవివరణసందర్భములో మహాభాష్యమునందు ఈన్యాయము ఉదాహరింపబడ్డది.

148 అస్త్ర మస్త్రేణ శామ్యతి.

అస్త్రమును మరల్చడానికి అస్త్రమేకావలెను. (చూ. చోరాన్వేషణే చోర ఏవప్రయోక్తవ్యః; యాదృశం తాదృశ మేవ సాధయతి.)

149 అస్థూ లారుంధతీన్యాయము.

అరుంధతీనక్షత్రము చాలాచిన్నది. వధూవరులకు దానినిచూపించేటప్పుడు అది వెంటనేకనబడదు. అందుచేత మొదట చంద్రుని

చూపించి, తరువాత చంద్రునికిదగ్గరగాఉండి స్పష్టముగాకనబడే నక్షత్రములనుచూపించి, తరువాత వాటికిదగ్గరగాఉండే సప్తర్షులనే నక్షత్రములనుచూపించి, వాటిలోని వసిష్ఠనక్షత్రమునుచూపించి, దానిప్రక్కనేఉన్న చిన్ననక్షత్రమే అరుంధతిఅని చెప్పుతారు. అట్లే, ఈయిల్లు, భార్యా, పుత్త్రులు మొదలయినవారే నేను అనితలంచి, ఆగృహాదులు నష్టమయితే తానుకూడా నశించినట్లు ఏడ్చేవానికి బోధపరచడముకోసము "ఆత్మావై జాయతేపుత్త్రః" అని మొదటచెప్పి, తరువాత "స ఏష పురుషో అన్నరసమయః" అనిచెప్పి, తరువాత "అన్యోంతరాత్మా ప్రాణమయః" అనిచెప్పి, తరువాత "అన్యోంతరాత్మా మనోమయః" అనిచెప్పి, తరువాత "అన్యోంతరాత్మా విజ్ఞానమయః" అనిచెప్పి, తరువాత, "అన్యోంతరాత్మాఽఽనందమయః" అనియీరీతిగా అంతకంతకూ, పుత్త్రులు, అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందము, ఈమొదలయినవేవీ ఆత్మకాదు అని తత్త్వమును శ్రుతులు తెలుపుతున్నవి.

150 అహికుండలన్యాయము.

పామునకు పాముగుణములుండడముచేత అభేదమున్ను, అది కుండలముగాచుట్టుకొనిఉన్నప్పుడు అవస్థాభేదముచేత భేదమున్ను కలుగుతున్నది. అట్లే బ్రహ్మమునకు చైతన్యరూపముచేత అభేదమున్ను, జీవేశ్వరాదిరూపభేదములచేత భేదమున్ను కలుగుతున్నది.

151 అహినకులన్యాయము.

పాముకున్ను ముంగిసకున్ను ఎడతెగనివైరము-ఎడతెగనిశత్రుత్వమున్నచోట ఈన్యాయము వర్తిస్తుంది. చూ. సింహమృగన్యాయము.

152 అహినిర్ల్వయినీన్యాయము.

పాముయొక్కకుబుసముపట్ల పాము పొరలోఉన్నంతకాలమున్ను, ఆపొర తనదేహమేఅనుకొంటుంది, గాని, దానినివిడిచిపెట్టగానే,

అది తనదిఅనే జ్ఞానము దానికిఉండదు. అట్లే, జ్ఞానమును పొందినవాడు దేహముమీదిభ్రాంతిని విడిచిపెట్టుతాడు.

153 అహిభుక్తైకవర్త న్యాయము.

ఒకడుమద్యమునుసేవించి, ఒకనావయెక్కి, అందుమీదపడు కొంటూ, "నేను మరిఒకడుగామారిపోతానేమో" అనిభయపడి, తన కాలికి ఒకత్రాడుకట్టుకొని నిద్రపోయినాడు. దానినిచూచి, ఒకమాల వాడు హాస్యముకోసము ఆత్రాడునువిప్పి, తనకాలికికట్టుకొన్నాడు. నావ అవతలిఒడ్డుకుపోగానే, అందరూ దిగవలసివచ్చినది. మద్యమును సేవించినవాడు మేల్కొని, తనకాలికి త్రాడులేకపోవడమున్ను, మాల వానికాలికిఉండడమున్ను చూచి, "వాడేనేను, నేనేవాడు" అనిఅనుకొని "ఓరీ, నీవునేను, నేనునీవు" అనివాదముపెట్టుకొన్నాడట.

154 అహింసా పరమోధర్మః.

ధర్మములలోనెల్ల అహింసయే శ్రేష్ఠధర్మము.

155 అహో నిర్ధనతా సర్వాపదా మాస్పదమ్.

ఆహా! దారిద్ర్యము ఆపదలకన్నిటికీ వాసముకదా.

156 ఆకారోహ్రస్వో గుణాస్తు విపులాః.

పొట్టివానికి పుట్టెడుబుద్ధులు.

157 ఆకాశపరిచ్ఛన్నన్యాయము.

ఆకాశముఅనంతమయినది. అయినా, వివిధఘటములలోఉండే ఆకాశము పరిమితిని కలిగినట్లు కనబడుతుంది. ఆఘటములు భిన్నమయి పోతే, తిరిగిఆకాశము అనంతమయినదని తెలుస్తుంది.

158 ఆకాశముష్టిహననన్యాయము.

ఆకాశమును పిడికిటితోగ్రుద్దినట్లు, వ్యర్థప్రయత్నముచేయడము. చూ. గగనరోమంథన్యాయము.

159 ఆకృత్యధికరణన్యాయము.

క్రియవల్లనే కర్తృవాచిశబ్దముకూడా చెప్పబడుతుంది.

160 ఆఖ్యాతానా మర్థంబ్రువతాం శక్తిస్సహకారిణీ.

మాటలకు అర్థనిర్ణయముచేసేటప్పుడు ఆశబ్దములశక్తి అర్థనిర్ణయమునకు తోడ్పడుతుంది. "మంచముమీదతింటున్నాడు; కంచములోతింటున్నాడు" అన్నప్పుడు "మంచముమీదకూర్చుండి తింటున్నాడు" "కంచములో అన్నముపెట్టుకొని తింటున్నాడు" అని శబ్దశక్తివల్ల అర్థము తేలుతుంది.

161 ఆఖ్వన్నపిటకన్యాయము.

ఎలుకఅన్నమును క్రిందికిపడత్రోయగలదుగాని, దానినితిరిగీ ఎత్తలేదు. అట్లే, దుష్టుడు కార్యమును చెడగొట్టగలడుగాని, దానిని చక్కజేయలేడు.

162 ఆగంతుకానా మంతే సివేశః.

భోజనమునకు నిత్యమూవచ్చేవారందరూ వరుసగా కలసికూర్చుంటారు. ఎప్పుడోఒకప్పుడు వచ్చేఆగంతుకునికి అందరికీ తరువాత విస్తరివేస్తారు.

163 ఆచారః ప్రథమో ధర్మః.

ఆచారములను పాలించడమే మొదటిధర్మము.

164 ఆజ్ఞా గురూణాం హ్యవిచారణీయా.

గురువులుచేసినఆజ్ఞ మంచిదా, చెడ్డదా, అనిఆలోచించకూడదు.

165 ఆతురే నియమో నాస్తి

సంకటావస్థలోఉన్నవానికి ఏఆచారమూ ఉండదు.

166 ఆత్మచ్ఛిద్రం నపశ్యంతి పరచ్ఛిద్రానుసారిణః.

ఇతరులతప్పులనెన్నేవారు తమతప్పులను చూచుకోరు.

167 ఆత్మాశ్రయన్యాయము.

ఆత్మాశ్రయమంటే స్వాపేక్షత్వము. తన్నుతానే ఆశ్రయించు కొనిఉండడము. ఇదిఉత్పత్తి, స్థితి, జ్ఞప్తి, భేదములచేత మూడువిధము లుగాఉంటుంది.

168 ఆదానం హి విసర్గాయ సతాం వారిముచా మివ.

భూమిమీద వర్షముకురిపించడానికి మేఘములు నీటిని చేర్చు కొంటవి. సత్పురుషులు ఇతరులకు దానముచేయడానికే ధనమునుకూడ బెట్టుతారు.

169 ఆదా వంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా.

ఆదినీ అంతమందూ కూడా లేనిది ఇప్పుడుకూడా ఉండదు. ప్రతీ వస్తువుకూ ఆది, మధ్యము, అంతము అనేవి ఉంటవి.

170 ఆదిత్యగతిన్యాయము.

సూర్యుడు కదలుతూఉన్నట్టు కనబడడు. కాని ఆకాశముమీద ఒకస్థలమునుండి మరియొకస్థలమునకు మారగానే, సూర్యుడు కదలినా డని అనుకొంటాము. మార్పు తెలియకుండా క్రమక్రమముగా కలిగేట ప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

171 ఆనర్థక్యప్రతిహతానాం విపరీతం బలాబలమ్.

అనర్థకములయినపనులను చేసినవారి బలాబలములు విపరీతము లుగా పరిణమిస్తవి.

172 ఆపద్యపి సతీవృత్తం కిం ముంచంతి కులస్త్రియః.

కులస్త్రీలు ఆపదలలో కూడా తమపాతివ్రత్యమును విడిచిపెట్టరు.

173 ఆభణకన్యాయము.

సామెతచెప్పినట్లు అని అనడము. ఆసామెతయేదో చెప్పక పోవడము.

174 ఆమోద షట్పద న్యాయము.

వాసననుబట్టి తుమ్మెద పువ్వున్నచోటును కనుక్కొంటుంది,

175 ఆమ్రాన్ పృష్టః కోవిదా నాచష్టే

మామిడిచెట్లున్నవా అనిఅడుగుతే కోవిదారచెట్లున్నవన్నాడట. (కోమటీ కోమటీ బెల్లమున్నాదా అంటే అల్లమున్నాది అన్నాడట.)

176 ఆయతస్వభావాని దుఃఖాని

దుఃఖములు నిలిచిఉండే స్వభావముగలవి.

177 ఆయాతః ప్రవాహః కేన వార్యతే?

వరదవచ్చినది, ఎవరుఆపగలరు? దుఃఖపరంపరలు వచ్చేటప్పుడు ఎవరూవాటిని అడ్డుపెట్టలేరు.

178 అయుర్ఘృతమ్

నేయిఆయువుఅంటే నేయి ఆయుస్సునకు నిమత్త కారణమని అర్థము (చూ. అంతరేణాపి నిమిత్తశబ్దం నిమిత్తార్థో గమ్యతే.)

179 ఆరఘట్ట ఘటీభ్రాంతి న్యాయము

ఆరఘట్టమనగా ఏతము. ఏతమునకు కట్టినకుండవలె. చూ. ఘటీయంత్రస్థితఘటభ్రమణన్యాయము.

180 ఆరోపగుణకథనం స్తుతిః

లేనిగుణములను ఆరోపించడమే స్తుతి.

181 ఆరోహావరోహణన్యాయము.

మీదికిఎక్కడము క్రిందికిదిగడమువలె. (పవనము మూలాధార చక్రమునుంచి బ్రహ్మరంధ్రాంతమువరకూ ఎక్కి, తిరిగీ మూలాధార చక్రమువరకూ దిగుతుంది.

182 ఆలస్యా దన్నదోషాచ్చ మృత్యు ర్విప్రాన్ జిఘాంసతి

మాంద్యముచేతనున్ను దోషయుక్తమయిన అన్నమును తినడముచేతనున్ను మృత్యువు మనుష్యులను చంపుతుంది.

183 ఆలస్యా దమృతం విషమ్.

ఆలస్యముచేయడమువల్ల అమృతముకూడా విషమవుతుంది.

184 ఆవృత్తిః సర్వశాస్త్రాణాం బోధాదపి గరీయసీ.

చదివినశాస్త్రములను మననముచేయడము ఇతరులకు వాటిని బోధించడముకంటె మంచిది.

185 ఆశయా బధ్యతే లోకః కర్మణా బహుచింతయా.

ఆశచేతను, కర్మములచేతను, బహుచింతచేతను లోకమునకు బంధముకలుగుతున్నది.

186 ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్.

ఆశయే పరమదుఃఖము. నిరాశచేసుకొనడమే పరమసుఖము.

187 ఆషాఢవాతే చలతి ద్విపేంద్రే చక్రీవతో వారిధిరేవకాష్ఠా.

ఆషాఢమాసపుగాలికి ఏనుగులేచలించిపోతూఉంటే, గాడిద ఎగిరిపోయి సముద్రములో కలియవలసినదే. (చూ. మహాగజాః పలాయంతే మశకానాంతు కా గతిః)

188 ఆసంసారం జగత్యస్మిన్నేకా నిత్యా హ్యనిత్యతా.

ఈప్రపంచములో సంసారమున్నంతవరకూ అనిత్యత ఒక్కటే నిత్యమయినది.

189 ఆహారే వ్యవహారే చ త్యక్తలజ్జః సుఖీ భవేత్.

ఆహారవిషయములోను వ్యవహారవిషయములోను లజ్జనువిడిచి పెట్టినవానికే సుఖముకలుగుతుంది.

190 ఇక్షుదండన్యాయము

చెఱుకుకఱ్ఱ మీదిగుంపులుకన్న క్రిందిగుంపులు అంతకంతకూ ఎక్కువ రుచిగాఉన్నట్లు సజ్జనమైత్రి అంతకంతకూ ఎక్కువప్రీతికరమవుతుంది.

191 ఇక్షురసన్యాయము.

చెఱుకురసము మిక్కిలితీయగాఉంటుందికాని, దానిమీదతెట్టు

తేరి మలినముగా ఉంటుంది. ఆ తెట్టునుతీసివేసి ఆరసమును ఆస్వాదింప వచ్చును. అట్లే బ్రహ్మమనేపదార్థము పైకి మాయారూపకమైన తమోవికారమును గలిగిఉన్నా, ఆమాయనుతొలగిస్తే స్వచ్ఛమైనఆత్మ స్వరూపము బయటపడుతుంది.

192 ఇక్షువికారన్యాయము.

చెఱుకురసము బెల్లము, చక్కెర, కండచక్కెర, ఈరీతిగా ఒక దానికంటె మరిఒకటి స్వచ్ఛమైన పదార్థములుగావికారములనుపొందు తుంది. ఒకదానిలోకంటె మరిఒకదానిలో మాలిన్యమును ఎక్కువగా తీసివేయడముచేతఆయారూపముకలుగుతవి. అట్లే మాయావిలసితమైన జగత్తులోని తమస్సును కొరిచెముకొంచెముగా తొలగించుకొంటూపోతే తుదకు విమలతమమైన బ్రహ్మపదార్థము తేటపడుతుంది.

193 ఇందుక్ష్వేడన్యాయము.

ఈశ్వరుడు చంద్రుని విషమునుకూడా గ్రహించినా, చంద్రుని తలమీదఉంచుకొన్నాడు, విషమునుకంఠమందునిలిపినాడు. అట్లే బుద్ధి మంతుడు గుణదోషములనురెండింటిని గ్రహించి గుణములనుశ్లాఘించి దోషమునుబయటపెట్టడు.

194 ఇంద్రజాలన్యాయము.

గారడివల్ల ఒకవస్తువు మరిఒకవస్తువువలె కనబడునట్లు మిథ్య అయినజగత్తు నిజమైనదిగా కనబడుతుంది.

195. ఇంద్రియాభ్యామజయ్యాభ్యాంద్వాభ్యామేవహతంజగత్.
అహో ఉపస్థజిహ్వాభ్యాం బ్రహ్మాది మశకావధి.

ఉపస్థ, నాలుక, ఈరెండింటిచేతను బ్రహ్మమొదలు దోమవర కూ సమస్తజగత్తున్నూ నాశముపొందుతున్నది.

196. ఇషువేగక్షయన్యాయము.

వింటినుండి వేగముతోవదలినబాణము అంతకంతకూ వేగము

తగ్గిపోయి క్రిందికిపడుతుంది. అట్లే, ఆరంభశూరత్వము అంతమందు కనబడదు. (జీవాత్మయొక్క పూర్వకర్మమునశించినా, మొదటివేగము చేత కొంతవరకూ ప్రవర్తించినతరువాతగాని దానిగమనము అంత రించదు.) చూ. చక్రభ్రమణన్యాయము.

197. ఈర్ష్యా హి వివేకపరిపంథినీ.

ఈర్ష్య వివేకమునకు శత్రువు. ఈర్ష్యాళువు యుక్తాయుక్తవివే' చనము కలిగిఉండదు.

198. ఉపసర్గన్యాయము.

ప్ర, పరా, అపి, అను, అభి, మొదలగునవి ఉపసర్గలు. ఇవి క్రియలముందుచేరి వానికి అనేక అర్థభేదములను కలిగిస్తవి. 'ప్ర అనే ఉపసర్గనుతీసుకొందాము. దీనిఅర్థములు. (1) ప్రయోగము— ప్రయుజ్యతే; (2) వియోగము-ప్రోషతి,ప్రోషతి. (3) భృశము-ప్రవదం తిదాయాదాః; (4) తృప్తి-ప్రభుక్తమన్నమ్. (5) శుద్ధి-ప్రసన్నముద కమ్. (6) శక్తి-ప్రశక్తోవిద్యాయామ్. (7) అగ్రము-ప్రవాలోవృక్షస్య, (8) అగ్రపూజ-ప్రాంజలిః స్థితః. (9) సుశాంతి-ప్రశాంతోవహ్నిః. (10) ఆరంభము-ప్రారబ్ధమ్ (11) ఉదీర్ణము-ప్రబలోరాజా (12) సంభవము-హిమవతోగంగాప్రభవతి. (13) చూడడము-ప్రలోకయతి (14) ఐశ్వర్యము-ప్రభుర్దేవదత్తః (15) అభిలాషము-ప్రార్థయతే కన్యామ్. ఇట్లేప్రసిద్ధః,ప్రయాతః, ప్రతుష్యతి, మొదలయినవి.

199. ఉక్తార్థానా మప్రయోగః

చెప్పినమాటనేతిరిగిచెప్పడమువల్ల ప్రయోజనములేదు.

200. ఉత్తమా కులవిద్యా స్యాత్.

కులవిద్యయే ఉత్తమవిద్య.

201. ఉత్తీర్ణే చ జలే పారే నౌకయా కిం ప్రయోజనమ్.

ఏరుదాటినతరువాత నావతో ఏమిప్రయోజనమున్నది?

202. ఉత్పతితోఽపి హి చణకః శక్తః కిం భ్రాష్ట్రికం భంక్తుమ్.

కాలినమూకుటిలో ఎగురుతూఉన్న సెనగగింజ మూకుటినిపగుల గొట్టగలదా? అల్పుడు మిడిసిపడినా, మంచివారి నేమీచేయలేడు.

203. ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే.

చెడుమార్గమునసంచరించేవానిని విడిచిపెట్టవలెను.

204. ఉత్పద్యంతే ప్రలీయంతే దరిద్రాణాం మనోరథాః.

దరిద్రునికి కోరికలుపుట్టుతూఉంటవి, అట్లే పోతూనూఉంటవి.

205. ఉదకనిమజ్జనన్యాయము.

అభ్యాసమువల్ల నీటిఅడుగున జలస్తంభనముచేసి ఉండవచ్చును.

206. ఉదకం పరమౌషధమ్.

నీరే అన్నిటికంటె మంచిమందు.

207. ఉదరనిమిత్తో బహుకృతవేషః

ఏవేషమువేసినాకడుపుకూటికొరకే. (కోటివిద్యలుకూటికొరకే.)

208. ఉద్దీప్తే భవనే చ కూపఖననే ప్రత్యుద్యమః కీదృశః

ఇల్లుఒకమూల తగలబడూతూఉంటే, దానినిఆర్పడమునకు నుయ్యిత్రవ్వడముప్రారంభించడము ఎటువంటిది?

209. ఉద్యోగః పురుషలక్షణమ్.

ప్రయత్నమును విడువకుండడమే పురుషలక్షణము.

210. ఉపజీవంతి శక్త్యా హి జలజా జలదాని వా.

జలమునుంచిపుట్టేపైరులు స్వశక్తివల్లపుట్టినా మేఘములమీద ఆధారపడిఉంటవి.

211. ఉపజీవ్యోపజీవకయో రుపజీవకస్య ప్రాబల్యమ్.

ఉపజీవమంటే కారణము. ఉపజీవకమంటే కార్యము. కార్యమునకు కారణము విరోధముగాఉండకూడదుగనుక కార్యముకంటె కారణముప్రబలమైనదని భావము.

212. ఉపశదేశ్యానుపదేశత్వే విపరీతం బలమ్.

ఉపదేశింపవలసినవారికి తగినఉపదేశముచేయకపోతే విపరీతముగాపరిణమిస్తాడు. అప్పుడతడు బలవంతుడయినాకావచ్చును. బలహీనుడయినాకావచ్చును. ఆకాశము శబ్దగుణాత్మకముఅనిచెప్పి దానియందు నీలత్వమున్నదనిచెప్పకపోతే ఆకాశమునీలముగాఉండడము ప్రత్యక్షముగాకనబడుచుండడముచేత మొదటిఉపదేశమునకు బాధకలుగుచున్నది.

213. ఉపనయ న్నపనయన్ ధర్మో వికరోతి ధర్మిణమ్.

ఇప్పుడొకధర్మమును మరొకప్పుడుదానికివిరుద్ధమైనమరొకధర్మమును ఉపదేశిస్తే ధర్మముననుసరించేవాని మతిపోతుంది.

214. ఉపవాసా ద్వరం భిక్షా.

ఉపవాసముచేయడముకంటె భిక్షమెత్తుకొనిభోజనముచేయడము మంచిది.

215. ఉపాయేన హి యచ్ఛక్యం న తచ్ఛక్యం పరాక్రమైః

ఉపాయముచేత సాధించదగినదానిని పరాక్రమముచూపి సాధించలేము.

216. ఉపోషితస్య వ్యాఘ్రస్య పారణం పశుమారణమ్.

ఉపవాసముచేసిఉన్నపులికి పశువులనుచంపడమే పారణము.

217 ఉభయతస్పాశారజ్జున్యాయము.

రెండువైపులాకట్టబడిన త్రాడువలె. ఇటూఅటూ కదలలేకుండాఉండే అవస్థయందు ఈన్యాయమువర్తిస్తుంది.

218 ఉభయాభావే విశిష్టాభావః

విశేషణమూ విశిష్టమూకూడా లేకపోతే విశిష్టమనేదేఉండదు.

219 ఉష్ట్రకంటకభక్షణన్యాయము.

ఒంటె ముండ్లచెట్టుయొక్క ఆకులనుతింటూఉన్నప్పుడు ముండ్ల

వల్ల బాధకలిగినా ఆకులుతినడమువల్ల తృప్తి పొందుతుంది. అట్లే ఒక పనిచేసేటప్పుడు కొంచెముదుఃఖముకలిగినా దానివల్లకలిగేలాభమువల్ల కొంచెముఆనందముకూడా కలుగుతుంది.

220 ఉష్ట్రలగుడన్యాయము.

ఒంటెమీాదఎక్కి మోయించుకొనేవాడే దానిని కఱ్ఱతోకొట్టుతాడు. తనకుపకారముచేసినవానికి తిరిగీ అపకారముచేసినవాని విషయమై ఈన్యాయము వర్తిస్తుంది.

221 ఉష్ణ ముష్ణేన శీతలమ్.

వేడి వేడిచేతనే చల్లబడుతుంది.

222 ఊర్ణనాభిన్యాయము.

సాలెపురుగువలె. సాలెపురుగు తనలోనుండిబయలువెడలిన ఒకరీతిబంకతో దారములనుతీసి వలనుఅన్నుతుంది. అట్లే అవ్యక్తబ్రహ్మము వ్యక్తప్రపంచముగా విస్తరిస్తుంది

223 ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనః స్థవిర ఆయతి ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే.

ప్రాణములు మీాదికి ఎగిరిపోతవి. యౌవనుడు ముసలివాడవుతాడు. పెద్దలను మన్నించి నమస్కరించడముచేత ప్రాణములున్ను యౌవనమున్ను వస్తవి.

224. ఊషరవాపితబీజన్యాయము.

ఎడారిలోవిత్తిన విత్తువలె (నిష్ఫలమన్నమాట.)

225. ఊషరవృష్టిన్యాయము.

ఎడారిలోపడిన వర్షమువలె (నిష్ప్రయోజనమైనది.) చూ. సముద్రవృష్టిన్యాయము, జలతాడనన్యాయము, జలమంథనన్యాయము, శవోద్వర్తనన్యాయము, మృతమారణన్యాయము, పిష్టపేషణన్యాయము, అంధదర్పణన్యాయము, శ్వపుచ్ఛోన్నామనన్యాయము, కాకదంతపరీ

క్షా (గవేషణ) న్యాయము, గర్దభరోమగణనన్యాయము, అరణ్యరోదనన్యాయము, మూర్ఖసేవనన్యాయము, బధిరకర్ణజపన్యాయము, నహి వివాహానంతరం వరపరీక్షా, కృతేకార్యే కిం ముహూర్తప్రశ్న, సుప్త డింభముఖచుంబనన్యాయము.

226 ఊహాపోహన్యాయము.

ఒకదానిలోలీనమైయుండి ప్రత్యక్షముగాకనబడినదానిని తెలుసుకొనడము ఊహ లేనిదానిని ఉన్నదానినిగా ఆరోపించడము అపోహము. ఊహాపోహములు కలవాడంటే, ఒకవిషయమునుగురించి బాగుగా ఆలోచించేవాడని అర్థము.

227 ఋజుమార్గేణ సిధ్యతోఽర్థస్య వక్రేణ సాధనాఽయోగః

తిన్ననిమార్గమున ఫలముకలుగుతూఉన్నప్పుడు, వంకరమార్గమునవలంబించడము మంచిదికాదు.

228 ఋణవ్రణకలంకానాం కాలే లోపో భవిష్యతి.

అప్పు, పుండు, నింద-ఇవికాలక్రమమున కనబడకుండా పోతవి.

229 ఋతుమతీ కన్యకాన్యాయము.

ఋతుమతిఅయినకన్యక తల్లితదండ్రులనువిడిచిపెట్టి, వారిని ప్రేమింపక తనమగనిని ప్రేమించి, అతనినే ఆనందపరచి, అతనినేవింటూ, చూస్తూ, స్మరిస్తూ పతివ్రతయై ఉంటుంది. అట్లే, బ్రహ్మవిదుడువిషయసుఖములనువిడిచి, సంసారమునువిడిచి, బ్రహ్మయందేనిలిచి, అందే ఆనందముపొందుతూ ఉంటాడు.

230 ఏకచిత్తం ద్వయోరేవం కిమసాధ్యం.

ఇద్దరు ఒకమనస్సుతోపనిచేస్తే అసాధ్య మేముంటుంది ?

231 ఏకత్ర నిర్ణీతః శాస్త్రార్థోఽన్యత్రాఽపి తథా.

ఒక్కరీతిప్రతిపక్షవాదములలో ఒక్కదానిని ఒకసిద్ధాంతము

చేత నిరస్తముచేస్తే, తక్కినప్రతిపక్షవాదములుకూడా ఆసిద్ధాంతము చేతనే నిరస్తములౌతవి.

232 ఏకదేశవికృత మనన్యవ ద్భవతి.

ఒకవస్తువుకు కొంచెముమార్పుకలిగినా, ఆవస్తు వేఱవుతుందిగాని, మరొకవస్తువుగా మారిపోదు. కుక్కకుచెవులుగాని, తోకగాని కోసివేస్తే, గాడిదఅవుతుందా?

233 ఏకః పాపాని కురుతే ఫలం భుంక్తే మహాజనః.

ఒకడుపాపముచేస్తే, దానిఫలమును మహాజనులుకూడా అనుభవిస్తారు.

234 ఏకవాక్యత్వాపన్నానాం సంభూయైకార్థప్రతిపాదకత్వమ్.

ఒకఅర్థమును తెలుపడమునకు అనేకవాక్యములున్నప్పుడు ఆవాక్యములకన్నటికీ అర్థమొక్కటేఅవుతుంది. హరిహరబ్రహ్మలనేప్రత్యేకవ్యక్తులున్నట్లు చెప్పినా, అర్థముచేత అందరూ ఒక్కవ్యక్తియే.

235 ఏకవృంతగత ఫలద్వయన్యాయము.

ఒక్కకాడను అంటిపెట్టుకొనిఉన్న రెండుపండ్లవలె (శ్లేషలో ఒక్కశబ్దమును రెండుఅర్థములు అంటిపెట్టుకొని ఉంటవి.)

236 ఏకం సంధిత్సతోఽ పరం ప్రచ్యవతే.

ఒకటిచేయవలెననుకొంటే, మరొకటిఅయినట్లు తానొకటితలస్తే దైవమొకటితలస్తాడు. వేదవాక్యములనుండి పరబ్రహ్మమును సాధించడానికి ఆరంభించి, తుదకు వైష్ణవములోనికో, శైవములోనికోదిగినట్లు.

237 ఏకసంబంధిదర్శన మపరసంబంధిస్మారకమ్.

ఒగవస్తువుకనబడితే, దానితోసంబంధించిన మరొకవస్తువు కూడా జ్ఞాపకమువస్తుంది. మావటివానినిచూడగానే, ఏనుగుకూడా స్మరణకువస్తుంది. నదినిచూడగనే దానిఒడ్డునఉండేరెల్లుగడ్డికూడా జ్ఞాపకమునకువస్తుంది.

238 ఏకస్యా ప్యనేకశక్తిసంభవా దనేకార్థప్రత్యాయన మవిరుద్ధమ్.

ఒకశబ్దమునకు అనేకార్థములుంటే, ఆశబ్దప్రయోగమువల్ల అనేకార్థములు స్ఫురించడము తప్పుకాదు.

239 ఏకాకినీ ప్రతిజ్ఞా హి ప్రతిజ్ఞాతం న సాధయేత్.

ప్రతిజ్ఞమాత్రముచేయడముచేత అర్థములభించదు. (మూ. న హి ప్రతిజ్ఞామాత్రే ణార్థసిద్ధిః)

240 ఏకాక్రియా ద్వ్యర్థకరీ బభూవ.

ఒక్కపనితో రెండర్థములనుసాధించినట్లు, యజ్ఞాదికర్మములు మోక్షమునకు హేతువులగుటయేకాక, వర్షముకురిపించి, జగత్ స్థితి హేతువుకూడా అవుతవి.

241 ఏకా మసిద్ధిమ్ పరిహరతో ద్వితీయా ఆపద్యతే.

ఒకఅనర్థము తప్పించుకోంటే, ఇంకొకఅనర్థము సంభవించినట్లు.

242 ఏకోఽపి హంతి గుణలక్ష మపీహ దోషః
కశ్చి త్పరో యది గుణోఽస్తి న త ద్విరోధీ
మద్యస్య బిందురపి పావనపంచగవ్యం
సంపూర్ణ మత్ర కలశం మలినీకరోతి.

లక్షసద్గుణములున్నా, ఒక్కదుర్గుణముతో పోతవి. ఆతరువాత ఒక్కసద్గుణమున్నా ప్రయోజనకారి కానేరదు. పంచగవ్యముతో నిండియున్న కలశములో ఒక్కకల్లుచుక్కనువేస్తే అదిఅంతా చెడిపోతుందికదా?

243 ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః.

అనేకసద్గుణములున్నప్పుడు ఒక్కదోషమున్నా, అదికనబడదు.

సంపూర్ణ చంద్రునిలో ఒక్కమచ్చఉన్నా ఆదిగణనీయముకాదు.

244 ఏరండబీజన్యాయము.

ఆముదపుగింజను కాడనుండితీస్తే, పైకిఎగిరిపోతుంది. అట్లే, ఆత్మ దేహముతో సంబంధమును వదలుకొని ఊర్ధ్వగతిని పొందుతుంది. చూ. వ్యపగతలేపాలాబూన్యాయము.

245 ఐకమత్యే ద్వయోరేవ కిమసాధ్యం భవేదితి.

ఇద్దరికి ఐకమత్యముకుదురుతే అసాధ్యకార్యమేముంటుంది.

246 ఓతప్రోతన్యాయము.

బట్టలోనిపడుగు, పేకదారములవలె (జీవాత్మపరమాత్మలుకలసి ఉన్నారు.)

247 ఔపాధికాకాశభేద న్యాయము.

ఆకాశము అనంతమయినదయినా, కుండలు, ఇంకాఇతరఉపాధులయందుచేరి, చిన్నచిన్నభాగములుగా విడబడుతుంది. అట్లే, పరమాత్మఅనంతమయినదయినా, వివిధదేహములందువ్యాపించి, ప్రత్యేకవ్యక్తులుగా కనబడుతుంది.

248 ఔషధార్థం సురాం పిబేత్.

ఔషధముగా కల్లుతాగవచ్చును.

249 కంటకన్యాయము.

కంటకశబ్దమునకు ముల్లు, శత్రువు, అని రెండర్థములున్నవి. కాలిలోముల్లుగ్రుచ్చుకొన్నప్పుడు దానిని మరిఒకముల్లుతోపైకితీసి రెండు ముళ్ళను ముస్ముందు తిరిగిగ్రుచ్చుకోకుండా నిప్పులోవేసినట్లు, శత్రువునుసాధించడమునకు మరిఒకశత్రువుసహాయముతో మొదటివానిని నాశనముచేసి, తరువాత తనకుసహాయముచేసిన శత్రువునుకూడా నాశనముచేయవలెను.

250 కంఠచామీకరన్యాయము.

కంఠములో బంగారుభూషణమునుంచుకొని "అయ్యో, నాభూషణమేదీ, ఎక్కడపోయిందో, అని వెదకుకొంటూఉంటే, "అదిగో నీ మెడలోనేఉన్నది" అనిచూపించినప్పుడు "ఆఁ, ఉన్నది" అని ఊరడిల్లినట్లు, బ్రహ్మమును తనహృదయములోనే ఉంచుకొని దానికై ఎక్కడెక్కడనో వెదకుతూ ఉన్నవానికి గురువు, "ఎందుకట్లువెదకుకొంటావు బ్రహ్మము నీహృదయములోనేఉన్నది, చూచుకో" అనిచెప్పినప్పుడు శిష్యుడు సమాధానముపొందుతాడు.

251 కడారాన్యాయము.

"కడారాకర్మధారయే"అని పాణినీయసూత్రము. కడారాః అనే బహువచనముచేత కడారాదులు అని ఆదిశబ్దముగ్రహింపబడుతున్నది. బహువచనముచేత ఆశబ్దముధ్వనితమైనప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

252 కణశః క్షణశశ్చైవ విద్యా మర్థంచ సాధయేత్.

కొంచెముకొంచెముగా, క్షణక్షణమూ, విద్యనూ ధనమునూ సంపాదించవలెను.

253 కథయతి సంవృతిరేవ కామితాని.

కోరికలను దాచుకొనడముచేతనే అవి బయలుపడుతవి.

254 కందుకన్యాయము

బంతిని క్రిందికిపడవేస్తే తిరిగీ మీదికిఎగురుతుంది. అట్లే ఉత్తముడయినవాడు కష్టములలోపడినా వెంటనే అందులోనుంచి బయటికి వస్తాడు.

255 కదంబముకులన్యాయము.

కదంబపుష్పముయొక్కమధ్య గోళాకారముగాఉండే భాగము చుట్టూ అనేకఇతరపుష్పములు ఏర్పడేటట్లు (ఒకశబ్దమునకు సందర్భభేదముచేత అనేకఅర్థములు బయలుదేరుతవి.)

256 కదర్యాణాం పరే ప్రాణాః ప్రాయే ణార్థసంచయాః.

లోభివాండ్లకు సాధారణముగా తమధనమే ప్రాణము.

257 కదలీఫలన్యాయము.

అరటిచెట్టుగెలవేసి పండ్లుపండగానే చెట్టునునరకివేస్తారు. చూ. అశ్వతరీగర్భ వృశ్చికీగర్భ న్యాయములు.

258 కనకకుండలన్యాయము.

బంగారమునకున్ను కుండలమునకున్ను ఆకారములో మాత్రమే భేదము కాని, వస్తుతః భేదములేదు. బంగారముకారణమున్ను కుండలముకార్యమున్ను అయిఉన్నవి. ఆరెండిటికిన్ని భేదములేదు. అట్లే బ్రహ్మముకారణముగా గల జగత్తు అతనినుండి వేరైనదికాదని తెలుసుకోవలెను.

259 కపింజలాధికరణన్యాయము.

కపింజలమనగా తిత్తిరిపక్షి. మీమాంసాశాస్త్రములో 'కపింజలానాలభేత' అనిఉన్నది. కపింజలాన్ అనేది బహువచనములో ఉండడముచేత రెండింటికంటె ఎక్కువతిత్తిరిపక్షులను (అనగామూడు, నాలుగు, ఐదు, అంతకంటేఎక్కువ సంపాదింపవలెనని అర్థము.)

260 కః ప్రాజ్ఞో వాంఛతి స్నేహం వేశ్యాసు సికతాసు చ.

ప్రాజ్ఞుడయినవాడెవడు వేశ్యలయందుస్నేహమున్ను ఇసుకలో నూనెనున్ను పొందగలడు?

261 కఫోణిగుడన్యాయము

చేతిమునుకుమీద బెల్లములేకపోయినా ఉన్నదనుకొని దానిని నాకడము. ఒకవస్తువుప్రాప్తించకపోయినా అదిప్రాప్తించినట్లే సంబరపడడముఇట్టిదే.

262 కరకంకణన్యాయము.

"కంకణము" అంటేనే కరభూషణము అనిఅర్థము. అందుచేత కరకంకణము అని చెప్పనక్కరలేకపోయినా అట్లుకలిపిఉచ్చరిస్తాము.

('ముంజేతికంకణమునకద్దమేల.' అనే తెనుగుసామెతయొక్క అర్థమును కూడా పైన్యాయమునకు చెప్పవచ్చును.) చూ. కరిబృంహితన్యాయము, గజఘటాన్యాయము, నీలేందీవరన్యాయము, చంద్రజ్యోత్స్నాన్యాయము, పర్వతాధిత్యకాన్యాయము, పర్వతోపత్యకాన్యాయము, వాజిమందురాన్యాయము, మృగవాగురన్యాయము,)

263 కరతలామలకన్యాయము.

చేతిలోని ఉసిరికాయవలె స్పష్టముగాకనబడేది.

264 కరస్థబిల్వన్యాయము.

చేతిలోనిమారేడుపండువలె (అంతస్పష్టముగాకనబడేది అన్నమాట.) చూ. హస్తామలకన్యాయము.

265 కరిఘంటాన్యాయము.

దేహబలముకంటె బుద్ధిబలముఎక్కువ అనిచెప్పవలసినప్పుడు ఈన్యాయముపనికివస్తుంది.

266 కరిబృంహితన్యాయము.

ఏనుగుయొక్క ఆర్పుకే బృంహితమని పేరు. అందుచేత బృంహితశబ్దముచేతనే కరిబృంహితమని అర్థమవుతూఉంటే, కరిబృంహితముఅని చెప్పడము అనవసరమయినా అట్లుకలిపి పలుకుతూఉంటాము. చూ. గజఘటాన్యాయము, కరకంకణన్యాయము, నీలేందీవరన్యాయము, చంద్రజ్యోత్స్నాన్యాయము, పర్వతాధిత్యకాన్యాయము, పర్వతోపత్యకాన్యాయము, వాజిమందురాన్యాయము, మృగవాగురన్యాయము.)

267 కర్ణకౌంతేయన్యాయము.

కర్ణుడుకుంతికొడుకేఅయినా ఆసంగతి తెలియక రాధకొడుకుననుకొన్నాడు. తరువాత కుంతికొడుకునని తెలుసుకొన్నప్పుడు కౌంతేయుడననుకొన్నాడు. అట్లే అజ్ఞాని మొదట దేహమేఆత్మఅని అనుకొన్నా,

సద్గురూపదేశముచేత ఆత్మ వేరని తెలుసుకొంటాడు. చూ. రాజపుత్ర వ్యాధన్యాయము.

268 కర్తవ్యం హి సతాం వచః.

మంచివారిమాటప్రకారము చేయవలెను.

269 కర్మణి వ్యజ్యతే ప్రజ్ఞా స్వస్థే కో వా న పండితః.

ఊరకఉన్నంతసేపూ అందరూపండితులే. పనిచేసేటప్పుడుమాత్రము ప్రజ్ఞకనబడుతుంది.

270 కష్టంకర్మ.

కర్మకష్టమునకుమూలము. లోకములోనిదుఃఖము కర్మమూలముగానే కలుగుతున్నది. కర్మలనుగురించి తెలుసుకోవడము కష్టమని భగవద్గీతలలో ఇట్లుచెప్పబడుచున్నది.

కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః.

271 కష్టే ఫలమ్.

కష్టపడితేనే ఫలముకలుగుతుంది.

272 క్షణభంగి జగత్సర్వ మితి తథ్యం మునే ర్వచః

జగత్తంతాక్షణభంగురమని మునులుచెప్పినమాట సత్యము.

273 క్షతే ప్రహారా నిపతం త్యభీక్ష్ణమ్.

దెబ్బతగిలినచోటనే దెబ్బలుతగులుతవి.

274 క్షతే మక్షికాపాతః.

పుండుమీదవాలినఈగవలె. తప్పులనుమాత్రమే ఎంచేవారివిషయమై ఈన్యాయమునుచెప్పుతారు.

275 క్షారం క్షతే ప్రక్షేపణమ్.

గాయముమీద ఉప్పుజల్లినట్లు (దుఃఖితుడైనవానిని మరింత దుఃఖపెట్టడము.)

276 క్షీణా నరా నిష్కరుణా భవంతి.

కడుపుకుకూడులేనివారు భార్యాపుత్రులమీద కరుణ లేక ఉంటారు.

277 క్షీరదగ్ధజిహ్వాన్యాయము.

వేడిపాలచేత కాలిననాలుకవలె. దైవవశముచేతసంభవించిన ఒక సుఖముమూలముగా దుఃఖముసంభవించినప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది.

278 క్షీరం విహాయారోచకగ్రస్తః సౌవీరరుచి మనుభవతి.

అరోచకముకలగినవాడు పాలనుతాగక రేగుపండ్లనుతినగోరుతాడు. జ్ఞానముమీదరుచిలేనివాడు శాస్త్రములనభ్యసింపక, తుచ్ఛకావ్యములను చదువుతాడు.

279 క్షీరాబ్ధివాసి క్షీరకామన్యాయము.

పాలసముద్రములో వాసముచేసేవాడు, పాలకోసము వెదకులాడినట్లు.

280 క్షీరోదక సంపృక్తన్యాయము.

పాలూనీళ్ళూ కలసిఉన్నట్లు. ఏదిఏదో తెలుసుకోలేనట్లు రెండు వస్తువులుకలసిఉన్నప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది.

281 క్షుత్ స్వాదుతాం జనయతి.

ఆకలిఉంటేరుచిపుట్టుతుంది. జిజ్ఞాసఉంటేచదువువంటపడుతుంది.

282 కాకతాలీయన్యాయము.

'కాకీవాలేది పండూపడింది' అని తెలుగుసామెత. అనుకోకుండా ఒక ఫలముకలుగునప్పుడు ఈన్యాయమును ఉదాహరిస్తారు. (చూ. అజాకృపాణీయన్యాయము.)

283 కాకదంతపరీక్షా (గవేషణ) న్యాయము.

కాకికిదంతములున్నవా? లేవా? అవి తెల్లగాఉండునా, ఉండవా?

అని పరీక్షచేసినట్లు (నిష్ప్రయోజనమన్నమాట.) చూ. ఊషరవృష్టి న్యాయము, మొ న.

284 కాకదధ్యుపఘాతకన్యాయము.

"పెరుగును కాకులుముట్టుకోకుండా చూస్తూఉండుమని ఒకమూర్ఖునితోచెప్పగా, కుక్క వచ్చి పెరుగుతాగివేస్తూఉంటే చూచి, కాకులుముట్టుకోకుండా చూడుమన్నారుగాని, కుక్కలుముట్టుకుంటే ఏమి చేయవలెనోచెప్పలేదని ఊరకొన్నాడట.

285 కాకపికన్యాయము

కాకీనలుపే, కోకిలానలుపే, వసంతకాలమువస్తే ఏదికాకియో ఏదికోకిలయో, తెలిసిపోతుంది. అట్లే, సభలోమాట్లాడడమునుబట్టి ఎవడుపండితుడో, ఎవడు అపండితుడో తెలుస్తుంది. చూ. కాచమణి న్యాయము, గోగవయన్యాయము.

286 కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభమ్.

తిందామంటే, కాకిమాంసమయినాదొరకలేదు. కుక్కరుచిచూచిన ఆహారమయినాదొరకలేదట. "కానికూడుతిన్నా,కడుపునిండలేదు" అని తెలుగుసామెత.

287 కాకాక్షిగోలకన్యాయము.

కాకి ఒక్కకంటితోచూస్తూఉన్నా, కనుగుడ్లుతిప్పుతూ అన్నిప్రక్కలాచూస్తూఉన్నట్టు కనబడుతుంది.

288 కాకిణీన్యాయము.

కాకిణి అంటే కాణి అనే నాణెము. డబ్బుమూలముగా, అన్నదమ్ములకున్ను, భార్యాభర్తలకున్ను, స్నేహితులకున్ను, శత్రుత్వము కలుగుతుంది.

289 కాంచనం కార్యసిద్ధిః.

ధనమే కార్యసిద్ధిని చేస్తుంది.

290 కాంచనాత్ కర్మమోచనమ్.

డబ్బిచ్చి కర్మమునుపోగొట్టుకోవచ్చు ననుకొన్నట్లు.

291 కాచమణిన్యాయము.

గాజుముక్కా, మణీ, ఒక్కరీతిగానేమెరుస్తవి. కాని, పరీక్షచేస్తే ఏదిగాజుముక్కో, ఏదిమణియో తెలుస్తుంది. అట్లే, పండితుడున్న అపండితుడున్నూ. చూ. కాకపికన్యాయము. గోగవయన్యాయము.

292 కాంతారన్యాయము.

ప్రయాణికుడు అడవి దగ్గరపడగానే ఒకబిడారులోనికిచేరి, వారి సహాయముతో అడవినిదాటగానే, తనదారినితానుపోతాడు.

293 కాంతారోత్తరణాయ సార్థః.

దట్టమైనఅడవినిదాటడమునకు అనేకులుకలిసి వెళ్ళేటట్లు కష్టసమయములో దానినిదాటుటకు అనేకులు ఐకమత్యము కలిగిఉంటారు.

294 కామచారశ్చ వతినిర్దేశే వాక్యశేషం సమర్థయితుమ్.

'అటువంటి,వాడు అనిచెప్పినప్పుడు, ఆశబ్దమువల్ల తెలియబడే గుణములన్నీ ఉంటే ఉండవచ్చును. లేకపోతే లేకపోవచ్చును. కూతురు తల్లివలెఉన్నది అనిఅంటే, తల్లిగుణములన్నీ కూతురిలో ఉండనక్కరలేదు.

295. కామాకులకామినీన్యాయము.

ప్రియునికోసము పరితపిస్తూఉన్న కామినివలె (జీవాత్మపరమాత్మలో ఐక్యముపొందడమునకు ఉత్సాహపడుతుంది.)

296. కారణగుణప్రక్రమన్యాయము.

కారణమేగుణములగలిగిఉంటుదో దానివల్లపుట్టే కార్యముకూడా అదేగుణములను కలిగిఉంటుంది. తెల్లనిసూలుతోనేసినబట్ట తెల్లగానేఉంటుంది. చేతనుడైన బ్రహ్మ ఈజగత్తునకుకారణము గనుక జగత్తుకూడా చైతన్యస్వరూపమునే కలిగిఉన్నది. ఈవిషయమే ఈక్రిందిశ్లోకములో చెప్పబడినది.

"హరిరేవ జగ జ్జగదేవ హరి ర్హరితో హి జగ న్నహి భిన్నతనుః
ఇతి యస్యమతి స్సతంతం స్మరతి స నరో భవసాగరము త్తరతి."

297 కారణనాశే కార్యనాశః

కారణమునశిస్తే కార్యముకూడా నశిస్తుంది. బట్టలలోని నూలు పోతే బట్టకూడా లేకుండాపోతుంది.

398 కారయితుః కర్తృత్వమ్.

చూ. యః కారయతి స కర్తైవ.

299 కార్యకారణభావనియమో ఒతిప్రసంగం భంక్తు మర్హతి.
కారణమునకున్ను కార్యమునకున్ను ఎడ తెగనిసంబంధమున్నదని తెలుసుకొంటే అతిప్రసంగమునకు అనగా అసంబద్ధవాక్యములకు తావుండదు.

300 కార్యనాశే కారణనాశః

కార్యమునశిస్తే కారణముకూడా నశిస్తుంది. బట్టనాశనమయితే దానిలోనిసూలుకూడా నాశనమయినట్టే.

301 కార్యవిపరిణామా త్సిద్ధమ్.

ఒకకారణము మారడముచేత కార్యముసిద్ధిస్తుంది. కార్యకారణములకుఅభేదము. కారణమే కార్యముగా పరిణమిస్తుంది.

304 కార్యం సర్వం కారణమాత్రమ్.

కార్యమంతా కారణమువల్లనేకలుగుతుంది. కారణము లేనికార్యము ఉండదు.

305 కార్యాత్కారణజన్మ.

కార్యమునుండి కారణముపుట్టడము. "నీటిలోనుండి పద్మము పుట్టడమెరుగుదుముగాని పద్మములోనుండి నీరుపుట్టడము ఎరుగము. ఓవిష్ణువా, నీపాదపద్మమునుండి మహానది (గంగ) పుట్టడము చిత్రముగాఉన్నది. "కొండమీద లతలుపుట్టడమెరుగుదుముగాని లతలనుండి

కొండలు పుట్టడము ఎరుగము. నీతనులతనుండి కుచగిరులుపుట్టడము చిత్రముగాఉన్నది' 'పంకములోనుంచి పంకజముపుట్టడము ఎరుగుదుముగాని పంకజములోనుండి పంకజముపుట్టడము ఎరుగము. నీముఖపంకజములోనుండి రెండునేత్రపద్మములుపుట్టడము విచిత్రముగాఉన్నది''

306 కార్యేణ కారణసంప్రత్యయః

కార్యమునుబట్టి కారణమునుఊహింపవచ్చును. కుండనుచూచి కుమ్మరివాడు అనే కారణమున్ను జగత్తునుచూచి దానికి కారణమైన ఈశ్వరుని ఊహింపవచ్చును.

307 కాలస్య కుటిలాగతిః

కాల మొక్కరీతిగాజరుగదు. సుఖమువెంట దుఃఖమూ దుఃఖము వెంటసుఖమూ కలుగుతూఉంటవి.

308 కాలో హి బలవత్తరః

కాలమన్నిటికంటె బలవంతమయినది. ప్రతివానికీ చావుతప్పదన్నమాట.

309 కాంస్యభోజనన్యాయము.

శిష్యుడొకడు "గురువుగారిఉచ్ఛిష్టమునుతినవలెను. కంచుకంచములోతినవలెను" అని నియమముపెట్టుకోగా, గురువు శిష్యునినియమమునకు భంగముకలుగకుండా కంచములో తినప్రారంభించినాడట.

310 కింకరస్థానే కింకరద్వయం నివేశితమ్.

ఒక్కసేవకుడు చాలి ఉన్నచోట ఇద్దరుసేవకులు కావలసివచ్చినట్లు.

311 కిం కులే నోపదిష్టేన శీలమేవాత్ర కారణమ్.

కులమునుచెప్పుకోవడమెందుకు? శీలమే ముఖ్యమయినది.

312 కి మజ్ఞానస్య దుష్కరః

అజ్ఞాని చేయలేనిదేమున్నది? (అన్నిటికీ సిద్ధపడుతాడు)

313 కీటభృంగన్యాయము.

గొంగలిపురుగు తేనెటీగతో పొందుకోరి పురుగుగాఉంటే తేనెటీగ తనకుహానికలుగజేస్తుందని తానున్న తేనెటీగగా మారి దానితో సఖ్యముచేస్తుంది.

314 కీటోద్ధారన్యాయము.

నీటిప్రవాహములో కొట్టుకొనిపోతూఉన్న పురుగులను ఎవ్వరైనా తీసి, ఒడ్డునవేస్తే అవి మెల్లగా ఒకచెట్టునుచేరి సుఖపడుతవి. అట్లే సంసారప్రవాహములో కొట్టుకొనిపోతూ దుఃఖము పొందుతూఉన్న సంసారికి సద్గురువు తత్త్వోపదేశముచేస్తే పూర్వజన్మకృతసుకృతముచేత వాడు మోక్షసుఖము లనుభవిస్తాడు.

315 కీలప్రతికీలన్యాయము.

చక్రములనుకలిపే ఇరుసుకట్లను రెండువైపులా రెండుమేకులను బిగిస్తారు. అప్పుడు చక్రములు ఆఇరుసుకట్లనుండి జారిపోవు. అట్లే ఒక సిద్ధాంతమునకు హానికలుగకుండా దానికిఉపబలముగా ఇతరఉపపత్తులనుకల్పించడము.

316 కుకర్మ సర్వస్య ఫల త్యాత్మని సర్వదా.

దుష్టకర్మము ఎప్పుడూ దానినిచేసినవానికే దుష్టఫలము నిస్తుంది.

317 కుక్కుటధ్వానన్యాయము.

కోడికూత హ్రస్వ దీర్ఘ ప్లుతములుగా అంతకంతకూ ఎక్కువ అయినట్లు సజ్జనమైత్రికూడాను. చూ. పరాహ్ణచ్ఛాయాన్యాయము.

318 కుంజరస్నానన్యాయము.

మంచిపనినిచేసి చేసినదానిని పాడుచేసుకొనేటప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది. ఏనుగు నీటిలో చక్కగా చాలాకాలముస్నానముచేసి ఒడ్డుకురాగానే తొండముతో ధూళినెత్తి ఒంటిమీదపోసుకొంటుంది.

319 కుండధారోపాస్తిన్యాయము

కుండధారుడనే ఒకయక్షు డుండేవాడట. వానిని ఒకడుకొలిచి ఒకవరముకోరినాడు. ఆవరము ఇవ్వడమునకు ఆయక్షునికి శక్తి చాలకపోగా యక్షుడు తనకంటెగొప్ప దేవతలను ప్రార్థించి తనభక్తునికి వరముల నిచ్చి నాడట. తనయెడల భక్తిశ్రద్ధలుకలవానికి ఉపకారముచేయడానికి శక్తి లేకపోయినా మంచివాడు ఇతరులచేతనయినా ఉపకారము చేయిస్తాడు.

320 కుబ్జోఽపి చిత్రం శయితుం సమీహతే.

మరుగుజ్జువాడుకూడా (భార్యతో) పరుండుటకు కోరుతాడు. చూ॥ భేకోఽపి పాదప్రసరణాయ చేష్టతే.

321 కుంభీధాన్యన్యాయము.

'కుంభి' అంటే కుండ. 'కుండలోధాన్యము పోసుకొనేవానికి గోవునుదానముచేయవలెను' అని అనేటప్పుడు ధాన్యముగలవారు ధనవంతులయినాకుండలలో ధాన్యము పోసుకోవచ్చును గనుక అట్టివారందరికీ గోదానము చేయవలెననిఅభిప్రాయముకాదు. కుంభీధాన్యుడు అంటే శ్రోత్రియుడు అని అర్థము. శ్రోత్రియునికి గోదానముచేయవలెననియే అర్థము. ఒకమాటకు వ్యుత్పత్తినిబట్టి ఒకఅర్థమున్నా దానికి రూఢిగా ఏఅర్థముకలిగినదో ఆఅర్థమునే తీసుకోవలెను.

322 కుమారీకంకణన్యాయము.

ఈన్యాయము ఈక్రిందిశ్లోకములోనిది.

"బహూనాం కలహో నిత్యం ద్వాభ్యాం సంఘర్షణం తథా
ఏకాకీ విచరిష్యామి కుమారీకంకణం యథా."

323 కుమూలధాన్యన్యాయము.

ధాన్యపుకొట్టులోనుంచి కొంచెముకొంచెముగా ధాన్యముతీసినట్లు (పరబ్రహ్మములోని ఒకఅంశమువల్ల జగుత్తు ఏర్పడుతున్నది.)

324 కులకన్యాన్యాయము.

సౌందర్యాది గుణములుగల కులకన్యక తనపుట్టింటిలోమాత్రి

మే గౌరవింపబడుతుంది. అట్లే ఇంటింటా కవులున్నా వారి కవిత్వము వారియింటిలోనే మెచ్చుకోబడుతుంది. మహాకవియొక్క కవిత్వముమాత్రమే లోకప్రసిద్ధినిపొందుతుంది.

323 కులాలచక్ర కీటన్యాయము.

కుమ్మరవానిచక్రముమీదఉన్న పురుగు చక్రవేగముతోతిరిగినట్లు, (సంసారచక్రముమీదనిలచిఉన్న దేహికూడాను.)

324 కులాలచక్రన్యాయము.

కుమ్మరివాడు చక్రము గట్టిగాతిప్పి వదలివేసినా ఆచక్ర మట్లే కొంతకాలమువరకూతిరిగి, తుదకు ఆగిపోతుంది. అట్లే జ్ఞాని కర్మలనుండివిరమించినా, దేహపాతమువరకూ కర్మలను ఫలమునుకోరక చేస్తూనే ఉంటాడు.

325 కుశ కాశా లంబనన్యాయము.

నీటిలోపడి మునిగిపోతున్నవాడు చేతికిదొరకిన గడ్డిపోచనయినా పట్టుకొని ప్రాణరక్షణము చేసుకోవలెననుకొంటాడు. అట్లే సరియైనయుక్తులనుచెప్పలేక వాదములో ఓడిపోయినవాడు దుర్బలమైన కుయుక్తులనుకల్పించి తృప్తిపొందుతాడు.

326 కుసుమ స్తబకన్యాయము.

పూవులగుత్తి సుందరులతలమీదనయినా ఉంటుంది, లేదా అడవిలోవాడి రాలిఅయినాపోతుంది. అట్లే మహాత్ముడయినవాడు అందరికంటెఅగ్రస్థానమందయినాఉంటాడు, లేదా, అడవిలో తపస్సయినాచేసుకొనడమునకు పోతాడు.

327 కుహకచకితో లోకః సత్యేఽ ప్యపాయ మపేక్షతే.

ధూర్తులచేతమోసముపొందినవాడు సత్యములోకూడా అపాయ మున్నదనుకొంటాడు.

328 కూపకూర్మన్యాయము.

ఆయుష్కాలమెల్ల ఉన్నఊరిని వదలివెళ్ళనివాడు నూతిలోని తాబేలునంటివాడు.

323 కూపఖానకన్యాయము.

నుయ్యిత్రవ్వినవాడు నూతిలోదిగినప్పుడు బురదఅంటుకొంటే పైకివచ్చి ఆనూతినీటితోనే కడుగుకొంటాడు. అట్లే భిన్నభిన్న దేవతల నారాధించేవారు ఆఆరాధనమహిమచేత భేదబుద్ధినివదలి అజ్ఞానము నుండి విముదల అవుతారు.

330 కూపమండూకన్యాయము

నూతిలోనికప్ప నూయియే మహాసముద్రమనుకొంటుంది. మహాసముద్రమొకటి నూతికంటె ఎక్కువనీరుగలది అని దానికిచెప్పితే అది నమ్మదు. అట్లే అల్పజ్ఞుడైనమూర్ఖుడు తనకుసర్వమూ తెలుసునను కొంటాడు. వానికి సత్యమునుగురించిచెప్పితే తెలియదు. దానిని నమ్మడు.

331 కూపయంత్రఘటికాన్యాయము.

నీటినితోడేపతమువలె జనులు కొన్నిసమయములలో దారిద్ర్యమునసుభవిస్తారు. కొన్నిసమయములలో భాగ్యమునుపొందుతారు. లేదా గంభీరమయినజ్ఞానమును పొందడానికి గురూపదేశము పతముము వంటిది.

334 కూర్మవృత్తిం సమాస్థాయ సర్వత్ర విజయీ భవేత్.

తాబేలువలె మెల్లగాప్రయత్నముచేస్తూఅన్నివోట్లాని జయము పొందవలెను.

335 కూర్మాంగన్యాయము.

తాబేలు తనయిష్టమువచ్చినప్పుడు తన అవయవములను పైకి ప్రసరింపజేస్తుంది, ఇష్టమువచ్చినప్పుడు వాటిని లోపలికిలాగుకొంటుంది. అట్లే జ్ఞానిఅయినవాడు తనకామములను ఉపసహరించుకొంటాడు.

334 కృతప్రణాశా ఽకృతాభ్యాగమప్రసంగః

పుణ్యమునశిస్తే పాపఫలము వెంటనేకలుగుతుంది.

335 కృతే కార్యే కిం ముహూర్తప్రశ్నేన.

కార్యముజరిగిపోయినతరువాత ముహూర్తమునుగురించిప్రశ్నించడమువలె (నిష్ప్రయోజనమన్నమాట.) చూ.ఊషరవృష్టిన్యాయము, మొద.

336 కృత్రిమాకృత్రిమయోః కృత్రిమే కార్యసంప్రత్యయః

కృత్రిమమైనఅర్థముగలశబ్దము సహజమైనఅర్థముగలశబ్దము అనువానిలో కృత్రిమార్థముగలశబ్దమున కెక్కువప్రామాణ్యము. "గోపాలునితీసుకొనిరా" "కటజకునితీసుకొనిరా" అన్నప్పుడు గోపాలుడు, కటజకుడు అనేశబ్దములు సంజ్ఞావాచకములు, పురుషుల పేళ్లు. అందుచేత పై వాక్యములకు ఆవులకాపరినితీసుకొనిరా, మంచముమీదపుట్టినవానినితీసుకొనిరా అని అర్థముకాదు. గోపాలునితీసుకొనిరా, మాణవకునికి చదువుచెప్పుతాడు అన్నప్పుడు కఱ్ఱపట్టుకొని ఆవులనుకాచేవాడు చదుఫుచెప్ప లేడుగదా,

337 కృతాత్యయే ఽనుశయవాన్.

చేసినపనివిఫలమయితే ఈపనిఎందుకుచేసినాను అని పశ్చాత్తాపముకలుగుతుంది. కర్మఫలమునశిస్తే కర్మాచరణమునుంచి నివృత్తి కలుగుతుంది.

338 కృదభిహితో భావో ద్రవ్యవత్ ప్రకాశతే.

•ఒకద్రవ్యముకావలెననికోరేవానిభావము ఆద్రవ్యము ఎదురుగాఉండేటట్లు తోపజేస్తుంది.

339 కైదారికన్యాయము.

వ్యవసాయదారుడు కాలువలోనుంచి ఒకపొలమునకు నీరుపెట్టి ఆకన్నమునుకప్పి, మరిఒకచోటకన్నముచేసి మరిఒకపొలమునకు నీరుపె

ట్లేటట్లు ముముక్షువు వైరాగ్యముచేత విషయములనునాశనముచేసి, అభ్యాసముచేత కల్యాణమునుపొందుతాడు.

340 కైముతికన్యాయము.

ఒకదానికిదిక్కులేనప్పుడు అంతకంటెతక్కువదాని కేమిదిక్కు? ఏనుగు లేపారిపోతూఉంటే దోమలమాటచెప్పే దేమిటి? ఆమెముఖము చంద్రినేజయించినది, పద్మములమాట చెప్పే దేమిటి?

341 కోటిశో దృశ్యమా నోపబృంహణన్యాయము.

కనబడనివస్తువు ఎంత పెద్దదిగాఉన్న దనిఅయినా అనుకోవచ్చును. అదికనబడితేమాత్రము అది ఇంతఉన్నదిఅని పరిమితినిపొందుతుంది.

342 కోపః పాపస్య కారణమ్.

కోపము పాపమును చేయిస్తుంది.

343 కో౽రుక్? హితమితభుక్.

రోగములేనివాడెవడు? హితమైనఆహారమును మితముగాతినే వాడు.

344 కోశవాన్ పండితః ఖలు.

డబ్బున్నవాడే పండితు డనిపించుకొంటాడు.

345 కోశవా నాచార్యః.

నిఘంటువును ఒప్పజెప్పగలవాడు ఆచార్యుడు.

346 కోష్ఠపానన్యాయము.

ఇంటిలోమాత్రమే కల్లుత్రాగడము. ఇతరులకు తెలియకుండా దుర్వ్యసనములను అనుభవించడము.

347 క్రమవిపర్యాసన్యాయము.

క్రమముతప్పించి పనిచేయడము. ముందుచేయవలసినపని వెనుకనున్న వెనుకచేయవలసినపనిని ముందున్న చేయడము.

348 క్రియాభేదా త్ఫలభేదః.

పనినిబట్టి ఫలముకూడాకలుగుతుంది. ఎవ డెంతప్రయత్నము చేస్తే అంతేఫలము కలుగుతుంది.

349 క్రియాసిద్ధి స్సత్త్వేభవతి మహతాం నోపకరణే.

గొప్పవారు గొప్పపనిచేయడమునకు వారిమహత్త్వమే కారణ మవుతుంది గాని, వారుఉపయోగించే సాధనముకాదు. అగస్త్యుడు కుండలోపుట్టినాడు, ఎప్పుడూ లేళ్ళతో అడవులలోతిరిగినాడు, భూర్జప త్రములబట్టను కట్టినాడు, దుంపలనుతినిబ్రతికినాడు. అయినా, సముద్ర మును దోసిటిలోనికి తెచ్చుకొని త్రాగివేసినాడు.

350 క్రియా హి వికల్ప్యతే న వస్తు.

ఒకవస్తువునుగురించిన అభిప్రాయములు వారివారిభావసంపత్తి ప్రకారము వేర్వేరుగాఉన్నా,ఆవస్తువుమాత్ర మొక్కటేఅయిఉంటుం ది. అగ్ని,విష్ణుశివాదిభావనలచేత జనులుభావించినాపరమాత్మ ఒక్కడే.

351 ఖపుష్పన్యాయము.

ఆకాశపుష్పమువలె, ఎక్కడాలేనిది.

352 ఖరీవిషాణన్యాయము.

గాడిదకొమ్ములవలె. లేనివస్తువునుగురించిచెప్పేటప్పుడు ఈన్యా యమువర్తిస్తుంది. చూ. గగనారవిందన్యాయము, మొదలైనవి.

353 ఖలేకపోతన్యాయము.

ముసలివి, మధ్యవయస్సులోనివి, చిన్నవి, అయిన పావురముల న్నీ ఒక్కసారిగా నేలకువ్రాలేటట్లు ఒకవాక్యములో అనేకపదములు న్నా,వాటిఅర్థములన్నీ ఒక్కసారిగానేస్ఫురించును. కుండనుతీసికొనిరా అన్నప్పుడు ఒకక్షణములో కుండయొక్కస్మరణము, మరిఒకక్షణములో దానినితీసుకొని రావడమునేస్మరణము,మూడోక్షణములో మొదటిశబ్దము యొక్కస్మరణముపోయి ఏమిచేయవలెనోతోచకపోవడముసంభవింపదు. వాక్యముయొక్క అర్థమంతా ఒక్కసారిగానే స్మరణమునకు వస్తుంది.

354 ఖాదకఘాతకన్యాయము

తినేవారే చంపేవారుకూడాను. గోత్రమాంసము తినేవారుండే దేశములో గోత్రాలనుచంపేవారుండరని అనుకోకూడదు.

355 గగనరోమంథన్యాయము

ఆకాశమును నెమరువేయడము. అసంభవవస్తువుకోసము ప్రయత్నముచేయడము. చూ. ఆకాశముష్టిహననన్యాయము,పవనతాడనన్యాయము.

356 గగనారవిందన్యాయము

ఆకాశముమీది తామరపువ్వువలె అసంభావ్యమన్నమాట. చూ. మూషకవిషాణన్యాయము, శశవిషాణన్యాయము.

357 గజఘటాన్యాయము.

గజశబ్దమున్ను ఘటాశబ్దమున్ను పర్యాయపదములే అయినా గజఘటాఅని కొందరు రెండుశబ్దములనూకలిపిచెప్పుతారు. (చూ. కరిబృంహితన్యాయము, కరకంకణన్యాయము, నీలేందీవరన్యాయము, చంద్రజ్యోత్స్నాన్యాయము, పర్వతాధిత్యకాన్యాయము, పర్వతోపత్యకాన్యాయము, వాజిమందురాన్యాయము, మృగవాగురాన్యాయము.

358 గజభుక్తకపిత్థన్యాయము.

ఏనుగతిన్న వెలగకాయవలె (ధనముఎట్లుపోతుందో తెలియకుండానే పోతుంది)

359 గజా యత్ర నగణ్యంతే మశకానాంతు కా గతిః

ఏనుగులకే దిక్కులేకపోతే దోమలమాట చెప్పేదేమిటి?

360 గడులికాప్రవాహన్యాయము.

మేకలమందలో మొదటిది ఏలాగుచేస్తే తక్కినవన్నీ ఆలాగే చేస్తవి. మొదటిది నూతిలోనికి ఉరుకుతే ఒకదానితరువాతఒకటి అవి అన్నీ నూతిలోనికి ఉరుకుతవి (చూ. అంధపరంపరాన్యాయము.)

361 గండస్యోపరి పిటకా సంవృత్తా.

పుండుమీద పొక్కులేచినట్లు. గోరుచుట్టుమీద రోకలిపోటు అని తెలుగుసామెత.

362 గడ్డరికాప్రవాహః

గుడ్డివాని వెనుకపోయినట్లు. గుడ్డివారివలె ఒకరుపోయినమార్గముననే ఇతరులుకూడా పోవడము.

363 గణపతిన్యాయము.

సమస్తకార్యములను ఆరంభించకముందు మనము గణపతినిపూజిస్తాము. అయితే ఈగణపతిఅనేదేవత ఎవరు? గాణాపత్యులు అతనిని పరమశివునిగా చెప్పుతారు, వైష్ణవులు అతడు వాసుదేవుడనిఅంటారు, బ్రహ్మవాదులుఅతడు సాక్షాత్పరబ్రహ్మమంటారు. ఈరీతిగా ఎవరెవరికి ఏదేవతప్రధానదైవతమో ఆదైవతమే గణపతి అవుతూఉంటాడు. ఈ యభిప్రాయమే ఈక్రిందిశ్రుతిలో చెప్పబడ్డది. "గణానాం త్వా గణపతిం హవామహే ప్రియాణాం త్వా ప్రియపతిం హవామహే నిధీనాం త్వా నిధిపతిం హవామహే వసో మమ ఆహ మజానిగర్భధమాత్వ మజాసి గర్భధమ్" అని అందుచేత గణపతిన్యాయమంటే ఎవరికేది అతిముఖ్యమో అదే అన్నిటికంటె ముఖ్యతమమని ఎంచడము.

364 గతం న శోచామి కృతం స్మరామి.

అయిపోయినదానికి శోకించలేదు. ఇప్పుడుచేసిన దానిని స్మరిస్తున్నాను.

365 గతానుగతికో లోకో న లోకః పారమార్థికః

ఒకఊరిలో ఒకబ్రాహ్మణుడుండేవాడు. మరొకగ్రామములో ఒకధనవంతుడు బ్రాహ్మణులకు బంగారపుకమండలములను దానముచేస్తున్నాడనివిని బయులుదేరి దారిలో ఒకచోట గొయ్యిత్రవ్వి అందులో తనదాగికమండలమునుంచి కప్పి, ఆనవాలుకోసము దానిమీదరెం

డుమట్టిముద్దలనుంచి పోయినాడు. ఆతరువాత ఆదారినిపోతూఉండిన బ్రాహ్మణులు ఆమట్టిముద్దలనుచూచి ఈరీతిగా మట్టిముద్దలను ఇక్కడఉంచుతే పుణ్యమువస్తుందికాబోలునని తాముకూడా అట్లేచేయనారంభించినారు. కొద్దికాలములోనే రెండుక్రోసులమేరవరకూ భూమి మట్టిముద్దలతో నిండిపోయినది. రాగికమండలము పాతిపెట్టినబ్రాహ్మణుడు బంగారుకమండలములనిచ్చే ధనికునిగానలేక తిరిగీతనరాగికమండలమును తీసుకొనవలెనని వచ్చేసరికి ఎక్కడచూచినా మట్టిమద్దలే ఉండడముచేత తనఆనవాలుకనుగొనలేక వ్యాకులతపొంది ఈశ్లోకముచదివినాడట. 'గతానుగతికో లోకఃనలోకః పారమార్థికః,పిండద్వయ ప్రదానేన గతం మే తామ్రభాజనమ్"అని.ఇట్టిదే"గతానుగతికోలోకోనలోకః పారమార్థికః ఏకస్య కర్మ సంవీక్ష్యకరోత్యన్యో ఽ పి గర్హితమ్" అనేశ్లోకమున్నది. ఒకరుచేసినదానినే ఇతరులుకూడా చేస్తారు. ఎందుకుచేస్తారో విచారింపరు.

వైరాగిచెంబుకథవంటిదే మరిఒకటిఉన్నది. ఒకఊరిలో ఒకకపటసన్యాసి శిష్యులను కొందరిని ప్రోగుచేసుకొని వచ్చినాడు.వాడుగొప్పమహాత్ముడనిన్నీ,ఎవరితోనూమాట్లాడకఎప్పుడూదైవధ్యానములోనేఉంటాడనిన్నీ శిష్యులు వదంతిపుట్టించినారు. అంతటితో ఆఊరిలోనివారందరూ ఒకరినిచూచి మరిఒకరు పండ్లు, పాలు, ఇతరభోజనపదార్థములు తెచ్చి అర్పిస్తూఉండేవారు. అందరూపోయినతరువాత ఆసన్యాసి శిష్యులతోకూడా తృప్తిగాభోజనంచేస్తూ ఉండేవాడు. ఊరిలోని ఒకగడుసువాడు ఆసన్యాసివాలకముచూచి వానిని ఊరినుండి తరిమివేయడానికి ఒకఉపాయము ఆలోచించినాడు. జనమంతాచేరిఉన్నప్పుడు సన్యాసికాళ్ళమీదపడి "మహాత్మా,తమదర్శనమువల్ల నాపాపములన్నీ పోయినవి. తమకాలిమీది వెంట్రుకఒక్కటి తలమీదపెట్టుకొంటే నాకు మరిపునర్జన్మముండదు" అనిఅంటూ వానికాలిమీది వెంట్రుకను ఊ

డలాగి తనతలమీద పెట్టుకొన్నాడు. అదిచూచి తక్కినవారుకూడా అత నికాలిమీది వెంట్రుకలను ఊడతీయనారంభించినారు. అంతటితో ఆసన్యాసి "కుయ్యో, మొఱ్ఱో, అని ఏడుస్తూ ఆఊరువిడిచి పారి పోయినాడు.

366 గతో బహుతరః కాలః స్వల్ప ఏ వావశిష్యతే.

కాలమంతా గడచిపోయినది, కొంచెముమాత్రమే మిగిలి ఉన్నది.

367 గంధర్వనగరన్యాయము.

ఆకాశముమీద మేఘములు వివిధాకారములనుపొంది ఓడలుగాను, మేడలుగాను, గోడలుగాను, పెద్దనగరమువలెను అప్పుడప్పుడు కనిపిస్తవి. అట్టిదానికి గంధర్వనగరమనిపేరు. అది నగరమని భ్రాంతివల్ల అనుకొంటాము. అట్లే సంసారసుఖముకూడా.

369 గర్దభరోమగణనన్యాయము.

గాడిదయొక్క వెంట్రుకలను లెక్కపెట్టినట్లు (నిష్ప్రయోజనమన్నమాట.) చూ. ఊషరవృష్టిన్యాయము. మొద.

370 గలే పాదుకాన్యాయము.

ఒకగృహస్థుని యింటిలోనికి దొంగవాడు ప్రవేశించి, నీవెవడవు అని అడుగగా వాడు కూర్చుండి, బిచ్చమెత్తుకొనుటకు వచ్చినానని చెప్పుతే, వాడిని చెప్పుతీసుకొని మొగముమీద కొట్టుతారుగదా.

371 గవాం కృష్ణా బహుక్షీరా.

ఆవులలో నల్లఆవు ఎక్కువపాలు ఇస్తుంది.

372 గిరి ముత్పాట్య మూషికోద్ధృతా.

కొండనుత్రవ్వి ఎలుకనుపట్టినట్లు. పెద్దప్రయత్నముచేసి, స్వల్ప ఫలమును పొందడము.

373 గుడజిహ్వికాన్యాయము.

పిల్లవానిచేత చేదుతినిపించడమునకుముందుగా నాలుకకు బెల్లము రాచినట్లు, ఒకవిషయములోనికి సుఖప్రవేశముకలుగుతేగాని, తరువాత, వచ్చే కష్టవిషయములు బోధపడవు.

374 గుడశ్లేష్మన్యాయము.

శ్లేష్మరోగముగలవాడు బెల్లముతింటే, శ్లేష్మముఎక్కువఅయి, తుదకు అది అంతా పయికివచ్చివేస్తుంది. అట్లే, శత్రువు మిత్రునివలె దగ్గరచేరి, శత్రువులను మరింతవృద్ధిచేసి, తుదకు నశింపజేస్తాడు.

375 గుణవిరోధన్యాయము.

వస్తువుయొక్కగుణములు పరస్పరవిరుద్ధములుగాఉన్నట్లు. ఈ న్యాయము మీమాంసాశాస్త్రములో వస్తుంది.

376 గుణానాం పరార్థత్వా దసంబంధ స్సమత్వాత్ స్యాత్.

గుణములనేవి వస్తువులను ఆశ్రయించుకొనిఉంటవి. వస్తువునాగా గుణమనేదిఉండదు. అయినా, గుణములు అనే సామాన్యవచనముచేత, వానికి ప్రత్యేకస్థితిఉన్నది.

377 గుణాః సర్వత్ర పూజ్యంతే పితృవంశో నిరర్థకః.

గుణములవల్లనే గౌరవమువస్తుంది. పితృవంశమువల్ల ఏమీప్రయోజనములేదు.

378 గుణీని గుణజ్ఞో రమతే.

గుణవంతుడు గుణవంతునిచూచి సంతోషిస్తాడు.

379 గుణే త్వన్యాయ్యకల్పనా.

గౌణార్థమునుచెప్పి, ముఖ్యార్థమును విడిచిపెట్టడము న్యాయము కాదు.

380 గుణోపసంహారన్యాయము.

సామాన్యసూత్రముచేత విశేషసూత్రమును సాధించడము.

381 గురుకృతదండో న దోషావహః,

గురువుగారుదండిస్తే దోషములేదు. శిష్యునిఅభివృద్ధికోసమే గురువుదండిస్తాడుగనుక.

382 గురునిందాఅధోగతిః.

గురువును నిందిస్తే అధోగతినిపొందుతారు.

383 గుర్వపి విరహదుఃఖ మాశాబంధ స్సాహయతి.

ప్రియమైనవస్తువునుంచి ఎడబడిఉండడము ఎక్కువదుఃఖకరమే అయినా, దానిని నెప్పటికయినా పొందలేకపోతామా అనేఆశవల్ల ఆ దుఃఖము సహించుకొంటాము.

384 గృహస్థః స్త్రియ ముద్వహేత్.

గృహస్థుడు స్త్రీనిపెండ్లి చేసుకోవలెను. పెండ్లి చేసుకోకపోతేగృహ స్థుడేకాడు. అందుచేత గృహస్థుడు పెండ్లిచేసుకోవలెను అన్నమాటకు అర్థములేదు. ఇట్టి సందర్భములలో ఈన్యాయము వర్తిస్తుంది.

385 గృహార్థ మారోపితస్య దీపస్య రథ్యోపకారకత్వమ్.

ఇంటికి వెలుతురుకోసము ఉంచినదీపము, దారిపోయేవానికి కూడా ఉపయోగించినట్లు. చూ. ద్విగతాఅపి హేతవోభవంతి; ఏకా క్రియాద్వ్యర్థకరీ;జామాత్రర్థంపక్విస్తుతస్యసూపా దేరతిథ్యుపకారకత్వమ్.

386 గోగవయన్యాయము.

గవయమనేది గోవువలెఉండే ఒకఅడవిజంతువు. రెండూఒక్క లాగేఉంటవి. అయినా, పాలుపితికిచూస్తే రెండింటిభేదమూ తెలు స్తుంది. చూ. కాచమణిన్యాయము, కాకపికన్యాయము.

387 గోపగృహిణీన్యాయము.

ఒకరాజుకు ఒకభార్యఉండేది. ఆమెకు రాజువల్ల ఒకకొడుకుపుట్టి నాడు. ఆమెకుమాత్రము రాజుమీద ప్రేమలేదు. మరిఒకరంకుమగనిని మరగినది. ఒకనాడు ఆమె రాజుకువిషమిచ్చిచంపి, రంకుమగనియింటికి పోగా, వాడు పాముకరచి చచ్చిఉన్నాడు. వానినివిడిచి ఆమె మరిఒక

దేశముపోయి, వేశ్యావృత్తిని అవలంబించినది. అక్కడ దైవవశమున, పూర్వము తనకు రాజువల్ల పుట్టినకొడుకే ఆమె వేశ్యకదాఅని క్రీడించడమునకు వచ్చినాడు. వారిద్దరూమాట్లాడుకొంటూఉండగా, ఆమెతల్లిన్నీ, అతడుకొడుకున్ను అయినట్లు ఇద్దరూ తెలుసుకొన్నారు. ఆపాపమునకు ప్రాయశ్చిత్తముగా చితిపేర్చుకొనిచావవలెనని ఊరిబయటచితిపేర్చుకొని మంటపెట్టి, దానిమీదికెక్కినారు. రాజకుమారుడు కాలిచచ్చినాడు. కాని, ఆమె దానిమీదినుండిప్రక్కనున్న నదిలోనికి దుమికినది. ఆమె నదిలోకొట్టుకొనిపోతూఉండగా ఒకగొల్లవాడామెనుఒడ్డుకుచేర్చి తనభార్యగాచేసుకొన్నాడు. ఆమె పెరుగుకుండను తలమీదపెట్టుకొని వీథులుతిరుగుతూ అమ్ముతున్నది. ఒకచోట ఆమెకాలుజారి, కుండ క్రిందపడి బ్రద్దలయినది. పెరుగంతా బుగ్గిలోపడినది. అదిచూచి ఏడుస్తూ ఆరాణి ఇట్లనుకొన్నది;—

"హత్వా నృపం పతి మవాప్య భుజంగదష్టమ్
దేశాంతరే విధివశాద్గణికాఽస్మి జాతా
పుత్రం స్వకం సమధిగమ్య చితాం ప్రవిష్టా
శోచామి గోపగృహిణీ కథ మద్య తక్రమ్" అని.

388 గో బలీవర్దన్యాయము.

"గోవును తీసుకొనిరమ్ము. బలీవర్దమునుకూడాతీసుకొనిరమ్ము" అన్నప్పుడు గోశబ్దమునకు బలీవర్దము (ఎద్దు) అని అర్థమున్నా, గోవు ఆడుజంతువు, బలీవర్దముమగజంతువు, అనే అర్థములనుపొందడముచేత, అట్లు ప్రత్యేకించి చెప్పుతాము.

388 గోమయ పాయసన్యాయము.

పాయసమును పాలతోచేస్తారు. పాలున్నూ, పేడయున్నూ, ఒక్కఆవునుంచి వచ్చినవేఅయినా, పాలలో పేడకలపకూడదు. అట్లే, ప్రతీవానిలోనూ, మంచీచెడ్డాకూడా ఉంటవి.

390 గోమయవృశ్చికన్యాయము.

పేడలోనుండే తేలువలె. తేలు పేడలో స్వాభావికముగా ఉంటుంది. దుష్టుడుకూడా అట్లే దౌష్ట్యములో ఉంటాడు.

391 గోమహిషీన్యాయము.

ఆవుకున్నూ, గేదెకున్నూ, స్నేహమూ ఉండదు. విరోధమూ ఉండదు. నిగ్రహమూ అనుగ్రహమూకూడా లేని రాజుసేవ అట్టిది.

392 గోశృంగ గ్రాహికాన్యాయము.

"మాఆవుఏది" అని యెవరయినా అడుగుతే, దాని కొమ్ములు పట్టుకొని చూపించి, "అయ్యా, ఇదుగో మీఆవు" అని చూపించినట్లు (శిష్యుడు గురువును "అయ్యా, బ్రహ్మమనగా ఏమిటి ?" అనిఅడుగగా గురువు, "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "యతో వా ఇమాని భూతాని జాయంతే" అనిదానిలక్షణములనుబట్టి దానిస్వరూపమును నిరూపిస్తాడు.

393 గౌణముఖ్యయో ర్ముఖ్యే కార్యసంప్రత్యయః.

ఒకశబ్దమునకు ముఖ్యార్థమనిన్నీ, గుణమువల్ల పుట్టినఅర్థమనిన్నీ అర్థము రెండువిధములుగాఉంటుంది. 'పంకజము' అనేశబ్దమునకు పద్మము అని ముఖ్యార్థము. బురదలోపుట్టినది అనే వ్యుత్పత్తినిబట్టి నత్తగుల్ల అనికూడా అర్థము చెప్పవచ్చును. అది గౌణార్థము. పంకజ ముఖి అంటే పద్మమువంటి ముఖముకలది అని చెప్పవలెనుగాని, నత్త గుల్లవంటి మొగముగలది అని చెప్పకూడదు. అందుచేత గౌణము ఖ్యార్థములలో ముఖ్యార్థమునే తీసుకోవలెను. (చూ. అభివ్యక్త పదార్థాయే స్వతంత్రా లోకవిశ్రుతాః శాస్త్రార్థాస్తేషు కర్తవ్యాః శబ్దేషు న తదుక్తిషు.)

394 ఘటదర్శనా యోన్మీలితచక్షుః

నేలమీదఉన్నకుండను చూడడమునకు తలమీదికెత్తి చూచి

నట్లు. ఒక కార్యమునకు కారణముచెప్పబోయి, మరియొక కారణముచెప్ప డము. కొబ్బరిచెట్టు ఎందుకెక్కినావురా, అంటే, దూడకుగడ్డికోస మన్నట్లు.

395 ఘటప్రదీపన్యాయము.

కుండలో పెట్టిన దీపముయొక్క వెలుతురు, ఆకుండలో నేఉంటుం దిగాని, పైకివ్యాపించదు. అట్లే, తనలాభమునేకోరేవాడు ఇతరులకు మేలుచేయలేడు.

396 ఘటానాం నిర్మాతు స్త్రిభువనవిధాతు శ్చ కలహః.

కుండలుచేసేకుమ్మరికిన్నీ, త్రిభువనములనునిర్మించే బ్రహ్మ కున్ను కలహముపుట్టినట్లు. అల్పులు గొప్పవారితో జగడముపెట్టు కొన్నప్పుడు ఈ న్యాయము వర్తిస్తుంది.

397 ఘటారోహణన్యాయము.

ఒకకుండమీద అభ్యాసములేకుండా చప్పునఎక్కితే అదిపగిలి పోతుంది. కాని, అభ్యాసముచేస్తే, కుండపగలకుండా దానిమీద నృ త్యముచేయవచ్చును.

398 ఘటాల్పదర్పణన్యాయము.

"కొండ యద్దమందు కొంచెమైయుండదా" అనేవేమనవాక్యము ఈన్యాయమునకు సరియైనతెనుగు. ఘటమంటే, కొండశిఖరము. ఏనుగుకుంభస్థలము. అని రెండర్థములున్నవి. ఈరెండున్ను అద్దములో చిన్నవిగా కనబడుతవి.

399 ఘటీయంత్రన్యాయము.

ఏతాముకుండ నీళ్ళనుగ్రహించేటప్పుడు కిందికిదిగుతుంది. తనలో నీళ్ళునిండగానే మీదికిలేచిపోతుంది. అట్లే, దుర్జనుడు ధనమునుసంగ్ర హించినంతమట్టుకు వినయముగాఉండి, అదిచేతికిచిక్కగానే, నిగుడు తాడు.

400 ఘటీయంత్రన్యాయము.

ఏతాముకుండ క్రిందికీమీదికీ దిగుతూలేస్తూ ఉన్నట్టు.

విషయాధీనులై అజ్ఞానులు రాగమునుపొందుతారు. రాగము మోహమునకు కారణమవుతుంది. మోహము కోపమునకు హేతువవుతుంది. కోపమువల్ల హింసచేస్తారు. నోటితో అసత్యములాడుతూ, మనస్సుతో పరులకు ద్రోహముచేయనెంచుతూ, ఉంటారు. ఇదిఅంతా దుఃఖమునకున్ను పునర్జన్మమునకున్ను హేతువవుతుంది.

జ్ఞాని పురాకృతసుకృతవాసనాబలముచేత, సంసారము దుఃఖాయతనమని తెలుసుకొంటాడు. అంతట నివృత్తి మార్గమునవలంబిస్తాడు. అంతట తత్త్వజ్ఞానమునుపొందుతాడు. తత్త్వజ్ఞానము మిథ్యాజ్ఞానమును పోగొట్టుతుంది. అందువల్లదోషములు తొలగిపోతవి. అందుచేత, ప్రవృత్తికట్టిపోతుంది. అందువల్ల జన్మము లేకుండాపోతుంది. అందువల్ల దుఃఖము నిశ్శేషముగా పోతుంది. అందువల్ల అపవర్గసుఖము కలుగుతుంది.

401 ఘటీయంత్రస్థిత ఘటన్యాయము.

ఏతామునకుకట్టిన కుండవలె. ఏతామునకుకట్టినకుండ క్రిందికి దిగుతూ, మీదికిలేస్తూఉంటుంది. అట్లే, పురుషుడు వృద్ధిక్షయములను పొందుతూఉంటాడు.

402 ఘట్టకుటీప్రభాతన్యాయము.

బండివాడొకడు హాసీలుచెల్లించకుండా పట్టణములో ప్రవేశింపవలెననియెంచి, మరియొకదారిగా రాత్రివేళ బండినితోలుకపోయినాడు. కాని, దారితప్పి, తెల్లవారేసరికి తిరిగీ హాసీలుచెల్లించేపాకవద్దకే చేరి, సొమ్ముచెల్లించవలసినవాడయ్యెను. అట్లే, మన మేకీడునుండితొలగి ఉండవలెనని అనుకొంటామో, ఆకీడేమనకు కలిగినయెడల ఈన్యాయమును ఉపయోగిస్తాము.

403 ఘుణాక్షరన్యాయము.

తాటాకుపుస్తకములో పురుగులుప్రవేశించి, చిన్నచిన్న కన్నములుచేస్తవి. ఆకన్నములు అక్షరములవలె కనిపిస్తవి. అసలక్షరములకున్ను ఈపురుగులుకొరకడముచేత ఏర్పడిన అక్షరములకున్ను భేదముండదు. అందుచేత భ్రమకలుగుతుంది. కల్పిత వస్తువునుచూచి, అదే నిజమైనవస్తువని భ్రాంతిపడినప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది.

404 ఘృతస్య పాత్రమాధారో వా పాత్రస్య ఘృతమాధారో వా.

నేతికి గిన్నె ఆధారమా, గిన్నెకు నేయి ఆధారమా, అని ఒక తార్కికుడు నేయి నిండాఉన్నగిన్నెను బోర్లించినాడట.

405 చక్రకన్యాయము.

చూ. అన్యోన్యాశ్రయన్యాయము.

406 చక్రనాభిన్యాయము.

చక్రములలోనుంచిపోయే ఇరుసువలె. బండి చక్రములతోనే నడచినా, వాటికి ఆధారముగా ఇరుసుఉండవలెను. అట్లే, ప్రకృతికిన్ని, జీవాత్మకున్ను పరమాత్మ ఆధారముగా ఉంటాడు.

407 చక్రభ్రమణన్యాయము.

ఒకచక్రమును త్రిప్పివదలిపెట్టినప్పుడు, దానికి మొదట కలిగించినవేగముచేత కొంతవరకూతిరిగి, క్రమేణ ఆగిపోతుంది. అట్లే, జీవాత్మయొక్క కర్మమునశించినా, అది కొంతకాలమువరకూ కర్మములో ప్రవర్తిస్తూఉండి, తుట్టతుదకు కర్మరాహిత్యమును పొందుతుంది. (చూ. ఇషువేగక్షయన్యాయము.)

408 చక్రవాకీచక్రవాకన్యాయము.

చక్రవాకకవ పగలంతాకలసి క్రీడిస్తూ, రాత్రిపడగానే ఒకదానినొకటివిడిచి దూరముగాపోతవి. తెల్లవారగానే తిరిగీకలుసుకొంటవి

అట్లే, దేహమున్ను, జీవాత్మయున్ను కలసియుండి విషయసుఖముల ననుభవించి, మృతిగలుగగానే విడిపోయి, పునర్జన్మములో తిరిగీ కలుసుకొంటవి.

409 చక్షుర్దీపన్యాయము.

చీకటిలేకుండాఉండడమునకు కన్నులు ఉండవలెను, దీపము కూడా ఉండవలెను. ఆరెంటిలో ఏదోఒకటిఉంటే చాలదు. అట్లే, ఒకపనిని నిర్వహించడమునకు, దానిని చేయడానికి బుద్ధిపుట్టవలెను. దానికై ప్రియత్నముకూడా చేయవలెను.

410 చటకస్య మాంసం భాగశతమ్.

పిచికమాంసమును నూరు భాగములుగా పంచుకొన్నట్లు.

411 చండాలధృతైకహస్తన్యాయము.

లోతునీళ్ళలో మునిగిపోతూఉన్న వానిని చండాలుడుఒకచేతితో పైకితీసినా, మైలతగలకమానదు.

412 చతుర్వేదవిత్ న్యాయము.

గోవులు, బంగారము, మొదలయిన ధనమును చతుర్వేదములను తెలుసుకొన్నవానికి దానముచేయవలెను, అనేమాటను ఒకడు విని, ఒకడు ఒకధనవంతునివద్దకుపోయి, "వేదములు నాలుగున్నవని నాకు తెలుసును. నాకుదానము ఇమ్ము" అని అడిగినాడట. వానిని చూచి నవ్వి, వెళ్ళగొట్టినారట. అట్లే "బ్రిహ్మసచ్చిదానందస్వరూపుడు అభిన్నుడు" అనేవాక్యమునుమాత్రిము తెలుసుకొని" "నేను బ్రిహ్మమును తెలుసుకొన్నాను" అనిచెప్పడము హాస్యాస్పద మవుతుంది.

413 చతుర్వ్యూహన్యాయము.

చతుర్వ్యూహములు అనేశబ్దమునకు ఒక్కొక్కశాస్త్రములో ఒక్కొక్కసంకేతమున్నది. పాంచరాత్రిములో వాసుదేవ, సంకర్షణ, ప్రిద్యుమ్న, అనిరుద్ధులున్ను, బహ్వృచోపనిషత్తులో శరీరపురుష

ఛందఃపురుష,వేదపురుష, మహాపురుషులున్ను, సాంఖ్య పాతంజల దర్శనములలో హేయమ్, హానమ్, హేయహేతువు, హానోపాయము, అనేవిన్నీ, చికిత్సాశాస్త్రములో రోగము ఆరోగ్యము, నిదానము, భైషజ్యము, అనేవిన్నీ చతుర్వ్యూహములుగా చెప్పబడిఉన్నవి.

414 చందనగుణన్యాయము.

గంధపుచెక్కను ఎంతఅరుగతీసినా, దానివాసన ఎక్కువఅవుతూనేఉంటుందికాని, తగ్గదు. అట్లే సజ్జనునికి కష్టములు వచ్చినకొద్దీ అతనిసుగుణాతిశయముబయలుపడుతూఉంటుంది.

415 చంద్రిచంద్రికాన్యాయము.

వెన్నెలచంద్రుని ఎప్పుడూ విడిచిపెట్టనట్లు పతివ్రితభర్తనువిడిచి పెట్టదు.

416 చంద్రజ్యోత్స్నాన్యాయము.

జ్యోత్స్న అంటేనే చంద్రునివెలుగు, అయినా చంద్రజ్యోత్స్న అనిప్రయోగిస్తాము. (చూ. కరిబృంహితన్యాయము, కరకంకణన్యాయము, గజఘటాన్యాయము, నీలేందీవరన్యాయము,పర్వతాధిత్యకాన్యాయము, పర్వతోపత్యకాన్యాయము, వాజిమందురాన్యాయము,మృగవాగురాన్యాయము.)

417 చంపకపటన్యాయము.

బట్టలో సంపెంగపువ్వులను కొంతకాలముంచి వానిని తరువాత తీసివేసినా, వాని సువాసన బట్టలను విడిచిపెట్టదు. అట్లే సజ్జనసంసర్గమువల్ల కలిగే సుగుణములుకూడా మనుష్యునివిడిచిపెట్టవు. (చూ. అపహారితాగ్నిభూతలన్యాయము.)

418 చర్మార్థంతే మహిషీంహంతి.

తోలుసంచి కావలసినవాడు గేదెనుచంపునట్లు. చిన్నవస్తువుకావలసినవాడు పెద్దవస్తువును పాడుచేసుకోకూడదు.

419 చర్వితచర్వణము.

తిన్న దేతినడము, ఆడినమాటే ఆడడము.

420 చాతకజీమూతన్యాయము.

చాతకపక్షికి ఎక్కడపడితే అక్కడనేనీరు దొరకినా దానిదాహము మేఘమునుండిపడిన నీటిబిందువులచేతగానిపోదు. అట్లే, ఇతర సుఖములెన్ని ఉన్నా, తనమనోరథమునీడేర్చే దానితో ఏవీసాటికావు.

421 చాలనీన్యాయము.

జల్లెడతో జల్లించేటప్పుడు గట్టిధాన్యమంతా క్రిందికిపడి, పొల్లు మాత్రము దానిలోనిలుస్తుంది. అట్లే, మూర్ఖుడుసారమునువిడిచిపెట్టి, నిస్సారమైనదానిని గ్రహిస్తాడు.

422 చింతా జ్వరో మనుష్యాణామ్.

మనుష్యులకు చింతయే జ్వరము.

423 చింతామణిం పరిత్యజ్య కాచమణిం గృహ్ణాతి.

చింతామణీరత్నమును విడిచిపెట్టి, గాజుముక్కనుతీసుకొన్నట్లు (పెద్దఫలమునువిడిచి, క్షుద్రఫలమును కోరడము.)

424 చిత్రపటన్యాయము.

బట్టమీద చిత్రమునువ్రాసేటప్పుడు మొదటదానిమీద సఫేదు పూస్తారు. దానిపైని గీతలుగీస్తారు. ఆగీతలకు ఆకారముతెస్తారు. తరువాత దానికిరంగులుపూస్తారు. అట్లే, పరమాత్మకూడా చిదాకారుడై, తరువాతఅంతర్యామియై, తరువాతసూత్రాత్మయై, తుదకు విరాడ్రూపమును పొందుతాడు.

425 చిత్రాంగనాన్యాయము.

చిత్రపటములోఉన్న సుందరస్త్రీని ముద్దుపెట్టుకొని, కౌగలించుకొనము. అట్లే, జ్ఞానమునుపొందినవాడు కొన్ని నిషిద్ధకర్మములను చేస్తూఉన్నా, వాటిఫలమును మాత్రము అనుభవింపడు.

426 చిత్రానలన్యాయము.

చిత్తరువులోని అగ్నివలె (అప్రయోజనకరమైనది.) చూ. చిత్రాంగనాన్యాయము, చిత్రామృతన్యాయము.)

427 చిత్రామృతన్యాయము.

చిత్తరువులో ఉన్న అమృతమువలె (అనుభవింపయోగ్యముకానిది) చూ. చిత్రాంగనాన్యాయము, చిత్రానలన్యాయము.

428 చీయతే బాలకస్యాపి సత్ క్షేత్రపతితాకృషిః.

బాలుడుచేసినకృషిఅయినా, మంచిభూమిమీద పడి తేమంచి ఫలమునిస్తుంది.

429 చోరాపహార్యన్యాయము.

దొంగయున్ను, దొంగలింపబడినవాడున్ను ఎట్లుభిన్నులో జీవేశ్వరులుకూడా అట్లే భిన్నులు.చూ.శకునిసూత్రన్యాయము,నదీసముద్రన్యాయము, శుద్ధోదలవణన్యాయము, పుంవిషయన్యాయము, నానావృక్షరసన్యాయము.

430 చోరాన్వేషణే చోరఏవప్రయోక్తవ్యః.

దొంగను వెదకడానికి దొంగనేపంపవలెను. చూ. అస్త్రమస్త్రేణశామ్యతి, యాదృశం తాదృశమేవసాధయతి.)

431 చోరాపరాధా న్మాండవ్యనిగ్రహః.

దొంగలు దొంగలించుకొనిపోతే, మాండవ్యఋషినికొరతవేసినట్లు. కొందరుదొంగలు రాజుగారికోటలోధనముదొంగలించికొనిపారిపోయినారు. వారినివెదకుటకు రక్షకభటులు బయలుదేరి, అడవిలో మాండవ్యుడనేఋషి మౌనముధరించి తపస్సుచేసుకొంటూఉండగా, "దొంగలుఎటుపోయినారు?" అని అడిగినారు. మాండవ్యుడుపలుకలేదు. అందుచేత ఆరక్షకభటులు "వీడుదొంగలకు మొనగాడు. మునివలెనటిస్తున్నాడు. పలుకడు" అని వానిని రెక్కలువిరిచికట్టి, రాజుఎదుటపెట్టి

నాడు. అక్కడకూడా మాండవ్యుడుపలుకలేదు. అందుచేతరాజుఅతనిని కొరతనువేయించినాడు. ఒకరుచేసిన అపరాధమునకు మరిఒకడుఅన్యాయముగా శిక్షననుభవించేటప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

432 ఛత్రిన్యాయము.

రాజువెంటవచ్చినవారు కొందరు గొడుగులను పట్టుకొనిన్నీ, కొందరుపట్టుకొనకుండానున్నన్నూ ఉంటారు. అయినా, రాజలాంఛనమైన ఛత్రము రాజుకేచెందుతుంది.

433 ఛందో వత్కవయః కుర్వంతి.

కవులు ఛందస్సుననుసరించి కవిత్వము చెప్పుతారు. ఏమార్గము ననుసరిస్తామో దానికనుగుణముగానే మనము మనపనులనుచేస్తాము.

434 ఛిద్రే ష్వనర్థా బహులీభవంతి.

ఆపదలలో మరిన్ని ఆపదలు కలుగుతూఉంటవి.

435 ఛిన్నేకర్ణే, లూనేపుచ్ఛే, శ్వాశ్వో వనాఽశ్వో నగర్దభః.

చెవులుకోసినా, తోకకోసినా, కుక్కకుక్కేగాని గుఱ్ఱమూ కాదు, గాడిదా కాదు.

436 జతుకాష్ఠన్యాయము.

కఱ్ఱకు లక్కతగులుకొంటే, లక్కను కఱ్ఱనుండి వేరుచేయడమునకు కొంతప్రయత్నముచేయవలెను. ఒక్కశబ్దమును శ్లేషగాప్రయోగిస్తే, ఆశ్లేషార్థములను కొంతప్రయత్నముతో వేరుచేయవలెను.

437 జనవాక్యం తు కర్తవ్యమ్.

జనులునలుగురూ అన్నట్లు చేయవలెను.

438 జన్మాంతర సహస్రేషు బుద్ధిర్యాభవితాపురా
తామేవభజతేజంతురుపదేశో హ్యనర్థకః.

అనేకసహస్రజన్మములయందు పరిపక్వముపొందుతూఉన్నబుద్ధివల్లనే జంతువులుసంచరిస్తవి. వాటికి ఉపదేశమువల్ల లాభములేదు

439 జన్మినో మానహీనస్య తృణస్య చ సమాగతిః.

మానహీనుడయిన మనుష్యునికిన్ని, గడ్డిపోచకున్ను ఒక్కటే గతి.

440 జలకతకరేణున్యాయము.

బురదనీరు, ఇండుగపిక్కన్యాయము. బురదనీటిలో ఇండుగపిక్కను అరుగదీసి కలుపుతే, నీరు నిర్మలమవుతుంది. నీటిని నిర్మలముచేసిన ఇండుగరేణువులను అడుగుకు తేలిన బురదతోకూడా పైకిపారవేస్తారు. (దుష్టులుస్వప్రయోజనముతీరినవెంటనే తమకుసహాయముచేసిన వారిని విడిచివేస్తారు.) చూ. దగ్ధేంధనన్యాయము.

441 జలచంద్రన్యాయము.

చంద్రుడొక్కడేఅయినా వేరువేరు పాత్రలలో ప్రతిబింబములుపడి, అనేకచంద్రులున్నట్లు కనబడేవిధముగా, ఆత్మఒక్కడేఅయినా వివిధశరీరములలో నిలచి వేర్వేరుగాఅనేకత్వమునుపొందినట్లుతోస్తాడు.

442 జలతరంగన్యాయము.

నీరూ, కెరటములవలె. నీరేగాలివల్ల కెరటముల రూపమును పొందుతుంది. నీటివలె కెరటములకున్ను మాధుర్యము, ద్రవత్వము, శైత్యము, అనేగుణములు ఉన్నవి. అట్లే, అవ్యక్తనిర్గుణబ్రహ్మమే ప్రపంచముగా పరిణమించినా, బ్రహ్మయొక్క గుణములుకూడా ప్రపంచమునందుంటవి.

443 జలతాడనన్యాయము.

నీటినికొట్టినట్లు. నీటిమీదకొట్టితే దానిమీద లోత్తుపడదు. అనగా నిష్ప్రయోజనమనుట. (చూ. ఊషరవృష్టిన్యాయము, మొ.)

444 జలతుంబికాన్యాయము.

ఆనపకాయతుంబలో మట్టినినింపి నీటిలో వేస్తే, అదిమునిగిపోతుంది. నీటిచేత దానిలోనిమట్టి కరగిపోయి పైకిపోతే, ఆతుంబతిరిగీ

పైకి తేలుతుంది. అట్లే జీవాత్మకు దేహముతో సంబంధము తెగిపోతే, అది ఆకాశముమీదికిపోతుంది. ఇదే ముక్తి అని దిగంబరజైనులంటారు. ఈన్యాయమునే ఉదాహరించి, వైయాకరణులు, రేఫస్యోర్ధ్వగమనమ్ అనిఅంటారు.

445 జలతైలన్యాయము.

నీటిమీద నూనె తేలినట్లు. జీవుడు దేహాభిమానమును వదలినిర్లిప్తుడుగా ఉండడమునుగురించి ఈన్యాయమును ఉదాహరిస్తారు.

446 జలబిందునిపాతన్యాయము.

ఒక్కొక్క నీటిబొట్టుపడడమువల్ల కుండనిండుతుంది. అట్లే ధనమున్ను, ధర్మమున్ను క్రమక్రమముగా అభివృద్ధిపొందుతవి.

447 జలమంథనన్యాయము.

నీటినిమథించినట్లు. పాలనుమథిస్తే వెన్నబయలుదేరినట్లు నీటినిచేస్తేఏమీబయలుదేరదు. అంటే నిష్ప్రయోజనమన్నమాట. (చూ. ఊషరవృష్టిన్యాయము. మొ.)

448 జలమౌక్తికన్యాయము.

దేశ, కాల, పాత్ర, శ్రద్ధావిశేషములచేత అల్పుడుకూడాగొప్పవాడవుతాడు. ముత్తెపుచిప్పలోచేరిన నీటిబొట్టుముత్యముఅయినట్లు

449 జలానయనన్యాయము.

నీళ్లుతీసికొనిరా, అనిచెప్పితే ఒకపాత్రతోతీసికొనిరా, అనిచెప్పనక్కరలేదు. (చూ. అగ్న్యానయనన్యాయము.)

450 జలేతరంగబుద్బుదన్యాయము.

సముద్రములో కెరటములున్ను, బుడగలున్ను పుట్టి, అందులోనే లీనమయిపోయినట్లు (అవ్యక్తము నుంచి వ్యక్తప్రపంచముపుట్టి, తిరిగీ అవ్యక్తములో లీనమైపోతుంది.)

451 జలౌకాన్యాయము.

జలగను స్త్రీ స్తనములమీఁద ఉంచుతే, పాలనువదలిపెట్టి రక్తము పీలుస్తుంది అట్లే, దుష్టుడు గుణములనువిడిచి, దోషములనే ఎంచు తాఁడు. చూ. మక్షికాన్యాయము.

452 జలౌష్ణ్యన్యాయము.

జలములకు శైత్యము లక్షణమయినా, వాటినికాఁగబెట్టితే వేడి నీళ్ళు అనేవ్యవహారము కలుగుతుంది. అట్లే, ఒకనిధర్మముతోబాటు, మరియొకధర్మమునుకూడా అవలంబిస్తే, అరెండోధర్మముకూడా అతని యందు ఆరోపమవుతుంది. చూ. వాయుశైత్యౌష్ణ్యన్యాయము, భూశైత్యౌష్ణ్యనాయము.

453 జహత్స్వార్థావృత్తిన్యాయము.

శబ్దము తనఅర్థమును విడిచిపెట్టి, మరిఒకఅర్థమును తెలుపడము. గ్రామములు క్షోభముపొందుతున్నవి. అంటే, గ్రామములోని జనులు క్షోభము పొందుతున్నారని అర్థము.

454 జహదజహత్స్వార్థావృత్తిన్యాయము.

ఇంతకుపూర్వము శబ్దమునకు వేరుగా చెప్పబడిన అర్థమున్ను, శబ్దమునకు స్వయముగాఉన్న అర్థమున్ను, ఒక్కటే అనిచెప్పడము. "ఆదేవదత్తుఁడుఇతడే" అన్నప్పుడు, దేవదత్తుని గుణములను ప్రత్యేకముగా మొదటవర్ణించిఉన్నా ఇప్పుడాగుణములుకలవ్యక్తి ఈదేవదత్తుడే అని రెండర్థములును ఏకదేశాన్వయమును పొందినవి.

455 జామాత్రర్థం ప్రస్తుతస్య ఘూపాదేరతిథ్యుపకారకత్వమ్.

అల్లుఁడుకోసమువండిన పప్పూ, పాయసమూ, అతిథికికూడా ఉపయోగపడినట్లు. చూ. ద్విగతా అపిహేతవో భవంతి. ఏకాక్రియాద్వ్యర్థకరీ: గృహార్థమారోపితస్య దీపస్య రథ్యోపకారకత్వమ్.

456 జాయంతే బత మూఢానాం సంవాదా అపి తాదృశాః

మూఢులలో కలహములు అతిసులభముగా పుట్టుతవి.

457 జిత్వరీవదుపాచరేత్.

వర్తకులు కాశీని 'జిత్వరీ' అనగా జయశీలమైన పట్టణము అనే పేరుతో వ్యవహరిస్తారు. 'జిత్వరీ' అనేశబ్దము నుపయోగించినప్పుడు దానికి న్యాయముగా కాశీ అనే అర్థము లేకపోయినా, కాశీఅనేఅర్థమే ద్యోతకమవుతుంది:

458 జీవితోఽపి న జీవేత్స యది లోకేనదూష్యతే.

లోకముయొక్క దూషణకు పాత్రుడయినవాడు జీవించిఉన్నా, చచ్చినవారిలోనే లెక్క.

459 జ్ఞాతిశ్చేదనలేనకిమ్.

జ్ఞాతివాడు ఉంటే అగ్గి వేరే అవసరములేదు.

460 జ్ఞానమజ్ఞానస్యైవనివర్తకమ్.

జ్ఞానము అజ్ఞానమును పోగొట్టుతుంది. ఒకవస్తువులేకపోవడము తనకు విరోధమయిన వస్తువుతో చేరికకలుగడము చేతనూ, తనలోని భాగమునశించడము చేతనున్ను, రెండువిధములుగా కలుగుతుంది. పై న్యాయము మొదటితరగతిలోనిది. (చూ. పాత్రప్రదీపన్యాయము. స్నేహదీపన్యాయము.)

461 జ్ఞానాదేర్నిష్కృష్టవస్తుత్వనిష్టోఽప్యంగీకార్యో బాధకాభావాత్.

స్థావరప్రపంచమునుండి జ్ఞానము ఎట్లుదూరముగా ఉంటుందో, అట్లే, ఈశ్వరునియందు జ్ఞానముమూర్తిమంతమై ఉంటుంది.

462 జ్యేష్ఠత్వంనహిజ్యేష్ఠే జ్యేష్ఠత్వం గుణఉచ్యతే.

పెద్దవాడుగాపుట్టినందువల్ల జ్యేష్ఠత్వము రాదు. గుణమువల్లనే జ్యేష్ఠత్వము కలుగుతుంది.

463 జ్వలితం న హిరణ్యరేతసంచయమాస్కందతిభస్మనాంజనః

బంగారుపోడి మండుతూఉన్నదని దానినెవ్వడూ పిడిచిపెట్టడు.

434 టిట్టిభన్యాయము.

పంచతంత్రములో ఈక్రిందికథ ఉన్నది—ఒక తీతువపిట్ట సముద్ర పుఒడ్డున గ్రుడ్లుపెట్టుకొనగా సముద్రతరంగమువచ్చి వాటినిఊడ్చుకపోయినది. అదిచూచి ఆతీతువపిట్ట సముద్రుని సాధించవలెను, దీనిలోని నీరంతా ఇంకిపోయేట్టుచేస్తాను, అని అనుకొని నీటిలోనికిపోయి, రెక్కలమీదనీటిని తెచ్చి పైకిపోయ ప్రారంభించినది. ఈపనిచూచి తక్కినపక్షులు నవ్వసాగినవి. కాని, అదితనపనినిమానలేదు. ఆదారిని నారదుడుపోతూ దానిపట్టుదలకుమెచ్చి స్వర్గమునుంచి తీతువపిట్టకు సహాయముగా గరుడునిపంపినాడు. గరుడునికిభయపడి సముద్రము తీతువపిట్ట గ్రుడ్లను భద్రముగా ఒప్పజెప్పినది. గనుక ఎంతఅల్పుడయినా పట్టుదల చేత సాధింపరానిపనిఉండదు.

435 టీకాటీకామపేక్షతే.

టీకనుబోధపరచుకొనడానికి ఇంకొకటీక కావలసినట్టు.

436 తక్రకౌండిన్యన్యాయము.

"బ్రాహ్మణులకు పెరుగుఇమ్ము. కౌండిన్యునికి మజ్జిగపోయుము" అన్నప్పుడు కౌండిన్యుడు కూడా బ్రాహ్మణుడేఅయినా వారిలోనుంచి అతనినివిడదీసిచెప్పినాము. అట్లే ఇతరస్థలములలోకూడాను.

437 తండులభక్షణన్యాయము.

వండుకోలేక బియ్యమునేబుక్కేవానివలె సోమరులకివివర్తిస్తుంది

438 తంతున్యాయము.

నూలుపోగులన్నికూడి ఒకబట్టగా ఏర్పడినట్లు, మంచివారు అనేకులు ఒకచోటచేరి తమ కార్యమును సాధించుకొంటారు.

439 తత్ప్రఖ్యన్యాయము.

'అగ్నిహోత్రమును వేల్చవలెను' అంటే 'ఏమివేల్చవలెను?' అనే ప్రశ్నరాగా, హవిస్సును అని అగ్నిహోత్రశబ్దమువల్లనే తెలుస్తుంది.

470 తత్థ్సానాపన్న స్తత్కార్యం లభతే.

ఎవడు ఏయోగ్యతకలిగిఉంటాడో, దానికితగినట్లు గౌరవము పొందుతాడు.

471 తదభిన్నాభిన్నస్యతదభిన్నమ్.

రెండువస్తువులు మరిఒకవస్తువుతో అభిన్నముగాఉంటే, ఈరెండువస్తువులుకూడా అభిన్నములే. బ్రహ్మ, విష్ణు, శివుడు, గణపతి, మొదలయిన దేవతలందరూ ఈశ్వరాంశచేత ఈశ్వరునికి అభిన్నులు. అందుచేత తమలో తాముకూడా అభిన్నులే.

472 తదాగమే హి దృశ్యతే.

తైలము, వత్తి, మొదలయినవి చేరినప్పుడు వానినుండి వెలుతురు, వేడిమి, అనేవి పుట్టుతవి. ఆగుణములు తైలములోగాని వత్తిలోగానిలేవు. అట్లే జాగ్రదవస్థలో దుఃఖాదులు కనబడుటచేతనున్న నిద్రపోయినప్పుడు అవి కనబడక పోవడముచేతనున్న, ఆదుఃఖాదులు ఆత్మకుచెందినవికావని తెలియవలెను.

473 తదేకదేశభూతం తద్గ్రహణేన గృహ్యతే.

ఒకదానితోకలిసిన మరియొకవిషయము, దేనితోకలుస్తుందో దాని పేరుతోనే వ్యవహరిస్తుంది. గంగానదిలో అనేకఉపనదులుకలిసినా గంగానది అనేపేరును పొందుతవి.

474 తద్గుణముపలభ్యతే.

ఎట్టివారితో కలిసిఉంటే అట్టిగుణములువస్తవి. రెండుఎఱ్ఱబట్టల మధ్యను ఒక తెల్లబట్టనుఉంచుతే, దానికికూడాఎరుపురంగుకలుగుతుంది.

475 తద్ధేతోరేవ తదస్తు కింతేన.

దానికారణమువల్లనే అదికలిగినది. దానితో మనకేమిపని? వృథాతర్కముచేసేటప్పుడు ఈన్యాయము ఉపయోగిస్తారు.

476 తత్సామీప్యాత్తాచ్ఛబ్ద్యమ్.

ఒకవస్తువునకు దానిదగ్గరఉన్న వస్తువునుబట్టి పేరువస్తుంది. గో

ల్లపల్లెలు అనేకమున్నా గంగదగ్గరఉన్న గొల్లపల్లెను గంగదగ్గరఉన్న గొల్లపల్లెఅని పేరువస్తుంది.

477 తత్సాహచర్యాత్తాచ్ఛబ్ద్యమ్.

ఒకవస్తువు మరిఒకవస్తువుతో కలిసిఉన్నప్పుడు, ఆకలిసిఉన్నవస్తువునుబట్టి రెండోదానికి పేరువస్తుంది. "కఱ్ఱలనుపంపించుము" అంటే కఱ్ఱలిచ్చి మనుష్యులనుపంపించుము అనిఅర్థము.

478 తప్తపరశుగ్రహణన్యాయము.

మొదటకొంచెము వేడిగలపదార్థములను అంతకంతకూ, అంతకంటే ఎక్కువవేడిగల పదార్థములనూ ముట్టుకొనడము అభ్యాసము చేసుకొంటే, తుదకు కాలుతూఉన్న ఇనుపగొడ్డలినికూడా పట్టుకోవచ్చును.

479 తప్తభ్రాష్ట్రతిలన్యాయము.

కాలిన మూకుటిలో నువ్వులువేసినట్లు (అట్లువేస్తేఅవివెంటనే పేలుతూ ఎగురుతవి.) అట్లే, దుఃఖమును అణచుకోలేనివారున్ను.

480 తప్తమాషికోద్ధరణన్యాయము.

మరుగుతూఉన్న నూనెలో పడిచచ్చినఈగను నేర్పుగావ్రేలితో తీసివేయవచ్చును. ఈనేర్పు అభ్యాసమువల్లకలుగుతుంది.

481 తమఃప్రకాశన్యాయము.

చీకటిని వెలుతురు అణచివేస్తుంది. అట్లే జ్ఞానము అజ్ఞానమును పోగొట్టుతుంది.

482 తమోదీపన్యాయము.

చీకటీ, దీపమూ వలె. దీపముచీకటినిపోగొట్టుతుంది. అట్లే జ్ఞానము అజ్ఞానమును పోగొట్టుతుంది.

483 తరక్షుడాకినీన్యాయము.

పెద్దపులివాహనముమీద కూర్చుండి బయలువెడలిన మహాకా

లిపలె. ఒకభయంకరవస్తువు మరిఒకభయంకరవస్తువుతో చేరి, మరీభయమును పుట్టించేసందర్భములో ఈన్యాయము వర్తిస్తుంది.

484 తరతమభావాపన్నం ఫలం తరతమభావాపన్నసాధనాయత్తమ్.

ఎక్కువఫలము, అంతకంటే ఎక్కువఫలము, కలుగవలెనంటే, పెద్దసాధనమున్ను అంతకంటే పెద్దసాధనమున్ను కావలెను.

485 తర్కాఽప్రతిష్ఠానాచ్చ.

తర్కముఅనగా తత్త్వవిచారము. దానిని చేయనిదీ గంభీరార్థనిశ్చయమును చేయవీలులేదు. పురాణములలో భూగోళము పంచాశత్కోటియోజనవిస్తీర్ణమనిచెప్పగా, అది అసంభవమని వెంటనేత్రోసివేయక, అట్లు ఎందుకుచెప్పబడ్డదో విచారణచేయవలెను.

486 తవాప్యర్ధం మమాప్యర్ధమ్.

నీకుసగమూ, నాకుసగమూ అని ఒకదొంగ మరొకదొంగతో అన్నాడు.

487 తస్కరస్య పురస్తాత్కక్షే స్వర్ణమపేత్యసర్వాంగోద్ఘాటనం ప్రతిభాతి.

దొంగయొక్క మొలలో బంగారముఉండగా, అక్కడవెదుకక తక్కినఒళ్ళంతాశోధించినట్లు.

488 తస్మిన్ విదితే సర్వం విదితం భవతి.

అదితెలుస్తే అంతా తెలిసినట్టే. ఒకవిషయమును గురించినగుట్టు తెలుస్తే, తక్కినదంతా బోధపడుతుంది. భగవంతునిగురించి తెలుస్తే సర్వమూ తెలిసినవాడవుతాడు.

489 తాతస్య కూపోఽయమితి బ్రువాణాః
క్షారం జలం కాపురుషా పిబంతి.

ఇదిమాతండ్రిగారు త్రవ్వించిన నూతినీరు అని మూర్ఖులు ఆ ఉప్పునీరేత్రాగుతారు.

490 తాత్స్థాత్తాచ్ఛబ్ద్యమ్.

ఒకస్థలమునందున్న వస్తువులనుబట్టి, ఆస్థలమునకు పేరువస్తుంది. కొండమీది చెట్లుపచ్చగాఉంటే, కొండపచ్చగాఉన్నది అని అంటాము. గ్రామములోని ఇండ్లుతగలబడుతూఉంటే గ్రామమునుండి పోతున్నది అనిఅంటాము.

491 తాద్ధర్మ్యాత్తాచ్ఛబ్ద్యమ్.

ఏకధర్మముగల వస్తువులకు పేరొక్కటేవస్తుంది. బ్రహ్మాసత్తుపు జడలనుధరిస్తే, బ్రహ్మాదత్తుడుకూడా జటిఅని పిలువబడుతాడు.

492 తాలసర్పన్యాయము.

తాటిచెట్టుమీదకు ప్రాకేపాముకు ఒళ్ళంతాచీరుకపోయిపాము చస్తుంది. అట్లే చెడుకార్యమును చేసేవాడున్నూ.

493 తిలతండులన్యాయము.

నువ్వులను బియ్యమును కలిపితే, వేటికవిప్రత్యేకముగా కనిపిస్తవి. అట్లే మూఢులను జ్ఞానవంతులను వారిమాటలనుబట్టి ఏర్పాటు చేయవచ్చును.

'నువ్వులూ, బియ్యమూ, తీసికొనిరా,' అని ఒకమూర్ఖునితో చెప్పగావాడు వాటిని ప్రత్యేకముగా తేక, రెండింటినికలిపి తెచ్చినాడట, అని ఈన్యాయమునకు కొందరు అర్థముచెప్పుతారు.

494 తిలే తాలం పశ్యతి.

నువ్వులురా అంటే, తాటిచెట్టా అని అడిగినట్లు.

495 తులాయష్టిన్యాయము.

త్రాసుయొక్క దండమువలె. కొంచెము బరువెక్కువైతే అది క్రిందికిదిగుతుంది. కొంచెము తక్కువఅయితే మీదికిలేస్తుంది. అట్లే, దుష్టునికి కొంచెములాభముకలుగుతే నిగిడిపోతాడు. కొంచెమునష్టము కలిగితే క్రుంగిపోతాడు.

496 తులోన్నమన న్యాయము.

త్రాసుయొక్క ఒకప్రక్కను చిటికెనవ్రేలితో పైకిఎత్తుతే, ప్రయత్నములేకుండానే రెండోప్రక్క క్రిందికిదిగుతుంది. అట్లే, ప్రబలుడైన ఒకశత్రువునుజయిస్తే, అతనిప్రక్కనున్న యితరశత్రువులనుకూడా జయించినట్లే అవుతుంది.

497 తుల్యబలప్రేషణ న్యాయము.

సమానబలముగలవారొకరినొకరు తమకార్యములందునియోగించుకొంటారు. ఒకడొకపని రెండోవానికిచేస్తే, రెండోవాడు మొదటివానికి అటువంటిపనినేచేస్తాడు.

498 తుల్యాయవ్యయన్యాయము.

సంపాదనకూ ఖర్చుకూ సరిపోయినట్లు.

499 తుషఖండన న్యాయము.

ఊకదంపు. ఊకనుదంపినందువలన ప్రయోజనములేదు. అట్లే వృథావాదమువల్లనూ ప్రయోజనములేదు.

500 తుష్యతుదుర్జన న్యాయము.

దుర్జనుడు ప్రస్తుతము సంతోషించనీ, కొద్దికాలములో తనదుష్టత్వమునకు ఫలము ననుభవిస్తాడు. అట్లే, కువాదము చేసేవాడుచెప్పినయుక్తిని మొదట అంగీకరించి, దానివల్లగలిగే దుష్టఫలమును అతనికి చూపిస్తే వానిసంతోషము అంతరిస్తుంది.

501 తృణజలౌకాన్యాయము.

గొంగళీపురుగు మరొక గడ్డిపోచను పట్టుకొన్నతరువాతగాని, మొదటిగడ్డిపోచను విడిచిపెట్టదు. అట్లే, జీవాత్మ అవిద్యాదులచేత మరొకదేహమును కల్పించుకొన్నతరువాతనే ఇప్పటిదేహమును విడిచిపెట్టుతుంది.

502 తృణాగ్నిన్యాయము.

గడ్డిమంటవలె చిరకాలముండేదికాదు.

503 తృణారణిమణిన్యాయము.

గడ్డికి నిప్పుతగిలితే గడ్డి నిప్పేఅవుతుంది. యజ్ఞములో అరణి యందు మథించిన నిప్పు పవిత్రమయిన హోమాగ్ని అవుతుంది. సూర్యకాంత శిలయందు పుట్టిన అగ్నిజ్వాల మణిజ్వాలఅవుతుంది. అట్లే, కావ్యవస్తువొక్కటే అయినా, కవియొక్క ప్రతిభనుబట్టి, ఉత్తమ, మధ్యమ, అధమకావ్యములు బయలుదేరుతవి.

504 తృషా శుష్యత్యాస్యే పిబతి సలిలం స్వాదు సురభి.

దాహమువేస్తూఉంటే నీరు తీయగా పరిమళముగా ఉంటుంది.

505 త్యజతి భయ మకృతపాపః.

పాపముచేయనివానికి భయముండదు.

506 త్యజే దేకం కులస్యార్థే.

కులమును రక్షించడముకోసము ఆకులములోని దుష్టునిపరిహా రింపవలెను. ఒకవిషయమును గురించి రెండు సంశయములున్నప్పుడు మొదటిదానివల్ల అనేకార్థహానిన్నీ, రెండోదానివల్ల ఒక్కఅర్థమునకే హానిన్నీ కలిగేటప్పుడు, రెండోదానినే స్వీకరింపవలెను. మొదటిదానిని అవలంబింపకూడదు.

507 త్యాజ్యా దుస్తటినీ.

ఒడ్డులుపడిపోతూఉన్న నదిరేవుకు పోకూడదు. అట్లే, దుష్టుని దగ్గరకుకూడా పోకూడదు.

508 దగ్ధపటన్యాయము.

బట్ట అగ్నిచేతదగ్ధమయినా, దానిఆకారముమాత్రము కొంత సేపువరకూ కనబడుతుంది. అట్లే, ధనమంతా పోయినా దానిమీద అభిమానముమాత్రము కొంతకాలము నిలచి ఉంటుంది.

509 దగ్ధపత్రన్యాయము.

ఒకఆకును కాలిస్తే దాని ఆకుఆకారము పోకపోయినా, అది ఆకుకాదని ఎట్లు తెలుసుకొంటామో, అట్లే, సంసారము నిస్సారమని

తెలుసుకొన్నవాడు దానిమీద మరిభ్రాంతిపొందడు. చూ. దగ్ధరశనా న్యాయము.

510 దగ్ధబీజన్యాయము.

విత్తుకాలిపోతే, మొక్క మొలవదు. అట్లే, అజ్ఞానము నశిస్తే, సంసారమనేది ఉండదు.

511 దగ్ధరశనా న్యాయము.

త్రాడు పేనేటప్పుడు మూడు పేటలు కలిపిపేనుతారు. ఆత్రాటిని కాల్చితే ఆమూడుపేటలుగల ఆకారముతోనే పడిఉంటుంది. కాని, అదిత్రాడుకాదని ఏలాగున తెలుసుకొంటామో, అట్లే సంసారము నిస్సారమని తెలుసుకొన్నవాడు దానిమీద భ్రాంతిపొందడు. చూ. దగ్ధపత్రన్యాయము.

512 దగ్ధేంధన వహ్నిన్యాయము.

వంటకట్టెలు వంటచేయుటకు సహాయపడి, తాము మాత్రము కాలిపోతవి. అట్లే, మంచివారు ఇతరులకు మంచిచేసి తాము నష్టము పొందుతారు.

513 దండచక్రన్యాయము.

కుమ్మరిచేసే కుండకు వానిచేతిలోనికఱ్ఱా, త్రిప్పుతూఉన్న చక్రమూ, జల్లుతూఉన్ననీళ్ళు, ఇంతకునుమించి వానినేర్పూ, కారణములవుతవి. అట్లే కావ్యనిర్మాణమునకు అదృష్టము, అభ్యాసము, ప్రతిభ అనేవి కారణములవుతవి.

514 దండసర్పమారణ న్యాయము.

పామును చంపడమునకు కఱ్ఱచాలిఉండే పెద్దగొడ్డలిని పట్టుకొని బయలుదేరేటట్లు. ఒకకార్యము సులభముగా సాధ్యమవుతూఉన్నప్పుడు దానికోసము పెద్దప్రయత్నము చేయనక్కరలేదు.

5 5 దండాపూపన్యాయము.

ఒక కఱ్ఱకుకొన్ని అపూపములను కట్టి ఉంచినారు. ఒక ఎలుక కఱ్ఱను కొరికినది. అని చెప్పినప్పుడుఅపూపములనుకూడాకొరికితినినది అని వేరేచెప్పనక్కరలేదు.

516. దత్త తిలాంజలిన్యాయము

నువ్వులూనీళ్ళూ వదలిపెట్టుకోవడము. అనగా, ఆశవిడిచిపెట్టడము.

5 7. దధి(త్రా)పుషం ప్రత్యక్షో జ్వరః

నీసపుపాత్రిలోనిపెరుగు ప్రిత్యక్షజ్వరము. అంటే జ్వరమునకు నిమిత్తకారణ మన్నమాట. (చూ. అంతరేణాపి నిమిత్తశబ్దం నిమిత్తార్థోగమ్యతే.)

518. దరిద్రః కిం నకురుతే.

దరిద్రుడు ఏమి చేయడు? అన్ని నీచకార్యములున్ను చేస్తాడు.

519. దర్దురా యత్రి వక్తార స్తత్రి మౌనం హి శోభనమ్.

కప్పలు మాటకారులయినచోట మాట్లాడ కుండడమే శోభ.

520 దర్పణప్రతిబింబన్యాయము.

అద్దములోని ప్రతిబింబము వలె, విశ్వమంతా పరమాత్మ యొక్క ప్రతిబింబమే కాని, సత్యమయినది కాదు.

521 దర్పణముఖావలోకనన్యాయము.

ముఖము కురూపము.గాఉంటే అద్దములో కురూపముగానేకనబడుతుంది; అందముగాఉంటే అందముగానేకనబడుతుంది. ఉన్నదున్నట్లు చెప్పేటప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది.

522 దర్వీహోమన్యాయము

తెడ్డుతో చేసినహోమమువలె. ఈన్యాయము మీమాంసా శాస్త్రములోవస్తుంది.

523 దాక్షిణ్యా ద్ధననాశనమ్

దాక్షిణ్యముకలిగిఉంటే ధనమునష్టమవుతుంది.

524 దానేన ద్విషంతో మిత్రాణి భవంతి

దానముచేస్తే శత్రువులుకూడా మిత్రులవుతారు.

525 దామవ్యాలకటన్యాయము.

దాముడు, వ్యాలుడు, కటుడు, అనేముగ్గురురాక్షసులుండేవారు. శంబరాసురుడు వారిని తనమాయచేతసృజించినాడు. వారికి పిడికిటితో మేరుపర్వతమునుకూడా పిండిచేయగలశక్తి ఉండేది. కాని,వారుమూర్ఖులు కావడముచేత అంతకంతకూబలముతగ్గి తుదకుదోమలై పుట్టినారు. అజ్ఞానికి ఉచ్చదశపట్టినా అంతకంతకూ నీచదశపొందుతాడు. చూ. భీమభాసదృఢన్యాయము.

526 దాహక దాహన్యాయము.

మంటలులేనిఅగ్ని కట్టెతోకలిసి ఆకట్టెయొక్క ఆకారమునుతాను కూడాపొందినట్లు.

527 దుఃఖమేవ సర్వం వివేకినః

వివేకముగలవానికి ఎక్కడచూచినా ప్రపంచము దుఃఖాత్మకమయినట్లుకనబడుతుంది. అందుచేత అతడు ప్రపంచమును విడిచిపెట్టగోరుతాడు.

528 దుర్జన గర్దభన్యాయము.

దుర్జనుడు గాడిదవంటివాడు. గాడిదమంచిస్థలమును మలినముగాచేస్తుంది. దుర్జనుడు మంచివారికీర్తిని మలినముచేస్తాడు. గాడిదను ఎంత కొట్టినా తనగుణమునువిడువదు. దుర్జనుని ఎంతశిక్షించినా మంచిమార్గములోనికి రాడు.

529 దుర్భిక్షే మల్పం స్మరణం చిరాయ.

కరువుకొంచెముకాలమేఉన్నా, దానిని చాలాకాలమువరకూ మరచిపోరు.

530 దుశ్చికిత్స్యవ్రణపీడితానాం వ్రణం శిశమయిషోః శస్త్రగ్రహణమ్.

ఎన్నిమందులు వేసినా మానని పుండు బాధ పోగొట్టుటకు శస్త్రముచేయించినట్టు. శస్త్రముచేసే వైద్యుడు పుండునుకోసేటప్పుడు బాధనుపోగొట్టుటకు కోస్తాడుగాని దయలేకపోవడముచేత కోయడు. అట్లే చెప్పినమాటవినని కొడుకును శిక్షించడము వానిని మంచిమార్గములో పెట్టడమునకేగాని దయలేక కాదు.

531 దూరస్థాః పర్వతా రమ్యాః సమీపస్థాస్తు బర్బరాః.

దూరపుకొండలు నునుపు; దగ్గరకుపోతే ఎగుడుదిగుడులుగాకని పిస్తవి.

532 దృష్టం కిమపి లోకేఽస్మిన్ న నిర్దోషం ననిర్గుణమ్.

కేవలమూ నిర్దోషమైనదిన్నీ, కేవలమూ నిర్గుణమైనదిన్నీ ఏదీలోకములో కనబడదు. ప్రతివస్తువునందూ గుణదోషములు రెండూ ఉంటవి.

533 దృష్టి సృష్టిన్యాయము.

ప్రజాపతి జాగ్రదవస్థలో ఉన్నప్పుడు ప్రపంచమును సృష్టిస్తాడు. నిద్రించేటప్పుడు ఆప్రపంచమును తనలో లీనముచేసుకొంటాడు.

534 దృష్టే సంభవ త్యదృష్టకల్పనా న న్యాయ్యా.

ప్రత్యక్షముగా కారణము కనబడుతూఉంటే, అప్రత్యక్షమైన కారణముకోసము పరుగులెత్తనక్కరలేదు.

535 దేవతాధికరణన్యాయము.

మట్టిబొమ్మనుచేసి, దానిలో తనయిష్టదేవతను ఆవాహనచేసి, ఆ బొమ్మ ఆదేవతగా భావించి పూజచేయడము. ఏకలవ్యుడు మట్టిబొమ్మనుచేసి, అదేద్రోణాచార్యుడుగా భావించి, విలువిద్యనునేర్చుకొన్నాడు.

536 దేవదత్తపుత్రన్యాయము.

ఇతడు దేవదత్తుని కుమారుడు అన్నప్పుడు, దేవదత్తునిభార్యకు కూడా కుమారుడే అవుతాడు. కాని, తండ్రికి ప్రాధాన్యమిచ్చినప్పుడు తండ్రిపేరును ఉదాహరిస్తారు. (చూ. దేవదత్తాపుత్రన్యాయము.)

537 దేవదత్తహంతృహతన్యాయము.

దేవదత్తుని చంపినవానిని చంపుతే, దేవదత్తుడు తిరిగి జీవించడు అట్లే. అజ్ఞానమును పోగొట్టినజ్ఞానముకూడా నశిస్తే, తిరిగి అజ్ఞానముఉదయించి బంధము కలుగదు. "అచః పరస్మిన్ పూర్వవిధౌ" అనేసూత్రమువద్ద వ్యాకరణమహాభాష్యములో ఈన్యాయము ఉదాహరింపబడినది.

538 దేవదత్తహననోద్యతహతన్యాయము.

దేవదత్తుని చంపప్రయత్నించినవాడు చస్తే, దేవదత్తుడు బ్రతికి ఉంటాడు. "రామౌ" అని ప్రథమాద్వివచనరూప నిష్పత్తిలో వృద్ధికి బాధకముగాఉన్న పూర్వసవర్ణదీర్ఘమునకే బాధకలుగగా వృద్ధి మిగిలిపోతుంది.

539 దేవదత్తాపుత్రన్యాయము.

దేవదత్తఅనే స్త్రీయొక్క కొమారుడు, అనిచెప్పేటప్పుడు ఆకొడుకు తనతండ్రియొక్క కుమారుడుకూడా అవుతాడు. తల్లివంశముప్రసిద్ధమయినప్పుడు తల్లివంశమును ఉదాహరించడము మర్యాద, ఇట్లే యజుర్వేదములో "అథవంశస్తదిదం వయం భారద్వాజీపుత్రాద్భారద్వాజీపుత్రోవాత్సీ మాండవీపుత్రాద్వాత్సీమాండవీపుత్రః" అని యీరీతిగాచెప్పబడినది. పాణినికిదాక్షీపుత్రుడనిపేరు. (చూ. దేవదత్తపుత్రన్యాయము.)

540 దేశకాలవయోవస్థా బుద్ధిశక్త్యనురూపతః
ధర్మోపదేశో భైషజ్యం వక్తవ్యం ధర్మపారగైః.

ధర్మోపదేశముగాని, వైద్యముకాని, దేశము, కాలము, వయస్సు, అవస్థ, బుద్ధి, శక్తి, మొదలగువాటి ననుసరించి చేయవలెను.

541 దేహకేశన్యాయము

శరీరమునుంచి రోమములు మొలచునట్లు (స్వాభావికమైనది.) చూ గోమయవృశ్చికన్యాయము

542 దేహలీదీపన్యాయము

రెండుగదుల మధ్యనున్న ద్వారమునం దుంచబడినదీపము రెండుగదులకున్నూ వెలుగునిస్తుంది. ఒక్కవస్తువు రెండుపనులకుపయోగించేటప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

543 దేహాధోముఖత్వన్యాయము

దేహము పంచభూతాత్మకమయినది గనుక ఆత్మ దానిలో చేరినప్పుడు అధోగతినిపొందిఉంటుంది. ఆదేహముతో సంబంధమువిడిపోగానే అది ఊర్ధ్వముఖమవుతుంది.

544 ద్రవిడప్రాణాయామన్యాయము

నీముక్కుచూపెట్టుమంటే తలచుట్టూచేయితిప్పి ముక్కును తాకినట్లు. చూ. శిరోస్పర్శనేన నాసికా స్పర్శన్యాయము.

545 ద్రవ్యవచోప్చచారః

వస్తువునుబట్టి దానికి గౌరవమువస్తుంది.

546 ద్విగతా అపి హేతవో భవంతి.

రెండుకార్యములను ఒక్కసాధనముతోనే సాధించడము. విఘ్నేశ్వరునిపూజకు అన్నిచెట్లఆకులూ పనికివస్తవి. అందువల్ల విఘ్నేశ్వరపూజకావడమేకాకుండా చెట్లమీదముదిరిపోయినఆకులను దూసివేయడమువల్ల చెట్లన్నీచక్కగాచిగిరించి తిరిగీఫలవంతము లవుతవి. అట్లే దీపావళినాడు దీపములుపెట్టి మతాబులనుకాల్చుటవల్ల నేత్రానందమూ దేవతాప్రీతీ కలుగడమేకాకుండా కీటకనాశనమూ, వాయువునిర్మలముకావడమూకూడా సంభవిస్తుంది. "ఏకాక్రియాద్వ్యర్థకరీ" అనేసామెతఇట్టిదే. చూ. జామాతృర్థం ప్రస్తుతస్యసూపాదేరతిథ్యుపకారకత్వమ్; గృహార్థమారోపితస్య దీపస్య రథ్యోపకారకత్వమ్.

547 ద్విర్బద్ధం సుబద్ధం భవతి

రెండుమాట్లుచేయబడినవిధి అవశ్యాచరణీయమవుతుంది.

548 ధనక్షయే వర్ధతి జాఠరాగ్నిః

ధనముపోతే ఆకలిఎక్కువలవుతుంది.

549 ధనంజయన్యాయము

కౌరవకులమును నిజముగా నాశనముచేసినవాడు శ్రీకృష్ణుడే అయినా ఆపేరు అర్జునునికివచ్చినట్లు.

550 ధనమూల మిదం జగత్.

జగత్తుకు ధనమేఆధారము.

551 ధనుర్గుణన్యాయము.

వంకరగాఉండేవింటికి విలుకాండ్రు గుణమును (అల్లెత్రాటిని) సంధించేటట్లు మహాత్ములు వక్రబుద్ధిగల దుష్టులకుకూడా మంచిగుణములను ఆరోపిస్తారు.

552 ధర్మకంచుకప్రవేశనమ్.

ధర్మమనేకవచమును తొడుగుకొనడము. లోపలకత్తి, పైకిభక్తి.

553 ధర్మంతు చింతయే త్ప్రాజ్ఞః.

బుద్ధిమంతుడు ధర్మమును చింతింపవలెను.

554 ధర్మాధర్మాత్మకన్యాయము.

లోకములో ధర్మమూ అధర్మమూకూడాఉంటవి. అట్లే సుఖ దుఃఖములు, చీకటివెలుతురులు మొదలయినవి.

555 ధర్మికల్పనాతో ధర్మకల్పనా వరీయసీ.

ఒకధర్మమును కలిగిఉన్నవస్తువులను నిర్దేశించడముకంటె ఆవస్తువుల సామాన్యధర్మమేదో నిర్ణయించడముఎక్కువ.

556 ధాన్యపలాలన్యాయము.

ధాన్యమునుండి పైఊకను తొడునుతీసివేసి, లోపలిబియ్యమును వండుకొనితినేటట్లు. (పొలమునుంచి ధాన్యమునేతెచ్చుకొన్నా, పాటిని దంచి లోపలిబియ్యమునువండుకొని ఊముకను పారవేస్తాము. అట్లే,

శాస్త్రములన్నీ చదువుకొని, జ్ఞానము సంపాదించినతరువాత ఆశాస్త్రములను వదలివేయవలెను).

557 ధూర్తైర్జగద్వంచ్యతే.

ధూర్తులు జగత్తును వంచిస్తారు.

558 ధూల్యంధకార ధూమాభ్ర విముక్తగగనమ్.

ధూళి, చీకటి, పొగ, మొదలయినవిలేకుండా నిర్మలముగాఉండే ఆకాశమువలె, (నిర్వికల్ప, నిర్గుణపరబ్రహ్మము నిర్మలుడై ఉంటాడు.)

559. ధైర్యం సర్వత్రసాధకమ్.

ధైర్యమువల్ల అన్నిపనులూ సాధ్యమవుతవి.

560 నఖలు ప్రేమ చలం సుహృజ్జనే.

స్నేహితునియందు ప్రేమ చలించదు.

561 నచ ప్రయోజనమంతరా చాణక్యః స్వప్నేఽపిచేష్టతే.

ప్రయోజనములేనిదీ చాణక్యుడు (రాజనీతిజ్ఞుడు) కలలోకూడా ఏపనీచేయడు.

562 న చాన్యార్థం ప్రకృతమన్యార్థం భవతి.

ఒకఅర్థములో ప్రయోగింపబడినశబ్దమునకు మరొకఅర్థము కలుగదు. బల్లిప్రాకుచున్నదిగనుక అదిప్రాకేపాముకాజాలదు.

563 నఞివయుక్త మన్యసదృశాధికరణే తథాహ్యర్థగతిః.

నఞ్ అర్థములోచెప్పబడినశబ్దము, తత్సదృశమైనవస్తువునందే ప్రవర్తిస్తుంది. "అబ్రాహ్మణుని తీసికొనిరమ్ము" అంటే, బ్రాహ్మణుడు కానిదంతా అబ్రాహ్మణశబ్దవాచ్యమేఅయినా, క్షత్రియాది మనుష్యులను తీసికొనివస్తాముగాని, ఒకరాతిని తీసికొనివచ్చి, ఇది అబ్రాహ్మణుడుఅని చెప్పడానికివీలులేదు.

564 నటాంగనాన్యాయము.

నటీవేషమునుధరించినస్త్రీని, నటకులు 'నీవెవరిభార్యవు, ఎవరి

భార్యవు, అనిఅడుగుతూఉంటే ప్రతీవానితో 'నీభార్యనే, అనిఅంటుంది. అట్లే, హల్లు ఏఅచ్చుకలుస్తూఉంటే ఆఅచ్చుకేచెందినట్టు తోస్తుంది.

565 నద్వలోదకం పాదరోగః.

రెల్లుమొలచియున్ననీళ్ళుపాదరోగము. అంటే, పాదరోగము నకు నిమిత్తకారణము. (చూ. అంతరేణాపినిమిత్తశబ్దం నిమిత్తార్థో గమ్యతే.)

566 నదీసముద్రన్యాయము.

నదిన్నీ, అదికలిసేసముద్రమున్నూ, ఎట్లుభిన్నములో, జీవేశ్వ రులుకూడా భిన్నులు. చూ. శకునిసూత్రన్యాయము, శుద్ధోదలవణ న్యాయము, చోరాపహార్యన్యాయము, పుంవిషయన్యాయము, నానా వృక్షరసన్యాయము.

567 నదీసముద్రన్యాయము.

నదులుప్రవహిస్తూ సముద్రములోకలిసి, తమనామరూపములు విడిచిపెట్టేటట్లు (జీవాత్మలు సంసారములో సంచరిస్తూ తుదకు తమ భిన్నత్వమునువిడిచి, అఖండపరబ్రహ్మములో లీనములౌతవి).

568 నద్యంబువేగన్యాయము.

నదులు అతివేగముగాప్రవహించి సముద్రములో కలిసేటట్లు, లోకములు అతివేగముగా పరిణామముపొందుతూ పరబ్రహ్మములో కలుస్తవి.

569 నద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే.

జ్ఞానిఅయినవాడు దుష్టకర్మను ద్వేషింపడు. శుభకర్మను చేయడు. అనగా సమబుద్ధికలిగిఉంటాడు.

570 న ధర్మవృద్ధేషు వయః సమీక్ష్యతే.

ధర్మము తెలుసుకొని ఉండడమునకు వయస్సుతోనిమిత్తము లేదు.

571 ననువక్తృవిశేషనిస్పృహా గుణగృహ్యావచనే విపశ్చితః.

వివేకిఅయినవాడు ఎక్కువగామాట్లాడడు. అట్లుమాట్లాడకపో వడము అతనిగుణవిశేషమువల్లనే.

572. నను స్వార్థపరోలోకః.

లోకము తనలాభమునేచూచుకొంటుందిగదా. చూ. సర్వఇమే స్వభూత్యర్థం ప్రవర్తంతే; సర్వఃస్వార్థం సమీహతే.

573 నమంతిసంతస్త్రైలోక్యాదపిలబ్ధుం సమున్నతిమ్.

సజ్జనులు మూడులోకములలోను గొప్పతనమును పొందడము నకై అణకువకలిగిఉంటారు.

574 నరాణాం నాపితో ధూర్తః.

మనుష్యులలో మంగలి దొంగ.

575 నవవైధవ్య మసహ్యావేదనమ్.

క్రొత్తగాముండమోసినదానిబాధ ఇంతింతకాదు,

576 నశాలేః స్తంభకరితా వప్తుర్గుణమపేక్షతే.

వరికట్ట లావుగాఅవడమునకు విత్తనమువేసినవాని గుణము కారణముకాదు.

577 నష్టాశ్వదగ్ధరథన్యాయము.

ఇద్దరురథికులు తమరథములకు గుఱ్ఱములనుపూన్చి, రథములను తోలుకొని, ఒకగ్రామములోనికి ప్రవేశించినారు. ఆక్కడరథముల నుంచి, గుఱ్ఱములనువిప్పి, ఎక్కడికోపోయినారు. ఇంతలో ఆగ్రామము నకు అగ్నిఅంటుకొన్నది. అప్పుడు వారిద్దరూ తమరథములున్న అశ్వ ములున్నకూడా తగలిబడిపోతవేమోఅని పరుగుపరుగునవచ్చినారు. ఒకడు తనరథమును గ్రామమునుండి బయటికి తీసికొనిపోయేసరికి అతని గుఱ్ఱములు దగ్ధములైనవి. రెండోవాడు తనగుఱ్ఱములను రక్షించుకొనే సరికి తనరథము దగ్ధమైపోయినది. అప్పుడువారు వారిలోఒడబడి ఒకని

రథమునకు రెండోవానిగుఱ్ఱములనుపూన్చి, ఇద్దరున్నూ ఒక్కరథము మీాదనే ప్రయాణము సాగించినారు.

578 న సాహసమనారుహ్య నరో భద్రాణి పశ్యతి.

సాహసించి ఒకపనిలో ప్రవేశిస్తేనేకాని, కార్యములు సిద్ధించవు.

579 నసీప్రోత బలీవర్దన్యాయము.

ఎద్దుకు ముకుదాళ్ళుకట్టినట్లు (దుష్టుని నిరోధములో ఉంచడము.)

580 న సేవ్యః కేవలో నృపః.

కేవలము ఒక్కరాజునేకొలువకూడదు. అతడు తనమాటనే నెగ్గించుకొనవలెనని దుర్మార్గముగా సంచరిస్తాడు.

581 నహి కఠోరకంఠీరవస్య కురంగశావః ప్రతిభటో భవతి.

సింహముతో లేడిపిల్లయుద్ధముచేయగలదా? శాస్త్రజ్ఞునితో శాస్త్రముచదువనివాడు వాదముచేయలేడు.

582 నహి కరకంకణదర్శనాఽయాదర్శాపేక్షా.

ముంజేతికంకణమునకద్దమేల? (చూ నహిదృష్టేఽనుపపన్నమ్,)

583 నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి.

మంచిపనిచేసేవాడెవ్వడూ దుఃఖముపొందడు.

584 నహి కశ్చిత్ క్షణమపిజాతు తిష్ఠ త్యకర్మకృత్.

ప్రతీవాడూ ఎప్పుడూ ఏదోఒకపనినిచేస్తూనేఉంటాడు. కర్మల యందుప్రవృత్తి అనివార్యమయినది.

585 నహి కృత ముపకారమ్ సాధవో విస్మరంతి.

సాధువులు చేసినఉపకారమును మరచిపోరు.

586 నహి త్రిపుత్రో ద్విపుత్రః

ముగ్గురుకొడుకులుగలవాడు ఇద్దరుకొడుకులుగలవాడు కూడా

అయినా, అతనిని ఇద్దరుకొడుకులుగలవాడని అనకూడదు. ఒకవిషయ మునుగురించి సరిగావర్ణింపవలసివచ్చినప్పుడు దానికున్నలక్షణములలో కొన్నిటిని వర్ణింపక విడువకూడదు.

587 నహి దీపౌ పరస్పరస్యోపకురుతః.

ఒకదీపము మరియొకదీపమునకు ప్రకాశమిచ్చి సహాయము చేయదు.

588 నహి దృష్టేఽనుపపన్నమ్.

ఎదురుగాకనబడుతూఉన్న వస్తువు అక్కడఉన్నదని చెప్పడమునకు ప్రమాణముచూపనక్కరలేదు. (చూ. నహికరకంకణదర్శనాయాదర్శాపేక్షా.)

589 నహి ధీమతాం కశ్చిదవిషయోనామ.

బుద్ధిమంతులాలోచింపలేని విషయమేమీలేదు.

590 నహి నిందానింద్యం నిందితుం ప్రవర్తతేఽపి తు విధేయం స్తోతుమ్.

నిందించదగనివానిని ఒకనిని నిందించడమునకు ఆరంభించడము తనకుఇష్టమైనవానిని స్తుతించుటకేకదా. అయినా నిందార్హుడుకానివానిని నిందించడము తాను స్తుతించే వానినికూడా నిందించడమేఅవుతుంది. విష్ణువును స్తుతించడమునకు శివనిందచేయడము, శివకేశవులకు భేదములేకపోవుటచేత విష్ణువునుకూడా నిందించడమవుతుంది.

591 నహి పవిత్రం స్యా ద్గోక్షీరం శ్వదృతౌధృతమ్.

కల్లుకుండలో పోసినపాలు పవిత్రముకానట్లు దుష్టుడు సంపాదించినవిద్య మంచిదికాదు.

592 న హి పూర్వజో మూఢ ఆసీదిత్యాత్మనాపి మూఢేన భవితవ్యమితి కించి దస్తి ప్రమాణమ్.

మాఅన్న మూఢుడు, నేనుమాత్రమెందుకు మూఢుడను కాకూడదు అని అనకోకూడదు॥

593 న హి ప్రతిజ్ఞామాత్రేణార్థసిద్ధిః

ప్రతిజ్ఞమాత్రము చేయడముచేత కోరినకోరిక లభింపదు (చూ. ఏకాకినీ ప్రతిజ్ఞా హి ప్రతిజ్ఞాతం న సాధయేత్.)

594 న హి ప్రత్యక్షవిరుద్ధం శాస్త్రసహస్రేణాఽపి బోధయితుం శక్యమ్.

ప్రత్యక్షముగా కనబడేదానికి విరుద్ధముగనున్నదానిని ఎన్నిశాస్త్రములవల్లనైనా బోధించడమునకు శక్యముకాదు.

595 న హి ప్రమాణం జంతూనా ముత్తరక్షణజీవనే.

జంతువులు ఉత్తరక్షణములో జీవించి ఉంటవని చెప్పడమునకు వీలు లేదు.

596 న హి ప్రియం ప్రవక్తు మిచ్ఛంతి మృషా హితైషిణః

హితమును కోరేవారు ఊరకే ప్రియమైన మాటలను పలుకరు.

597 న హి భవతి కుండం బదరమ్.

కుండా, తరవాణీనీళ్ళూ కలిసిఉన్నా, కుండ తరవాణి నీరుగా మారదు.

598 న హి భిక్షుకో భిక్షుకం యాచితు మర్హతిసత్యన్యస్మి న్న భిక్షుకే.

కొంచెముధనముగలవాడున్నప్పుడు భిక్షుకుడు మరియొక భిక్షుకుని యాచించకూడదు.

599 న హి భుక్తవాన్ పునర్భుంక్తే.

ఒకమారు కడుపునిండా తిన్నవాడు వెంటనే తిరిగీభోజనము చేయలేడు.

600 న హి మరుమరీచి సరసీ క్రమశః శుష్యతి.

ఎండమావులలోని నీరు క్రమక్రమముగా ఇంకిపోదు. ఎండమావి ఒక్కసారిగానే అదృశ్యమవుతుంది. జ్ఞానోదయము కాగానే అజ్ఞానము ఒక్కసారిగానే నశిస్తుంది.

601 నహి మోహయతి ప్రాజ్ఞం లక్ష్మీర్మరుమరీచికా.

ఎండమావివంటిలక్ష్మి ప్రాజ్ఞునిమోహింపదు.

602 నహి వరఘాతాయ కన్యా ముద్వాహయంతి.

పెండ్లికొడుకును చంపడమునకు పెండ్లికూతురుని తీసికొనిరారు. (చూ. వరఘాతాయ కన్యావరణమ్.)

603 న హి వివాహానంతరం వరపరీక్షా.

పెండ్లిఅయినతరువాత పెండ్లికొడుకు మంచివాడా, కాడా అని పరీక్షచేసినట్లు (నిష్ప్రయోజనమన్నమాట.) చూ. ఊషరవృష్టిన్యాయము, మొద.

604 న హి శాబ్ద మశబ్దేన.

మాటలేకపోతే, మాటవల్లకలిగే ఫలముకూడాకలుగదు. "మాటకుమాట తెగులు, నీటికి నాచు తెగులు" అని తెనుగుసామెత.

605 నహి సర్వత్రానీశశక్తిః.

ఈశ్వరశక్తికనబడనిస్థలమేలేదు. ఈశ్వరుడు సర్వవ్యాపి, సర్వశక్తుడున్ను, అనుట.

606 న హి సర్వః సర్వం జానాతి.

అందరికీ అన్నిసంగతులూ తెలియవు. లోకములో సర్వజ్ఞుడెవడూ లేడు.

607 న హి సార్వభౌమానంద మనుభవన్రాజా గ్రామాధిపతిసుఖం తుచ్ఛమపేక్షతే.

చక్రవర్తిపదముయొక్క ఆనందముననుభవించేవాడు, ఒకగ్రామకరణముయొక్క అధికారముకోసము ఆశపడుతాడా? అట్లే బ్రహ్మానందము ననుభవిస్తూఉన్నజ్ఞాని, విషయసుఖముకోసము ఆశపడడు.

608 న హి సుఖం దుఃఖై ర్వినా లభ్యతే.

దుఃఖము లు లేనిదీ సుఖములభించదు.

609 నహిసుతీక్ష్ణాప్యసిధా రాస్వయంఛేత్తుమాహితవ్యా పరా.

కత్తివాడిగలదయినా, దానితో కోసేవాడొకడుండవలెను.(చూ. నహిసుశిక్షితో ఉపివటుః స్వస్కంధమారోఢుంపటుః)

610 న హి సుశిక్షితో ఉపి వటుః స్వస్కంధమారోఢుం పటుః

బాలునికి ఎంతవిద్యనేర్పినా తనభుజముమీద తానుఎక్కలేడు. "బంగారపుపళ్ళెమునకయినా గోడచేర్పు ఉండవలెను" అని తెనుగుసామెత. ఎవ్వడూతనమీద తానే ఆధారపడిఉండలేడు. (చూ. నహిసుతీక్ష్ణాప్యసిధా రాస్వయంఛేత్తుమాహితవ్యా పరా.)

611 నహి సోపానత్కే పాదే పునరప్యుపానహం ప్రతిముంచతి.

చెప్పులు తొడుగుకొనిఉన్నవాడు తిరిగీ ఆపాదములకే చెప్పులు తొడుగుకోడు.

612 న హి స్వల్పో దోషో౽ మితగుణాభిభావకః.

ఒక్కదోషమువల్ల అనేకసద్గుణములకు హానికలుగదు. చూ. ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః.

613 న హిస్వస్కంధం స్వయమారోఢుం శక్నోతి.

తనభుజముమీదికి తానే ఎవ్వడూఎక్కలేడు. అట్లే, గురువు లేనిదే ఎవ్వడూబ్రహ్మజ్ఞానమును పొందలేడు.

614 న హీశ్వరవ్యాహృతయః కదాచి త్పుష్ణంతి లోకే విపరీత మర్థమ్.

ఈశ్వరునికిచేసిన పూజలెప్పుడున్ను అనర్థదాయకములుకావు.

615 నహ్యాయం స్థాణోరపరాధో యదేనమంధో నపశ్యతి.

ఎదురుగా ఉన్న స్తంభమును చూడలేక, గ్రుడ్డివాడు దానిమీద తలపగులకొట్టుకొంటే, ఆతప్పు స్తంభముదికాదు.

616 న హ్యేకముదాహరణం యోగారంభం ప్రయోజయతి.

ఒక్కఉదాహరణమువల్ల సామాన్యసూత్రము చేయకూడదు.

617 న హ్యేకమేవ సవిశేషం నిర్విశేషంచ భవతి.

ఒకవస్తువునకు ఒకవిశేషముండడమున్ను, లేకపోవడమున్ను కూడా సంభవించదు. ఆత్మ "సత్యకామః, సత్యసంకల్పః, అస్థూలమ్, అనణు, అహ్రిస్వమ్" అనిచెప్పినప్పుడు పుంలింగమున్ను, నపుంసకలింగమున్ను, అయిన రెండువిధముల విశేషణములనూ ప్రయోగించినా, ఆఆత్మ ఉభయలింగముకలదని చెప్పకూడదు.

618 నా గృహీత విశేషణా బుద్ధిర్విశేష్యముపసంక్రామతి.

విశేషార్థములేని విశేష్యముండదు. ఒకజాతినుంచి ఒకవ్యక్తిని విడదీసినప్పుడు దానికేదో ప్రత్యేకగుణముండవలెను.

619 నాజ్ఞాతవిశేషణవిశిష్టబుద్ధి ర్విశేషణ ముపసంక్రామతి.

విశేషణముయొక్క జ్ఞానముచేతనే ఆవిశేషణముగల విశేష్యముయొక్క జ్ఞానముకలుగుతుంది. ఆవిశేషణజ్ఞానము లేకపోతే విశేష్యముయొక్క జ్ఞానమున్ను కలుగదు. 'దండము' అనేజ్ఞానము లేకపోతే 'దండి' అనేజ్ఞానముకూడా కలుగదు.

620 నాంతరీయకన్యాయము.

ఒకశబ్దమునకున్న అర్థములో ఎంతమట్టుకు కావలెనో అంతమట్టుకే గ్రహింపవలెను. అంతఅర్థమును గ్రహింపవలెనన్న నియమములేదు. ధాన్యముదంచి దానిఉముకను, తౌడునుతొలగించికదా ఉపయోగింతుము. గింజలుగల పండ్లలోనిగింజలను విడిచిపెట్టుదుముకదా.

621 నా దత్త ముపతిష్ఠతి.

తాను దానముచేసినది తనకుతిరిగిరాదు. తానుదానముచేస్తే ఇంకొకరు తనకుదానముచేస్తారు.

622 నానావృక్షరసన్యాయము.

అనేకవృక్షములలోనుండేరసము ఆవృక్షములనుండిఎట్లుభిన్నమై ఉంటుందో, జీవులుకూడా ఈశ్వరునినుండి భిన్నులై ఉంటారు.

623 నానుపహత్యభూతాని భోగ స్సంభవతి.

విషయభోగములననుభవించడమునకు ఇతరజీవులకు ఏదో ఒక రూపముగా బాధకలిగించవలసిఉంటుంది.

624 నానృతాత్ పాతకం పరమ్.

అసత్యమాడడముకంటె ఎక్కువపాపము లేదు.

625 నాఽన్యదృష్టం స్మర త్యన్యః.

చూచేవాడొకడున్ను, దానినిజ్ఞాపకముంచుకొనేవాడు మరొకడున్ను అయిఉండరు. ఇంద్రియములు విషయగ్రహణమును చేయును గనుక, అవే ఆవిషయములను స్మృతిలో ఉంచుకొంటవి. ఎందుచేతనంటే, ఆఅవయవములునశిస్తే, ఆవిషయములనుగురించిన స్మృతికూడా నశిస్తుంది.

626 నాఽపృష్టః కస్యచిద్బ్రూయా న్న చాన్యాయ్యేనపృచ్ఛతః.

అడుగనిదీఎవ్వరికీ చెప్పకూడదు; అడిగినవానికి తప్పుచెప్పకూడదు.

627 నామార్థయోరభేదాన్వయః.

శబ్దమునకున్ను అర్థమునకున్ను అవినాభావసంబంధమున్నది. శబ్దము లేకపోతే అర్థముపుట్టదు. అర్థము లేకపోతే శబ్దముపుట్టదు.

628 నామైకదేశే నామగ్రహణమ్.

దత్తుడు అంటే దేవదత్తుడు, భామ అంటే సత్యభామ, భీముడు అంటే భీమసేనుడు అని నామైకదేశముచేత తెలుస్తుంది.

629 నారికేలఫలాంబున్యాయము.

కొబ్బరికాయలోనికినీరువచ్చినట్లు (ధనము ఎప్పుడువస్తుందో తెలియకుండానే చేరుతుంది.)

630 నారీణాం భూషణం పతిః.

స్త్రీలకు మగడే అలంకారము.

631 నాశ్మని స్యాత్ క్షురక్రియా.

రాతిని మంగలికత్తితో గొరిగినట్లు. దుష్టునికిచేసిన హితోపదేశముకూడా ఇట్టిదే.

632 నాస్తి నష్టే విచారః.

నష్టమైతే విచారమేలేదు. అయితే అవుతుంది, లేకపోతేలేదు, అని నిర్విచారముగా ఉండేవారనేమాట.

633 నిత్యా ఽనిత్యయోర్నిత్య విధిర్బలవాన్.

నిత్యవిధి, అనిత్యవిధి, అనేవాటిలో నిత్యవిధినితప్పకుండా ఆచరింపవలెను. (చూ. అక్లుప్తాభావకస్యాభావకల్పనాపేక్షయాక్లుప్తాభావస్యైవ తత్కల్పన ముచితమ్.)

634 నిమిత్తాంతరమే వా నైమిత్తికమ్.

కారణాంతరమంటే కారణములేదన్నమాట. మొదటఒకకారణముచెప్పి, అది పొసగనప్పుడు తప్పించుకొనడమునకు మరిఒకకారణము చెప్పడము.

635 నిమిత్తాభావే నైమిత్తికస్యా ప్యభావః.

చేసేవాడు లేకపోతే, చేయబడినపనికూడాఉండదు. ఈశ్వరుడు లేకపోతే జగత్తుకూడాఉండదు.

636 నిమ్నగాప్రవాహన్యాయము.

లోతయిన యేటిలో పడి కొట్టుకొనిపోవుచుండు పురుగులు మొదలయినవి ఒకసుడిలోనుండి తప్పించుకొన్నా వెంటనే మరిఒకసుడిలో తగుల్కొనుచుండును. అట్లే సంసారమనే ప్రవాహములోపడిన జీవుడు ఒకజన్మమును తప్పించుకొన్న వెంటనే మరిఒకజన్మమునెత్తుచుండును.

637 నిరంకుశాః కవయః.

కవులు నిరంకుశులు. వారుతమ భాషను భావములను తమ యిష్టానుసారముగా రచించి, లోకమును సంతోషపెట్టుతారు.

638 నిరస్తపాదపే దేశే ఏరండో ఉపి ద్రుమాయతే.

చెట్లులేని దేశములో ఆముదపుచెట్టే మహావృక్షము.

639 నిరీక్షితే కేలివనం ప్రవిశ్య, క్రమేలకః కంటకజాలమేవ.

ఒంటె ఉద్యానవనములోనికి పోయి, ముండ్లచెట్లను వెతకు కొంటుంది.

640 నిర్ధనః పురుషః పశుః; నిర్ధనపురుషః శవ్పసమానః.

ధనములేనివాడే పశువు ధనములేనివాడుగడ్డిపోచతో సమానుడు.

641 నిర్ధనమనోరథన్యాయము

దరిద్రునికి కోరికలు హెచ్చు.

642 నిర్విమర్శాహి భీరవః

భయపడే స్వభావముకలవారు తాము చేయబోయే దానినిగురించి ఆలోచించుకోలేరు. కథాసరిత్సాగరములో ఈక్రిందికథ ఉన్నది. "మహా నవ్రతుడైన సన్యాసిఒకడుఒకకోమటి ఇంటికి భిక్షకుపోయినాడు. అక్క డ ఆకోమటికూతురు బహుసౌందర్యవతి కనబడింది. ఆమెనుచూచి మోహపడి "ఆహా ఎంతకష్టము!" అని సన్యాసివెళ్ళిపోయినాడు. కోమటి ఆమాటవిని సన్యాసివద్దకుపోయి "స్వామీ, తాముమహానవ్రత మునువిడిచి "ఆహా ఎంతకష్టము అనిఎందుకన్నారు" అని అడిగినాడు. అప్పుడు సన్యాసి "నీకూతురికి పెండ్లి అయినవెంటనే నీవూనీకుటుంబమూ నశిస్తారని తెలుసుకొని ఆహా ఎంతకష్టము, అని అన్నాను, ఇంతే" అన్నాడు. కోమటిభయపడి "అయితే నన్నేమిచేయమన్నారు? "అని అడిగినాడు. "ఆమెనుఒక పెట్టెలో పెట్టి గంగలోవిడిచిపెట్టు" అని సన్యాసి అన్నాడు. కోమటి అట్లేచేసినాడు. సన్యాసి ఆమెనుగంగలోనుంచి తప్పించి తానుపెండ్లిచేసుకొన్నాడు,

643 నివాతస్థితదీపన్యాయము.

గాలిలేనిచోటనుంచిన దీపమువలె (శమాది షట్కసంపత్తిగల చిత్తము నిశ్చలత్వమును పొందుతుంది.)

644 నిషాద స్థపతిన్యాయము

నిషాదుడిని రాజుగా నియమించినట్లు. ఇది మీమాంసాశాస్త్రములో వచ్చేన్యాయము.

645 నిషేధ్యబోధా ద్వినిషేధ్య బాధః

దీనిని నిషేధింపవలెను అని తెలుసుకొన్నప్పుడు నిషేధ్యవస్తువును వదలిపెట్టుతాము.

646 నిసర్గనిపుణాః స్త్రియః

స్త్రీలు స్వాభావికముగానే జాణలు.

647 నిసర్గశాలీనాః స్త్రీజనాః

స్త్రీలు స్వభావముచేతనే లజ్జావతులు.

648 నీచాః కలహమిచ్ఛంతి సంధి మిచ్ఛంతి సాధవః

నీచులు కలహమును కోరుతారు, సాధువులుసంధినికోరుతారు.

649 నీచాశ్రయో హి మహతా మవమానభూమిః

గొప్పవారు నీచులనాశ్రయించి అవమానమును పొందుతారు.

650 నీచై ర్గచ్ఛ త్యుపరి హి దశా చక్రనేమిక్రమేణ.

బండిచక్రముకమ్మివలె జనులకు నీచదశా ఉచ్చదశా ఒకదానితరువాతఒకటి కలుగుతూఉంటవి.

651 నీచో వదతి నకురుతే, నవదతి కురుతే సజ్జనః

నీచుడు చెప్తాడుగానిచేయడు, సజ్జనుడు చేస్తాడుగానిచెప్పడు.

652 నీరక్షీరన్యాయము.

పాలలో నీటినికలిపితే నీరుకలిసినట్లు తెలియదు. అట్లే సత్యాసత్యములను ఏర్పాటుచేయడముకష్టము.

653 నీలేందీవరన్యాయము

ఇందీవరమంటే నల్లకలువ. అయినా నీలేందీవరమని ప్రయోగిస్తారు (చూ. కరిబృంహితన్యాయము, కరకంకణన్యాయము, గజఘటా

న్యాయము, చంద్రజ్యోత్స్నాన్యాయము, పర్వతాధిత్యకాన్యాయము, పర్వతోపత్యకాన్యాయము, వాజిమందురాన్యాయము, మృగవాగురా న్యాయము.

654 నృప నాపితపుత్రన్యాయము

రాజు మంగలి కథవలె. ఒక రాజుదగ్గర ఒకమంగలిఉండేవాడు. ఒకనాడు రాజు "ఓరీ, ఊరిలోతిరిగిచక్కనిసుందరుడైన ఒకపిల్లవానినితీసి కొనిరారా" అని అన్నాడు. రాజాజ్ఞప్రకారము మంగలి ఊరంతాతిరిగి చూచినాడు కాని ఎవ్వరూతనకొడుకువలె అందముగాలేరనుకొని ఇం టికివచ్చి తనకొడుకునుచూచి వాడు అతివికృతరూపము గలవాడయినా "ఆహా, నాకొడుకెంతచక్కనివాడు!" అనుకొని వానిని తీసుకొని కోటలోనికిపోయి "మహాప్రభో, తమయాజ్ఞప్రకారము అతిచక్కని బాలునితీసుకొనివచ్చినాను" అనిచెప్పినాడు. "ఏడీ తీసుకొనిరా" అని రాజన్నాడు మంగలి తనకొడుకును చూపించినాడు. "వీడునాతోహాస్య ముచేస్తున్నా"డని రాజుకుకోపమువచ్చింది. కాని ఎవరికొడుకులువారికి అందముగా కనిపిస్తారని అనుకొని ఆకోపము నుపసంహరించుకొని మం గలికి బహుమానమిచ్చినాడు.! కాకిపిల్లకాకికిముద్దు అని తెలుగుసామెత.

655 నైవాశ్రితేషు గుణదోషవిచారణా స్యాత్.

ఆశ్రితుల గుణదోషవిచారణ నెవ్వరూచేయరు. (చంద్రుడు దోషాకరుడైనా కుటిలుడయినా కలంకితుడయినామిత్రుడు (సూర్యుడు) అస్తమించిన తరువాత గాని తానుదయించకపోయినా, శివుడు అతనిని తలమీదపెట్టుకొన్నాడు.)

656 నోపకారం వినా ప్రీతిః కథంచిత్ కస్య చిద్భవేత్.

ఉపకారముచేయకపోతే ఎవనికీ ఏవిధముగాను ప్రీతిపుట్టదు.

657 నౌనావికన్యాయము.

నావలేనిదీ నావికునివల్ల ప్రయోజనములేదు. నావికుడులేనిదే

నావవల్లప్రయోజనములేదు. అన్యోన్యాశ్రయభావమును తెలిపేటప్పుడు ఈన్యాయము పనికివస్తుంది.

658 న్యగ్రోధబీజన్యాయము.

మఱ్ఱిచెట్టు విత్తనము చిన్నదయినా, దానిలోనుంచి పెద్దచెట్టువిస్తరిస్తుంది. అట్లే, చేసినఉపకారము చిన్నదయినా,ఎక్కువగాఫలిస్తుంది.

659 పంకప్రక్షాలనన్యాయము.

చూ. ప్రక్షాలనాద్ధి పంకస్య దూరాదస్పర్శనం వరమ్.

660 పక్వానాంహి వధే సూత వజ్రాయంతే తృణాన్యపి.

మరణమునకు పక్వమయినవారిని చంపడమునకు గడ్డిపోచలు కూడా వజ్రాయుధమంతపనిచేస్తవి.

661 పంచకోశావతరణన్యాయము.

జీవాత్మ ఆనందమయకోశమునుండి వరుసగా అన్నమయకోశము వరకూగల అయిదుకోశములను పొంది దేహిఅవుతాడు. అట్లే పెద్దపదవినుండి క్రమముగా భ్రష్టుడయినవాడున్ను.

662 పంచభిర్మిలితైః కిం యజ్జగతీహ నసాధ్యతే.

ఐదుగురుకలిసిపనిచేస్తే, ఈప్రపంచములో సాధ్యముకానిదేముంటుంది?

663 పంజరచాలనన్యాయము.

పంజరములోపక్షులన్నీకలసి, ఏకప్రయత్నముతో ఆపంజరమును ముక్కులతోపొడుస్తే, ఆ పంజరముపగిలిపోయి, పక్షులుబయటికి ఎగిరిపోవును. అట్లే దేహేంద్రియములు పదిన్నీకలసి, ప్రాణరూపమైన ఒకటేక్రియను చేయడమువల్ల దేహచాలనము కలుగుతుంది.

664 పంజరముక్త పక్షిచాలనన్యాయము.

పంజరములోనుంచి పక్షిని విడిచిపెట్టుతే, అదిమీదికిఎగిరిపోతుంది. అట్లే దేహమునువిడిచిన జీవుడు మీదికిపోతాడు. ఇదేమోక్షము, అని దిగంబరజైనులంటారు.

665 పంజరస్థ సింహన్యాయము.

పంజరములో బంధింపబడిన సింహమువలె (స్నేహతంతువులచే చేనబడినపాశములచేతను, సంతానమనే తాళ్లతోను ఆత్మశరీరములో బంధింపబడిఉన్నది,

666. పటాటోపో భయంకరః.

బట్టబడాబుచూస్తే భయంకరముగాఉన్నది.

667 పండితా మూర్ఖజీవినః.

పండితులకు మూర్ఖులవల్ల జీవనముకలుగుతుంది.

668 పతంగదీపకన్యాయము.

దీపముమీదికిపోతే కాలుతుందని తెలిసినా, తనకు ప్రీతిపాత్రమయిన దీపముమీదికి మిడుతపోయి దగ్ధమవుతుంది. అట్లే, మిత్రుడు తనకు ప్రీతిపాత్రమయినవానికోసము ప్రాణములనైనా అర్పిస్తాడు. (లేదా దీపముకాలుతుందని తెలిసినా, మిడుత దానిమీదికి పదేపదే పోయినశించినట్లు దుష్టులసహవాసమువల్ల నష్టమున్నదని తెలిసినా, మూర్ఖుడు వారితోకలసి నష్టపోతాడు.

669 పతంత మనుధావతో గతః.

ఒకవేటకాడు వలలోకొన్ని పక్షులనుపట్టుకొన్నాడు. అందులో ఒకటి మెల్లగాతప్పించుకొని ఎగిరిపోయినది. వాడుదానివెంటపడినాడు. అప్పుడువలలోఉన్న ఇతరపక్షులుకూడా తప్పించుకొని ఎగిరిపోయినవి. అట్లే, చేతిలోఉన్నదానినివిడిచిపెట్టి, పోయినదానివెంట పరుగులెత్తేవాని గతికూడాను.

670 పతనాంతా స్సముచ్ఛ్రయాః.

ఎగిరేదంతా క్రిందకిపడడముకోసమే.

671 పతితః పర్వతో లఘుః.

పర్వతముపడిపోతే అదితేలికఅయినదనుకొంటాము.

672 పతింవరా న్యాయము.

స్వయంవరము చేసికొనేకన్యక, అల్లులనందరినీ విడిచిపెట్టి, అందరికంటె గుణవంతుడైనవానిని వరించేటట్లు, బుద్ధిమంతుడు క్షుద్ర ఫలములకాశపడక, అత్యుత్తమమయినవానినే కోరుచుండును.

673 పత్తనే విద్యమానేఽపి గ్రామే రత్నపరీక్షా.

పట్టణముంటూఉండగా, పరీక్షకోసము రత్నమును గ్రామములోనికి తీసుకపోయినట్లు.

674 పథః శుచేర్దర్శయితార ఈశ్వరాః.

మలీమసామాదద తే న పద్ధతిమ్.

ఒకరికి శుచిఅయినమార్గము చూపించేవారు, తాము మలిన మార్గమునే అవలంబిస్తారు.

675 పదమభ్యధికాభావా త్స్మారకాన్న విశిష్యతే.

ఒకశబ్దమువల్ల వ్యుత్పత్త్యర్థముకంటె విశేషమయిన అర్థము స్మారకమవుతూఉన్నప్పుడు, వ్యుత్పత్త్యర్థమునకు బలముండదు.

676 పదం సహేత భ్రమరస్య పేలవం, శిరీషపుష్పం న పునః పతత్త్రిణః.

మృదువయిన శిరీషపుష్పము తనమీద తుమ్మెదవాలితే ఓర్చ గలదుగాని, పక్షివాలితే సహించగలదా?

677 పదాతిన్యాయము.

చదరంగముఆటలో బంటుతిన్నగానడుస్తూ, చంపేటప్పుడు వక్ర గతినిపొందుతుంది. అట్లే, దుర్జనుడు తిన్నగానడుస్తూఉన్నట్టు కని పించినా, చప్పున వక్రగతినిపొంది ఇతరులకు హానిచేస్తాడు.

678 పదార్థః పదార్థేనాన్వేతి న పదార్థైకదేశేన.

ఒకశబ్దముయొక్క అర్థము తనతోసంగతమైన ఇతరఅర్థముతో అన్వయిస్తుంది, కాని, అసంగతార్థముతో అన్వయించదు. గంగలో

గొల్లపల్లెఉన్నది. అంటే, గంగఒడ్డునఉన్నదని అర్థముకాని, నీటిలో ఉన్నదని అర్థముకాదు.

679 పద్మపత్రస్థిత తోయన్యాయము.

తామరాకుమీది నీటివలె. జ్ఞాని ప్రపంచమున జీవించిఉన్నా, విషయసుఖములను అంటడు.

680 పనసోదుంబరాదివత్.

(రజోదర్శనములేనిదే ఒక్కొక్కప్పుడు) పనసచెట్టు, బొడ్డచెట్టు, వీటికిపువ్వులేకుండానే పిందెలుపుట్టినట్లు (గర్భముకలుగవచ్చును)

681 పయసా సించితో నిత్యం న నింబో మధురాయతే.

వేపచెట్టుకు నిత్యమూ పాలుపోసిపెంచినా, అదితీయనకాదు.

682 పరప్రతారణే పాండిత్యమ్.

ఇతరులను మోసగించే పాండిత్యము అందరికీఉన్నది.

683 పరస్పరవిరోధే హి నప్రకారాంతరస్థితిః.

నైకతాపివిరుద్ధానాముక్తిమాత్రవిరోధతా.

పరస్పరవిరుద్ధములైనవస్తువులు తమకంటె వేరుగాఉండవు, విరుద్ధవస్తువులకు ఏకత్వములేకపోయినా, మాటలోనైనా వైరుధ్యముంటుంది.

684 పరాన్నం ప్రాణసంకటమ్.

ఇతరుల అన్నముకోసము ఆశపడడము ప్రాణసంకటము.

685 పరాహ్ణచ్ఛాయాన్యాయము.

మధ్యాహ్నముతరువాత నీడకొంచెముగానుండి, అంతకంతకూ పొడుగవుతుంది. అట్లే, సజ్జనులమైత్రికూడాను. చూ. కుక్కుటధ్వాన న్యాయము.

686 పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్.

ఇతరులకు ఉపకారముచేయడమువల్ల పుణ్యమున్ను, బాధపెట్టడమువల్ల పాపమున్ను కలుగుతవి.

687 పరోపకారాయ సతాం విభూతిః.

మంచివారి ఐశ్వర్యము ఇతరులకు ఉపకారముచేయడమునకే వినియోగపడుతుంది.

688 పరోపకారార్థ మిదంశరీరమ్.

ఈశరీరమును ఇతరులకు ఉపకారముచేయడముకోసము వినియోగించవలెను.

689 పర్జన్యన్యాయము.

వర్షము భూమిమీదాకురుస్తుంది, సముద్రముమీదాకురుస్తుంది. దానివల్ల కొన్నిపంటలకులాభమున్ను, కొన్నిపంటలకు నష్టమున్ను కలుగుతుంది. అయినా, అదికురవడము దానిస్వభావముచేతనే కలుగుతుందిగాని, దానివల్లకలిగే లాభనష్టములకోసముకాదు. అట్లే, ఈశ్వరుడు పుణ్యవంతులమీద ప్రేమయున్ను, పాపులమీద ద్వేషమున్ను చూపడమునకై జగత్తును సృజించలేదు.

690 పర్వతాధిత్యకాన్యాయము.

అధిత్యకాఅంటేనే పర్వతముయొక్క మీదిభాగము అనిఅర్థము. అయినా పర్వతాధిత్యకాఅని పర్వతశబ్దముతోకలిపి ప్రయోగిస్తాము. చూ. కరిబృంహితన్యాయము, కరకంకణన్యాయము, గజఘటాన్యాయము, చంద్రజ్యోత్స్నాన్యాయము, నీలేందీవరన్యాయము, పర్వతోపత్యకాన్యాయము, వాజిమందురాన్యాయము, మృగవాగురా న్యాయము.)

691 పర్వతోపత్యకాన్యాయము.

ఉపత్యకాఅంటేనే కొండయొక్క అడుగుభాగము అనిఅర్థమయినా, పర్వతోపత్యకాఅని పర్వతశబ్దముతోకలిపి ప్రయోగిస్తాము. (చూ. కరిబృంహితన్యాయము, కరకంకణన్యాయము, గజఘటాన్యాయము, చంద్రజ్యోత్స్నాన్యాయము, నీలేందీవరన్యాయము, పర్వతా

ధిత్యకాన్యాయము, వాజిమందురాన్యాయము, మృగవాగురాన్యాయము.)

692 పవనతాడనన్యాయము.

గాలినికొట్టినట్లు. చూ. ఆకాశముష్టిహనన్యాయము; గగనరోమంథన్యాయము.

693 పశుసోమాధికరణన్యాయము.

సోమయాగములో పశువునువిధించినట్లు. ఇదిమీమాంసాశాస్త్రములో వచ్చేన్యాయము.

694 పాటచ్చరలుంఠితే వేశ్మని యామికజాగరణమ్.

ఇంటిలో దొంగలు దోచుకొనిపోయినతరువాత పోలీసువారు మేలుకొన్నట్లు.

695 పాఠక్రమా దర్థక్రమో బలీయాన్,

వాక్యములోని పదములక్రమముకంటె, అర్థక్రమము బలవంతమయినది. అర్థమునకే ముఖ్యత్వముకాని, కేవలశబ్దములకుకాదు.

696 పాత్రాపాత్రవిచారస్తు ధేనుపన్నగయో రివ.

ఆవు గడ్డినితిని పాలనుఇస్తుంది. పాము పాలుత్రాగి విషము క్రక్కుతుంది. అందుచేత పాత్రాపాత్ర విచారముచేయకదానముచేస్తే ఒకప్పుడు విషమిస్తుంది.

697 పాపాత్మనాం పాపశతేన కిం వా.

పాపాత్ములు నూరుపాపములు చేయడమునకైనా భయపడరు.

698 పాపీ పాపేన హన్యతే.

పాపముచేసేవాడు పాపమువల్ల నేచస్తాడు.

699 పారిషదన్యాయము.

ఒకసభలో పనిచేసేవాడొక్కడేఅయినా ఆసభలోఉండేవారందరూ ఆపనినిచేసినట్లుతలంచుతారు.

700 పాషాణేష్టకాన్యాయము

ఇటుక బెడ్డ, రాయి, ఈ రెండూ కఠినములైనవే అయినా, రాతి కంటె ఇటికమృదువైనదే. చూ. అశ్మలోష్టన్యాయము.

701 పిండం త్యక్త్వా కరం లేఢి.

లడ్డువనుపారవైచి చేతినినాకినట్లు (బ్రహ్మానందమును విడిచిపెట్టి విషయానందమునుచేపట్టడము.)

702 పిణ్యాకయాచనార్థం గతస్య ఖారికాం తైలదాతృత్వాభ్యుపగమః

తెలికపిండి యాచించడమునకు పోయినవానికి పుట్టెడునూనె ఇచ్చేవాడు దొరకినట్లు.

703 పితాపుత్రన్యాయము.

మనుష్యుడు ఒక్కడే తనకొడుకుకు తండ్రిన్నీ, తనతండ్రికి కొడుకున్నూ అవుతాడు. అట్లే ఒకవస్తువు ఇతరవస్తువులతో అనేక సంబంధములను కలిగిఉంటుంది.

704 పిత్తం యది శర్కరయా శామ్యతి కోఽర్థః పటోలేన.

కండచక్కెరతో పైత్యరోగము పోతూఉంటే చేదుమందు లెందుకు?

705 పిపీలికాన్యాయము.

చీమనడకవలె. (చెట్టుమీదఉన్న పండును రుచిచూడగోరిన చీమ చప్పున దానిమీదికి ఎగురలేకపోయినా ఎంతో ఓర్పుతో కష్టపడి మెల్లగా ఆపండును చేరుకొంటుంది. అట్లే అజ్ఞాని అయినపురుషుడు శ్రుతిస్మృతిపురాణాదులలో చెప్పబడ్డ కర్మోపాసన మార్గమునవలంబించి శుద్ధాంతఃకరణుడై జన్మాంతరమందయినా సంపూర్ణజ్ఞానమును పొంది బ్రహ్మానందమనుభవిస్తాడు.

706 పిపీలికాభిర్మంథానగిరి విలేపనన్యాయము.

చీమలతో మంథానపర్వతము చుట్టూ పూతపూసినట్లు చేయడ

ము. అశ్రద్ధేయమైన మాటలను చెప్పేటప్పుడు ఈన్యాయము పనికివ స్తుంది. చూ. అంగుల్యగ్రే కరిణాం శతమ్.

707 పిశాచానాం పిశాచభాషయైవోత్తరం దేయమ్,

పిశాచములకు పిశాచభాషతోనే ప్రత్యుత్తరము చెప్పవలెను.

708 పిష్టపేషణన్యాయము.

నూరినదానిని నూరినట్లు (నిష్ప్రయోజనమన్నమాట.) చూ. ఊషరవృష్టి న్యాయము, మొ.

709 పీలుపత్రఫలన్యాయము.

గోలుగుచెట్టుయొక్క ఆకులు కటువుగా ఉంటవి, పండ్లుతీయగా ఉంటవి. అట్లే, మంచివాని ఆకారము అసహ్యముగా ఉన్నా మనస్సు మంచిదయి ఉంటుంది,

710 పుత్త్రలిప్సయా దేవం భజంత్యా భర్తా ఽపినష్టః,

కొడుకుపుట్టవలెనని దేవుని పూజచేస్తే మగడుకూడా చచ్చిపోయినాడట, ఒక ఫలముకోరి పనిచేసేవానికి ప్రతికూలఫలము కలిగినప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది,

711 పుత్రేణ కిం ఫలం యోవై పితృ దుఃఖాయ వర్తతే.

తండ్రిని దుఃఖపెట్టే కొడుకువల్ల ఏమిప్రయోజనమున్నది?

712 పుమాన్ దుష్కీర్తిసంయుక్తో జీవన్నపి మృతోపమః

అపకీర్తిపొందినవాడు జీవించిఉన్నా చచ్చినవారిలో నేలెక్క.

713 పురంధ్రీణాం చిత్తం కుసుమ సుకుమారం భవతి.

ముత్తైదువుల మనస్సు పువ్వువలె కోమలముగా ఉంటుంది.

714 పురాణ వైరాగ్య న్యాయము.

పురాణము వింటూఉన్నంతసేపూ వైరాగ్యము కుదురుతుంది. అక్కడనుంచి లేచిపోగానే యథాప్రకారముగా సంసారములో పడుతారు. చూ. శ్మశానవైరాగ్యము, ప్రసూతివైరాగ్యము.

715 పురుష కేశలోమ న్యాయము

దేహమునుండి వెంట్రుకలుపుట్టునట్లు (అక్షరపరబ్రహ్మమునుండి విశ్వము పుట్టుతున్నది.)

716 పుంవిషయ న్యాయము

పురుషుడు విషయములనుండి ఎట్లుభిన్నుడై ఉన్నాడో జీవుడు కూడా ఈశ్వరునినుండి భిన్నుడై ఉన్నాడు. చూ. శకుని సూత్రన్యాయము, నదీ సముద్రన్యాయము, శుద్ధోదలవణన్యాయము, చోరాపహార్య న్యాయము, నానావృక్షరస న్యాయము,

717 పుష్కర పలాశ న్యాయము.

తామరాకు నీటిచేత తడియని యట్లు (జ్ఞానికర్మలనంటి యుండడు.)

718 పుష్టలగుడ న్యాయము

కుక్కలు అరుస్తూఉంటే వాటిని తోలడమునకు కట్టపట్టుకొని బయలుదేరినవాడు, మొదటఒకకుక్కనుకొట్టి, తరువాత తక్కినవాటిని కూడా వెంటబెట్టుతాడు. అట్లే ఒకదుష్టమతమును అణగద్రొక్కడమున కుపయోగించేయుక్తులు, ఇతరదుష్టమతములను నిరసించడమునకు కూడా ఉపయోగిస్తవి.

719 పుష్పవంతోపకార న్యాయము.

పుష్పవంతులంటే సూర్యచంద్రులు. వీరుతక్కిన గ్రహములను తమతమ రాసులలో నిలిపి ఉపకారముచేస్తారు. అట్లే ఉదారాశయు లయినవారు అనేకులకు అనేకవిధములుగా ఉపకారముచేసి వారందరి కంటె శ్రేష్ఠులై ఉంటారు.

720 పూతి కూష్మాండ న్యాయము.

పీతిలో పుట్టిన గుమ్మడికాయవలె అనుభవింపయోగ్యముకానిది.

721 పూర్వా బాధేన నోత్పత్తి రుత్తరస్య హి సేత్స్యతి.

పూర్వమందుచేసిన విధికి బాధకలుగకపోతే, తరువాత చెప్పబడి

న విధి పుట్టకపోదు. ఉపవాసములు మొదలయినవాటిని చేయడమువల్ల ఆత్మశుద్ధి కలుగుతుంది, అనిచెప్పితే భోజనమును సకాలములో చేయడమువల్ల ఆత్మశుద్ధి కలుగుతుంది అనేవాక్యమునకు బాధకలుగదు.

722 పూర్వాహ్ణచ్ఛాయా న్యాయము.

ఉదయమున నీడపెద్దగాఉండి అంతకంతకూ చిన్నదవుతుంది. అల్లే దుష్టులతో స్నేహముకూడాను. చూ. గర్దభరుతన్యాయము.

723 పృథివ్యోషధి న్యాయము.

భూమిలోనుండి ఓషధులు పుట్టినట్లు.

724 పృష్టాకోటి న్యాయము.

అడిగినదానికి ప్రయోజనమున్నంతమట్టుకే ఉత్తరము చెప్పడము. ఒకధర్మ సందేహమును గురించి అడిగినప్పుడు దానిని గురించి సర్వమున్నూ తెలియకపోయినా ఎంతవరకు ఉపయోగమో అంతవరకైనా చెప్పుతేచాలును.

725 పృష్ఠతాడ నాద్దంతభంగః

తుంటిమీద కొట్టితే నోటిపళ్ళు రాలినట్లు (సందర్భములేని మాట.)

726 ప్రికరణాద్వాక్యం బలీయః.

సందర్భమునుబట్టి అర్థమునుచెప్పడముకంటె, వాక్యముయొక్క శబ్దములనుబట్టియే అర్థముచెప్పడముయుక్తము.

727 ప్రికృతిప్రిత్యయార్థయోః ప్రిత్యయార్థస్య ప్రాధాన్యమ్.

కేవలధాతు, ప్రాతిపదికరూపములకు అర్థముండదు. దానికి ప్రత్యయమునుచేర్చగానే ఆరూపమునకు అర్థశక్తికలుగుతుంది. అల్లే, రాజు, ప్రిజ, అనేవారిలో ప్రిజలకు ప్రాధాన్యముండవలెను. ప్రజలేని రాజు ఏమిచేయగలడు?

728 ప్రకృతివ దనుకరణంభవతి.

అనుకరణము దేనిననుసరిస్తుందో దానివలెనేఉంటుంది. ప్రపంచము పరమాత్మవలెనేఉన్నది.

729 ప్రకృతివ ద్వికృతిః క ర్తవ్యా.

వికృతిఅనేది ప్రకృతినుంచి పుట్టినదేకాబట్టి, ప్రకృతినెట్లునిర్మిస్తామో, వికృతినికూడా అట్లేనిర్మిస్తాము.

730 ప్రక్షాలనాద్ధి పంకస్య దూరాదస్పర్శనం వరమ్.

బురద అంటినతర్వాత దానిని కడుగుకొనుటకంటె, అసలు బురదను అంటకుండాఉండడమే మంచిది. దుష్టులతోస్నేహముచేసి, దుఃఖముపొంది, దానినితొలగించుకొన ప్రయత్నముచేయడముకంటె, అసలుదుష్టులదరికి పోవకుండడమేమంచిది.

731 ప్రణమం త్యనపాయముత్థితం ప్రతిపచ్చంద్రమివ ప్రజా నృపమ్.

తమకు అపాయముకలిగించకుండాఅభివృద్ధిపొందే రాజునుచూచి, ప్రజలు పున్నమచంద్రునిచూచినట్లు సంతోషించి, నమస్కరిస్తారు.

732 ప్రతిప్రధానం గుణ ఆవర్తనీయః.

ప్రధానార్థముచెప్పేచోట్లనెల్ల, వస్తువుయొక్క ముఖ్యగుణమును తిరిగీతిరిగీ చెప్పుకోవలెను. ఇది మీమాంసాశాస్త్రములో వచ్చే న్యాయము.

733 ప్రతిభాతశ్చ పశ్యంతి సర్వం ప్రజ్ఞావతాం ధియః.

ప్రజ్ఞావంతులబుద్ధులు ప్రతిభచేత సమస్తమునున్ను కనుగొంటవి.

734 ప్రత్యక్షే కి మనుమానమ్.

ప్రత్యక్షముగాఉన్నదానిని చూపించడమునకు యుక్తులవసరము లేదు. (చూ. నహికరకంకణ...; న హిదృష్టేఽనుపపన్నమ్; మొద).

735 ప్రత్యవయవం చ వాక్యపరిసమాప్తిః.

వాక్యములోఉన్న సంపూర్ణక్రియ ఆవాక్యములోని ప్రతిఅవయ

వముతోను అన్వయముకలిగిఉంటుంరి. దేవదత్త, యజ్ఞదత్త, విష్ణుమిత్రులకు భోజనముపెట్టవలెను అన్నప్పుడు, దేవదత్తునికి భోజనముపెట్టవలెను, యజ్ఞదత్తునికి భోజనముపెట్టవలెను, విష్ణుమిత్రునికి భోజనము పెట్టవలెను, అని ప్రత్యేకప్రత్యేకముగా చెప్పనక్కరలేదు.

736 ప్రత్యాసత్తిన్యాయము.

చేరికగాఉండడము (వల్లకార్యసిద్ధి శీఘ్రముగా అవుతుంది).

737 ప్రథమగ్రాసే మక్షికాపాతః.

మొదటికబళములోనే ఈగలుపడినట్లు, పనిఆరంభించగానే విఘ్నముకలుగడము.

738 ప్రదీపన్యాయము.

వత్తి, నూనె, ఈరెండును విరుద్ధపదార్థములు. ఈరెండును అగ్నికి విరుద్ధములుఅయినా, ఈమూడున్ను చేరి దీపముగా పరిణమించి వెలుతురునిస్తున్నవి. పరస్పరవిరోధులయినా, అందరూకలసి ఒకమంచి కార్యమును చేయవచ్చును. మనదేశములో మితవాదులు, అతివాదులు, ప్రభుత్వవాదులు, ఈరీతిగా అనేకకక్షులవారు ఒకరితోఒకరు విరుద్ధులుగాఉన్నా, దేశస్వాతంత్ర్యవిషయమై అందరూకలిసిపనిచేస్తే, స్వాతంత్ర్యమువస్తుంది.

739 ప్రదీపే ప్రదీపం ప్రజ్వాల్య తమోనాశాయ యతమానః

దివిటీకిదివిటీవెలిగించి చీకటిని పోగొట్టడమునకు ప్రయత్నించేవానివలె చిన్నప్రయత్నముతో సాధ్యమయేదానికి, పెద్దప్రయత్నము చేయడము.

740 ప్రధాన మల్లనిబర్హణన్యాయము.

కుస్తీపట్టడమునకు ఒకనిమీదికి అనేకులువచ్చినప్పుడు, వారిలో మిక్కిలి బలవంతుడయినవానిని చిత్తుచేస్తే, తక్కినవారినికూడా చిత్తుచేసినట్లే.

741 ప్రధానాప్రధానయోః ప్రధానే కార్యసంప్రత్యయః.

ముఖ్యమైనవస్తువు, ముఖ్యముకానివస్తువు, అనేవాటిలోముఖ్యమైనవస్తువునేయోచింపవలెను. సైన్యముతో అనేకరథములు పోతూ ఉన్నప్పుడు "ఎవరయ్యా ఆవెళ్లేవారు?" అనిప్రశ్నిస్తే, రాజుగారు వెళ్లుతున్నారు అని లోకములో అంటారుగాని, అప్రధానులయిన సైనికులు వెళ్లుతున్నారని అనరు.

742 ప్రధానే గృహీతే ఽప్రధాన గ్రహస్యాన్యాయ్యత్వాత్.

ప్రధానమైనదానిని గ్రహించిన తరువాత, అప్రధానమైన దానిలోనిభాగములను గ్రహింపనక్కరలేదు. సముద్రశబ్దమును గ్రహించినతరువాత దానిలోని అలలు, బుడగలు, నురుగు, మొదలయిన వానిని గ్రహింపనక్కరలేదు.

743 ప్రపామేలన్యాయము.

చలిపందిలివద్దకు ఎక్కడెక్కడివారో వచ్చి నీళ్లుత్రాగి ఎవరిదారి నివారు పోతారు. (అట్లే, సంసారములో జీవులు కొంతకాలముకలిసి ఉండి తిరిగీఎడబాసిపోతారు.)

744 ప్రభూణాం హి విభూత్యంధా ధావ త్యవిషయే మతిః.

గొప్పవారు ధనాంధులై కానిపనులను చేస్తూఉంటారు.

745 ప్రమదా న్యాయము.

ఒకభార్యవల్ల భర్తకుసుఖముకలుతుంది, ఆమెమూలముగా మరియొకభార్యవల్ల దుఃఖముకలుగుతుంది. ఈసుఖదుఃఖములు ఒకస్త్రీ వల్లనే కలుగుతవి.

746 ప్రయోజనమనుద్దిశ్య న మందో ఽపి ప్రవర్తతే,

ఎంతతెలివితక్కువవాడయినా లాభములేని పనినిచేయడు.

747 ప్రసక్తానుప్రసక్త న్యాయము.

ఒకటితలపెట్టితే, ఇంకొక ఫలముకూడాకలిగినట్లు.

748 ప్రసిద్ధానువాదేఽనాప్రసిద్ధం నిరూపణీయమ్.

ఒకరివాదము అప్రసిద్ధముఅని నిరూపించడమునకు ప్రసిద్ధమయిన వాదమునుచేయవలెను. తానుకూడా అప్రసిద్ధవాదముచేస్తే అప్రసిద్ధవాదము నిరస్తముకాదు.

749 ప్రసూతివైరాగ్య న్యాయము.

బిడ్డనుకన్నప్పుడు నొప్పులకు సహించలేక, "అమ్మో, మరి మగనిప్రక్కలో పడుకోకూడదు" అనివైరాగ్యము కలుగుతుంది. పిల్లపుట్టగానే ఆవైరాగ్యమంతా వెళ్ళిపోతుంది. చూ. శ్మశానవైరాగ్యము. పురాణవైరాగ్యము.

750 ప్రాకాశ్యం స్వగుణోదయేన గుణినో గచ్ఛంతి కిం జన్మనా.

గుణవంతులు తమ సద్గుణములచేతనే కీర్తినిసంపాదిస్తారు. వారికి జన్మముతో ఏమిపని?

751 ప్రాగల్భ్యహీనస్య నరస్య విద్యా శస్త్రం యథా కాపురుషస్య హస్తే.

బుద్ధిలేనివానివిద్య మూర్ఖునిచేతి కత్తివంటిది.

752 ప్రాయేణ భార్యాదౌశ్శీల్యం స్నేహాంధో నేక్షతే జనః

భార్యమీద మోహముగలవాడు సాధారణముగా ఆమె దుశ్చరితమును కనుగొనలేడు.

753 ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః.

బ్రహ్మ సాధారణముగా తానుచేసే వస్తువుల గుణాగుణములను గురించి ఆలోచించడు. మంచివస్తువులను చెడ్డవస్తువులనుకూడా సృజిస్తాడు.

754 ప్రాసాదవాసి న్యాయము.

వారుమేడలోఉన్నారు, అంటే, ఎప్పుడూవారు మేడమీదిఅంతస్థుమీదనే ఉండరు, క్రిందిభాగములోకూడాఉంటారు.

755 ప్రియబంధువినాశోత్థః శోకాగ్నిః కం న తాపయేత్.

ప్రియబంధువులనాశనమువల్ల కలిగినశోకాగ్ని ఎవరికి బాధాకరముకాదు.

756 ప్రియానాశే కృత్స్నం కిల జగదరణ్యం హి భవతి.

భార్యచనిపోయినవానికి జగత్తంతా అరణ్యమువలె ఉంటుంది.

757 ప్లవంగమగతి న్యాయము.

కోతిగంతులవలె. చెట్టుమీదిపండ్లను తినడానికి కోతి కొమ్మమీదినుంచి కొమ్మమీదికి ఎగిరి పండ్లను తింటుంది. అట్లే, పూర్వజన్మమందు సుకృతము చేసుకొన్నవాడు, ఈజన్మములో సులభముగా జ్ఞానమునుపొంది బ్రహ్మానందము ననుభవిస్తాడు.

758 ఫలముఖగౌరవం న దోషావహమ్.

గౌరవమువల్లకలిగేఫలమువల్ల దోషములేదు. గౌరవముగలవాడు ప్రయత్నము చేయకపోయినా ఒకప్పుడు ఫలమును పొందుతాడు. అదితప్పుకాదు. అదివానియోగ్యతవల్ల కలుగుతుంది.

759 ఫలవత్సహకారన్యాయము.

పండ్లకోసము మామిడిచెట్టును నాటితే అది ఫలములనేకాకుండా మంచినీడను, మంచిసుగంధమునుకూడా అయాచితముగాఇస్తుంది. అట్లే ఇష్టదేవతను ఏదోఒకఫలముకోసము ప్రార్థిస్తే, దానితోఇతరఫలములుకూడా లభిస్తవి.

760 బకః పరమధార్మికః.

కొంగగొప్పధర్మవేత్త.(కపటి ధర్మము తెలిసినవానివలెనటిస్తాడు.)

761 బకబంధనన్యాయము.

కొంగను పంజరములోఉంచుతే (చిలుకవలెమాట్లాడదు.)

762 బకవృత్తి న్యాయము.

కొంగఏమీ ఎరుగనిదానివలె పరధ్యానముగా ఉన్నట్టునటిస్తూ

నీటిబడ్డునకూర్చుంటుంది. ఒక్కచేప పైకిరాగానే చప్పునదానిని ముక్కుతోపట్టుకొంటుంది. చూ. అజగరవృత్తి న్యాయము.

763 బంధనభ్రష్టో గృహకపోతః చిల్లాయా ముఖే పపాత.

పంజరములోనుంచి పారిపోయినపావురము డేగనోటిలోపడినది. ఒకకష్టముతప్పించుకొంటే, అంతకంటే గొప్పకష్టము సంభవించినట్లు.

764 బధిరకర్ణజపన్యాయము.

చెవిటివానిచెవిలోగుసగుసలాడినట్లు(నిష్ప్రయోజనమన్నమాట.) చూ. ఊషరవృష్టిన్యాయము, మొద.

765 బధిరాన్మందకర్ణః శ్రేయాన్.

చెవిటివానికంటె, సొట్టచెవివాడు శ్రేష్ఠుడు.

766 బలవంతం చికిత్సయేత్.

రోగికి బలమువచ్చినట్లుచేసి, చికిత్సచేయవలెను.

767 బలీయసీ కేవలమీశ్వరేచ్ఛా.

ఈశ్వరేచ్ఛయే అన్నిటికంటె బలమైనది.

768 బహుచ్ఛిద్రఘటప్రదీపన్యాయము.

అనేకరంధ్రములుగల కుండలో దీపముపెట్టుతే, దానివెలుతురు ఆకన్నములద్వారా పైకివస్తుంది. అట్లే, దేహములోనున్న ఆత్మయొక్క తేజస్సు, చక్షురాదీంద్రియములద్వారా పైకిప్రసరిస్తుంది.

769 బహుభ్యః శ్రోతవ్యబహుధాన్యాయము.

అనేకులు అనేకరకములుగా ఉపదేశిస్తారు గనుక ఉత్తమమైన గురువునొక్కనినేచేపట్టి, నిశ్చయజ్ఞానమును పొందవలెను.

770 బహురాజకపురన్యాయము.

ఒక్కపట్టణమునకు అనేకమంది రాజులయితే, వారిలోవారికిఐకమత్యముకుదురక, ఎవరిమట్టుకువారు ప్రజలను బాధపెట్టుతారు. ఆపట్టణవ్యవహారమొక్కటిన్నీ సాగదు. అట్లే, దేహములోని చక్షురాదిఇం

ద్రియములు దేనిమట్టుకదే స్వతంత్రించి వ్యవహరిస్తే ఒక్క ఇంద్రియమున్నూ తనవ్యవహారమును చక్కగా చేసుకోలేదు.

771 బహువృకాకృష్ట మృగన్యాయము.

తోడేళ్ళమధ్యపడిన లేడివలె. లేడి తోడేళ్ళమధ్యనుపడితే అవి దేనిమట్టుకది తమకుదొరికిన అవయవములను కొరికి తినివేస్తవి.

772 బహుసపత్నీక న్యాయము.

అనేకమంది భార్యలుకలిగినవారు అందరినీ ఏకకాలమందు సంతోషపెట్టలేక దుఃఖపడుతారు. అట్లే, అన్ని ఇంద్రియములకున్ను ఏకకాలమందు విషయానందము కలుగకపోవడముచేత, మనుష్యుడుదుఃఖపడుతాడు.

773 బహూనా మనుగ్రహో న్యాయ్యః.

అనేకులు అల్పులయినా ఒకచోట కలిసికట్టుగాఉంటే బలవంతులవుతారు. చిన్నగడ్డిపోచలుకలసి త్రాడుగాఏర్పడి, పెద్దఏనుగునుకూడా కట్టివేస్తవిగదా.

774 బహూనా మనుమరణం న్యాయ్యమ్.

నలుగురితోకలిసి చచ్చిపోవడముమంచిది. (నలుగురితో నారాయణ అని తెనుగుసామెత.)

775 బహూనా మనురోధో న్యాయ్యః

అందరినీ సంతోషపెట్టడమునకు సాధ్యముకాదు.

776 బహూనామ ప్యసారాణాం సమవాయో హి దుర్జయః.

బలహీనులయినా అనేకులు పనిచేస్తే, వారినిజయించేవారుండరు.

777 బాణోక్షిప్తిన్యాయము.

ఒకఒంటెను ఒకకొండచిలువచుట్టుకొని మ్రింగివేయడమునకుప్రయత్నించినది. అప్పుడుఒంటెయజమాని కొండచిలువను బాణముతో చంపి ఒంటెను రక్షించినాడు. అట్లే, ఈపనిచేయకూడదు,ఇదిధర్మవిరుద

ము, అని చెప్పే నిషేధవాక్యములు మనుష్యుని బాధింపక, అతనికి శ్రేయస్కరములే అవుతవి.

778 బాలఇవ యో నపశ్యతి తత్త్వం కిం తేన పండితేనాఽపి.

బాలునివలె సత్యమును తెలుసుకోలేనివాని పాండిత్యమెందుకు?

779 బాలాగ్రశతభాగోఽపి న కల్ప్యో నిష్ప్రమాణకః,

పరిమాణవంత్యదృష్టాని కల్ప్యానిసుబహూన్యపి.

పరిమాణములేనిమాటను లేశమైనను ఆడకూడదు, కనబడనివానిని నిర్ధారించుటకోసము పరిమాణవాక్యముల నెన్నిటినైనను కల్పింపవచ్చును.

780 బాలాదపి సుభాషితం గ్రాహ్యమ్.

పిల్లవాడయినా మంచిమాటచెప్పుతే వినవలెను.

781 బిందుః సింధుః సింధురప్యేకబిందుః.

సాధువు బిందువంత ఉపకారమునైనా సింధువువలె ఎంచుకొంటాడు; దుర్జనుడు సముద్రమంత ఉపకారమునుకూడా ఒకబిందువువలె చూస్తాడు.

782 బిలవర్తిగోధాన్యాయము.

కన్నములోదూరినబల్లిని (పామును) చంపడమునకు వీలులేనట్లు (ప్రతిపక్షి చేసిన సిద్ధాంతము మరుగుపడిఉన్నప్పుడు దానిని దూషించడమునకు వీలు లేదు.)

783 బిల్వఖల్వాటన్యాయము.

మట్టమధ్యాహ్నమప్పుడు బట్టతలవాడొకడు వీధిలోపోతూ, సూర్యకిరణములచేత తలచురుక్కుమనగా దగ్గరనున్న మారేడుచెట్టుక్రిందికి చేరినాడు. అక్కడ మీదినుండి ఒకమారేడుపండు తలమీదపడి తలచితికినది. (దరిద్రుడు తలంటుకోవలెనంటే వడగళ్ళవానపడినట్లు అని తెనుగుసామెత.)

784 బిల్వవిభజన న్యాయము.

మారేడుపండును పగులగొట్టడము. తెలియనివిషయములో ప్రవర్తించడము శక్యముకాదని తెలుపడమునకు ఈన్యాయమును ఉపయోగిస్తారు.

785 బీజవృక్షన్యాయము,

"విత్తుముందా, చెట్టుముందా" అనే తెనుగుసామెతకు ఇదిసరియైన సంస్కృతము. (చూ, బీజాంకురన్యాయము, అండకుక్కుటీన్యాయము.)

786 బీజాంకురన్యాయము.

విత్తుముందా, మొలకముందా అనే తెలుగుసామెతకు ఇదిసరియైనసంస్కృతము (చూ. బీజవృక్షన్యాయము. అండకుక్కుటీన్యాయము.)

787 బుభుక్షితం న ప్రతిభాతి కించిత్.

ఆకలివేసినట్లులేదు. ఇది "బుభుక్షితః కిం ద్వికరేణభుంక్తే" అనే ప్రశ్నకు ప్రత్యుత్తరము.

788 బుభుక్షితః కిం ద్వికరేణ భుంక్తే.

ఆకలివేసినవాడు రెండుచేతులతోనూ తింటాడా?

789 బుభుక్షితః కిం న కరోతి పాపమ్.

ఆకలివేసినవాడు ఎట్టిపాపమైనా చేస్తాడుగదా.

790 బ్రాహ్మణగ్రామన్యాయము.

ఒకగ్రామములో ఇతరవర్ణములవారుకూడా ఉన్నా, మొదట బ్రాహ్మణులు ఎక్కువమందిగా ఉండిఉంటే ఆగ్రామమునకు బ్రాహ్మణగ్రామమని పేరుపడుతుంది. (చూ. మల్లగ్రామన్యాయము, ఆమ్రవణన్యాయము.)

791 బ్రాహ్మణపరివ్రాజకన్యాయము.

బ్రాహ్మణులకు భోజనముపెట్టవలెను, అన్నప్పుడు పరివ్రాజకులు

కూడా బ్రాహ్మణులేగనుక వారికికూడా భోజనముపెట్టవలెనని అర్థము కాదు. (చూ. కుంభీధాన్యన్యాయము.)

792 బ్రాహ్మణ వసిష్టన్యాయము.

"బ్రాహ్మణులువచ్చినారు, వసిష్టుడుకూడావచ్చినాడు" అన్నప్పుడు,వసిష్టుడుకూడా బ్రాహ్మణుడే అయినా వసిష్టునిమీాదఉండే గౌరవముచేత అట్లుఅతనిని ప్రత్యేకించిచెప్పినామని అనుకోవలెను.

793 బ్రాహ్మణశ్రమణన్యాయము.

బ్రాహ్మణుడు తనధర్మములను విడిచిపెట్టి బౌద్ధశ్రమణునివలె సంచరించినా అతనిని బ్రాహ్మణుడేఅంటారు. అట్లే, శివసారూప్యమును పొందినవారినికూడా పూర్వమువారికుండిన మానవసంజ్ఞతోనే వ్యవహరిస్తారు.

794 బ్రువతే హి ఫలేన సాధవో న కంఠేన నిజోపయోగితామ్.

సాధువులు తమప్రయోజనమును కార్యమువల్ల చూపిస్తారుగాని మాటలతో చూపించరు.

795 భక్షితేఽపి లశునేన వ్యాధిశాంతిః.

వెల్లుల్లితిన్నా వ్యాధిపోలేదు. ఒకసాధనము ఇష్టముకానిదైనా, దానివల్ల ఫలప్రాప్తి అవుతుందని నమ్మి ఆప్రకారముగా చేసినా ఆఫలము సిద్ధించనప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

796 భక్ష్యనియమే నాభక్ష్యప్రతిషేధో గమ్యతే.

ఇట్టిఆహారమునుమాత్రమే తినవలెనని నియమించినప్పుడు ఇట్టిఆహారమును తినకూడదను అనేప్రతిషేధముకూడా చేసినట్లే.

797 భట్టస్తుష్టో ముష్టిపిష్టం దదాతి.

భట్టుమెచ్చుకొంటే, పిడికెడుపిండి ఇస్తాడు.

798 భద్రమభద్రం వా కృత మాత్మని ప్రకల్ప్యతే.

మంచిచేసినా, చెడ్డచేసినా, అది మనస్సుకు తెలుస్తూనేఉంటుంది.

799 భర్చున్యాయము,

ఒకరాజుకు భర్చుడనేఒకమంత్రి ఉండేవాడు. రాజు అతనిని ఒకనాడు దూరదేశములోఉన్న ఒకశత్రురాజును స్వాధీనముచేయడానికి పంపినాడు. మంత్రిపోయి ఆశత్రురాజునుచంపి, ఆరాజ్యములో శాంతినెలకొల్పడానికి కొంతకాలము అక్కడనేనిలిచినాడు. ఈలోగా మంత్రిశత్రువులు రాజుగారికి "భర్చుని శత్రువులు చంపినారు" అని ఒకఉత్తరముపంపినారు. అదిచూచికొని రాజుమరిఒకమంత్రిని ఏర్పాటుచేసుకొన్నాడు. తరువాత భర్చుడు తనదేశమునకువచ్చి, తనస్థానములో మరిఒకమంత్రి ఉండడమునుచూచి, విరాగియై, భస్మముపూసికొని అడవిలోతపస్సుచేసుకొనడానికి పోయినాడు. అప్పుడు అతనిశత్రువులు రాజుగారితో, "మహాప్రభూ, భర్చుడు పిశాచమయి, భస్మముపూసికొని అడవిలోతిరుగుతున్నాడు" అనిచెప్పినారు. ఒకనాడు రాజు వేటకై అడవికిపోయి, విభూతిపూసుకొనిఉన్న భర్చుని అక్కడచూచి, అతడు పిశాచమయినాడని నిశ్చయించుకొన్నాడు. ఇట్లే, ఒకఅపవాదువచ్చినప్పుడు ఊరకొంటే అదిస్థిరపడిపోతుంది. చూ. భైరవవిప్రన్యాయము.

800 భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః

దేహము బూడిదఅయినతరువాత తిరిగీపుట్టడము ఎక్కడిది?

801 భామతీన్యాయము.

భామతిఅనేస్త్రీ ఒకరితేలయినప్పటికీ రూపయౌవనాదిసంపదల చేత భర్తనుసుఖపెట్టుతుంది, సవతులనుదుఃఖపెట్టుతుంది, మరొకమనుష్యునిలో మోహముకలుగజేస్తుంది. అట్లే, ఎవ్వడూ అందరినీసంతోషపెట్టలేడు. ప్రతిఒక్కడున్నూ అనేకులతో అనేకసంబంధములుకలిగి ఉంటాడు.

802 భావార్థాధికరణన్యాయము.

"స్వర్గకాముడు భావించవలెను" అని అంటే, ఏమిభావించవలెను, దేనిచేతభావించవలెను, ఎట్లుభావించవలెను, అనేప్రశ్నలు వస్తవి.

803 భిక్షుపాదప్రసరణన్యాయము

బిచ్చగానికి అన్నము, బట్ట, ఇల్లు, అన్నీలోటే. వాడుధనవంతునిఇంటికిపోయి ఇవన్నీ ఒక్కసారిఅడిగితే అతనిని తగిలివేస్తారు. అందుచేత వాడు మొదట-ఈధనవంతునియింటిలో అడుగుపెట్టుతే చాలునని మెల్లగా పిడికెడుబిచ్చముఅడుగుతాడు. అంతకంతకూ పరిచయముకలుగజేసుకొని తనకుకావలసినవన్నీ క్రమక్రమముగా సంపాదిస్తాడు. అట్లే మోక్షమున్కోరేవాడు వెంటనేదానికి సముపరుగెత్తడమువల్లలాభము లేదు. క్రమముగాసాధనచేస్తేనేకాని వానికి మోక్షములభించదు. (చూ. సోపానారోహన్యాయము.)

804 భిక్షుభియా స్థాల్యనధిశ్రియన్యాయము.

బిచ్చగాడువస్తాడనిభయపడి వంటమూనివేసుకొన్నట్లు.

805 భిల్లీచందనన్యాయము

అతిపరిచయమువల్ల చిన్నతనమున్ను, తరుచుగాఒకరియింటికి పోవడమువల్ల అనాదరమున్ను కలుగుతవి. ఎప్పుడూ అడవిలో గంధపు చెట్టునుచూస్తూఉన్న అడవిజాతిస్త్రీ ఆచెట్టునుకొట్టి వంటకట్టెలుగా ఉపయోగిస్తుంది.

806 భీమభాసదృఢన్యాయము

భీముడు, భాసుడు, దృఢుడు, అనేముగ్గురురాక్షసులను శంబరాసురుడు తనమాయచేతసృజించినాడు. వారు క్రమముగా తత్త్వవిదులయి స్వర్గమునుపొందినారు. జ్ఞానముకలవాడు తనఉచ్చదశనుండి భ్రష్టుడుకాడు. చూ. దామవ్యాలకటన్యాయము.

807 భుక్త్వా శతపదం గచ్ఛేత్.

భోజనముచేసినతరువాత నూరుఅడుగులు నడువవలెను.

808 భుజంగఏవ జానీతే భుజంగచరణం సఖే.

పాముకాళ్ళు పాముకే తెలుస్తవి. ఏజాతివారిగుట్టు ఆజాతివారికే తెలుస్తుంది.

809 భుజయో శిరోవేష్టనేన నాసికాస్పర్శః

నీముక్కు ఎక్కడనున్నదో చూపెట్టుమంటే చేతిని భుజముల చుట్టూ తలచుట్టూత్రిప్పి ముక్కునుచూపించినట్లు.

810 భూతం భవ్యాయ కల్ప్యతే.

వెనుకచేసుకొన్నదే ముందుకు ఫలిస్తుంది.

811 భూతం భవ్యా యది దృశ్యతే.

చూచినట్లయితే వెనుకజరిగినదే ముందుకూడా జరుగుతుంది.

812 భూయస్త్వ త్తద్వాదః

ఎక్కువధనముగలవానిమీద అపవాదులు ఎక్కువగా వస్తవి.

813 భూలింగశకుని న్యాయము.

హిమాలయప్రాంతమందు భూలింగమనే ఒకపక్షి ఉన్నది. అది ఎప్పుడూ "సాహసముచేయకుము" అనిఅరుస్తూ తానుమాత్రము సింహముదవడలలోఉండే మాంసముముక్కను ముక్కుతోలాగుకొంటుంది. అట్లే ఇతరులకుఉపదేశముచేస్తూ తానుమాత్రము ఆఉపదేశము ప్రకారము ఆచరించనివాడుకూడాను.

814 భూశైత్యోష్ణ్యన్యాయము.

భూమికిశైత్యమును ఉష్ణత్వమును ఆరోపించినట్లు. చూ. జలౌష్ణ్య న్యాయము, వాయుశైత్యోష్ణ్యన్యాయము.

815 భేకోఽపి పాదప్రసారాయ చేష్టతే.

కప్పకూడా కాళ్ళనుచాచి తన్నడమునకు ప్రయత్నిస్తుంది. (అసమర్థుడయినవాడు ఒకపనినిచేయడమునకు ప్రయత్నించేఅప్పుడు ఈ న్యాయమువర్తిస్తుంది.)

816 భేదకా గుణాః

గుణములవల్ల వ్యక్తికీవ్యక్తికీ భేదముకలుగుతుంది.

817 భేర్యాఘాతన్యాయము.

ఒకడుఇరవై అడుగులకొకసారిన్నీ, ఒకడు ముప్పైఅడుగులకొకసారిన్నీ, ఒకడునలభై అడుగులకొకసారిన్నీ, భేరినివాయించుకొంటూ పోతారు. ఇందులో నియమములేదు. నియమములేకుండా జరిగేవిషయములో ఈన్యాయము వర్తిస్తుంది.

818 భైరవవిప్రన్యాయము.

ఒక బ్రాహ్మణుడు యజ్ఞముచేయవలెనని సంతకుపోయి నల్లని మేకనుకొని యింటికితీసుకవస్తూఉండగా, ముగ్గురుదొంగలు అతనివద్దనుండి ఆమేకను ఎట్లయినా అపహరించవలెనని దూరదూరముగానిలబడినారు. మొదటివాడు "బాపనయ్యా, నల్లకుక్కను తీసుకవస్తున్నావేమిటి?" అనిఅడిగినాడు. "ఛీ, ఇది కుక్కకాదు, మేక" అనినడుస్తూ ఉండగా రెండోదొంగకూడా అట్లేఅన్నాడు. బ్రాహ్మణునికి అనుమానముగలిగినా, దానినివిడిచిపెట్టకుండా ముందుకుసాగినాడు. అంతట మూడోదొంగకూడా అట్లేఅన్నాడు. బ్రాహ్మణుడు అదినిజముగా కుక్కేకాబోలునని దానినివిడిచిపెట్టినాడు. దొంగలు మేకనుఎత్తుకొని పారిపోయినారు. చూ. భర్భున్యాయము.

819 భ్రమరన్యాయము.

తేనెటీగ పువ్వులలోని ముండ్లనువిడిచి, సుగంధమునుమాత్రమే తీసుకొన్నట్లు బుద్ధిమంతుడు దోషములనువిడిచి, గుణములనుమాత్రమే స్వీకరిస్తాడు.

820 భ్రమరన్యాయము.

తేనెటీగ పువ్వుపువ్వునకుపోయి సుగంధమును తీసుకొంటుంది. కాని, వాసనలేనిపువ్వువద్దకుపోదు. అట్లే, బుద్ధిమంతుడు గుణవంతులతోకలసి, దుష్టులకుదూరముగా ఉంటాడు.

821 భ్రమరన్యాయము.

తేనెటీగ తనముంటితో ఎట్టికట్టెనైనను కన్నముపొడువగలదు. కాని,కమలములోనికిపోయి, దానిలోని తేనెనుమాత్రముతీసుకొని, దాని కెట్టిహానిన్నీ చేయదు. అట్లే, బుద్ధిమంతుడు శత్రువులయెడలను మిత్రులయెడలను సంచరిస్తాడు.

822 భ్రష్టావసరన్యాయము.

వేళకు రాకపోతే, ఆవేళకుకలుగవలసినఫలము కలుగదు.

823 భ్వాదిన్యాయము.

'భూ'అనేధాతువునకు సంస్కృతములో అనేకఅర్థములున్నవి. అట్లే అన్నిధాతువులకున్ను వివిధార్థములున్నవి. వాటికి ఉపసర్గలను చేర్చడమువల్ల వేరేవేరే అర్థములను పొందుతవి. అట్లే, వివిధప్రత్యయములను చేర్చుటవల్లఅర్థభేదముకలుగుతుంది. అట్లే, బ్రహ్మము ఒక్కటే అయినా ఉపాధిభేదములచేత నానారూపములను పొందుతున్నది.

824 మక్షికాన్యాయము.

ఈగ శరీరమునంతావిడిచిపెట్టి పుండుమీదనేవాలుతుంది. అట్లే దుష్టుడు మంచినివిడిచిపెట్టి దోషములనేఎంచుతాడు. చూ. జలౌకాన్యాయము.

825 మక్షికాస్థానే మక్షికాపాతః

అన్నములోపడ్డఈగను తీసిపారవేస్తే, మరిఒకఈగ వచ్చిపడినట్లు ఒకకష్టముపోతే మరొకకష్టముప్రాప్తించడము.

826 మంజూషాఖున్యాయము.

పాములవాడు పెట్టలో ఒకపామునుఉంచగా, దానిలో ఏదో తిండిఉన్నదని ఒకఎలుకప్రవేశించగా పాముదానిని తినివేసినది. ఇష్టార్థసిద్ధికలుగుతుందని అనుకోగా అనిష్టముసంభవించినప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది.

827 మజ్జ నోన్మజ్జనన్యాయము

నదిలోపడి, నీళ్ళలో ఈది, ఒడ్డుకుచేరలేనివాడు మునుగుతూ తేలుతూ ఉంటాడు. అట్లే జీవుడు సంసారమహాసముద్రములోపడి ఒడ్డుకు చేరలేక భగవచ్చరణారవిందాశ్రయము కలిగేవరకూ నానాదుఃఖములూ అనుభవిస్తూఉంటాడు.

828 మండూకతోలనన్యాయము.

కప్పలతక్కెడ. తక్కెడలోకప్పలను రెండుప్రక్కలాపెట్టి తూచడానికి ప్రయత్నిస్తే ఈప్రక్కకప్పకూర్చుంటే అప్రక్కకప్పగెంతుతుంది. ఆప్రక్కకప్పకూర్చుంటే ఈప్రక్కకప్పత్రుళ్ళుతుంది. ఒకరిమాట ఒకరికిపొందకుండాఉన్నప్పుడు ఈన్యాయమునుఉదాహరిస్తారు.

829 మండూకప్లుతిన్యాయము.

కప్పగంతులవలె ఒకపనిచేసి అమార్గముననే ఇతరకార్యములను కూడాచేయకుండా మరియొకదిక్కుగా పనిసాగించడము.

830 మణిప్రదీప ప్రభాన్యాయము.

ఒకయింటిలో ఒకకాంతిగలదీపమునుపెట్టినారు. దానిప్రభ గుమ్మములోపడి మణివలెప్రకాశిస్తున్నది. ఆఎదుటయింటలో ఒకమణిని ఉంచినారు. దానిప్రభకూడా ఆయింటిగుమ్మములో మణివలెప్రకాశిస్తున్నది. ఈరెండుప్రభలను దూరమునుంచిఇద్దరుచూచి ఇదిమణి అని దీపప్రభవద్దకు ఒకడు పరుగెత్తినాడు. ఇదిమణిఅని రెండోవాడు మణిప్రభవద్దకు పరుగెత్తినాడు. ఇద్దరూకూడా అప్రభలు మణులు కావనిన్నీ తాముభ్రమపడినామనిన్నీ తెలుసుకొన్నారు. దీపప్రభను మణిఅనుకొన్నవానిది విసంవాదిభ్రమ, మణిప్రభను మణిఅనుకొన్న వానిదిసంవాదిభ్రమ.

831 మణిమంత్రన్యాయము

అగ్నిజ్వాలలను ఆప్పుటకు మణులుగాని మంత్రములుగాని

శక్తములుకావు, అట్లే విషయకాములైనవారికి జ్ఞానోపదేశమువల్ల లాభములేదు

832 మత్తకాశిన్యా దృష్టా తిర్యఞ్చు కామితా.

చక్కనిస్త్రీకనబడుతూఉంటే పశువులను మోహించినట్లు. ఎక్కువ లాభముకనబడుతూఉంటే దానినివిడిచిపెట్టి తక్కువలాభము అపేక్షించేటప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

833 మత్తకుంజర సంఘాతం భినత్త్యేకోఽపి కేసరీ.

ఏనుగులసమూహమునైనా ఒక్కసింహమే చంపగలదు.

834 మత్స్యకంటకన్యాయము.

చేపలోనిముల్లుఁదీసివేసి వండుకొనితిన్నట్లు. ఒకమంచివస్తువు దోషయుక్తమైఉంటే ఆదోషమునుపరిహరించి దానినిఅనుభవిస్తాము.

835 మందాయంతే న ఖలు సుహృదా మభ్యుపేతార్థకృత్యాః

మిత్రులకార్యములనుచేయుదుమని నిశ్చయించుకొన్న దృఢప్రతిజ్ఞలను నెరవేర్చడములో మంచివారు మాంద్యమునుచూపరు.

836 మందోఽప్యవిరతోద్యోగః సదా విజయభాగ్భవేత్.

మందుడయినా ప్రయత్నమునువిడువకపోతే విజయముపొందుతాడు.

837 మధుకరరాజ మధుమక్షికాన్యాయము.

పోతుతేనెటీగను తేనెనుకూర్చేఆడుతేనెటీగలు అనుచరించేటట్లు (ఇంద్రియములు చిత్తమునుఅనుచరిస్తవి.)

838 మధురరసభవితామ్రబీజన్యాయము.

అంతకంతకూ తీయనిపండ్లనుగలిగించే మామిడివిత్తువలె. ఒకకార్యముయొక్క ఫలము క్రమముగాకనబడేటప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది.

839 మధ్యదీపకన్యాయము.

ఇంటిగదులమధ్యనుంచినదీపము చుట్టూఉన్న గదులకన్నిటికీ వెలుతురునిచ్చేటట్లు.

840 మధ్యమ మణిన్యాయము.

ఒకనగలో చుట్టూముత్యములుంచి, వాటిమధ్య కెంపును పొదుగుతే కెంపుయొక్క ఎరుపువల్ల ముత్యములకుకూడా ఎఱ్ఱనిశోభ కలుగుతుంది. అట్లే, సజ్జనుడు తానుసంఘమునకు శోభ తెస్తాడు.

841 మధ్యాసీనో ఘటః.

ఘటముమధ్యముగావచ్చినది. దానిఅర్థమేమో తెలియక తంటాలుపడుతున్నాడట. అసలు విషయమేమో తెలియదు. దానిప్రయోజనమేమో అంతకంటే తెలియదు. అప్పుడావిషయమై విచారము చేయడమువల్ల కార్యములేదు. చూ. యత్రార్థావగతిరేవనాస్తి తత్ర సందేహస్య కా కథా.

842 మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః.

మనుష్యులకు బంధముగాని మోక్షముగాని మనస్సువల్లనే కలుగుతుంది.

843 మనుష్యా మర్త్యధర్మాణః.

మనుష్యులు మర్త్యధర్మముగలవారు. అంటే, తప్పకమరణము పొందవలసినవారే.

844 మనో ధావతి సర్వత్ర మదోన్మత్తగజేంద్రవత్.

మదించిపిచ్చియెత్తినఏనుగువలె మనస్సుఅన్నిదిక్కులకూ పరుగెత్తుతుంది.

845 మనో నిష్ఠాశూన్యం భ్రమతి.

మనస్సు నిలుకడలేకచలిస్తుంది.

846 మనోరథానాం గతిర్న విద్యతే.

కోరికలకు ఒకత్రోవలేదు.

847. మనోరాజ్య విజృంభణన్యాయము.

కోరికలకు అడ్డులేదు. కోరికలమీదకోరికలు పుట్టుతూనేఉంటవి.

848 మన్యుః సత్పురుషాణాం తుల్యః స్నేహేనసీచానామ్.

సజ్జనులకోపము నీచులతోడిస్నేహముతోసమానము.

849 మరణాద్వరం వ్యాధిః.

చచ్చిపోవడముకంటె రోగముతో ఈడ్చుకొనడము మంచిది.

850 మర్కటకిశోరన్యాయము.

కోతిపిల్ల కోతినివిడిచిపెట్టకుండా పట్టుకొనిఉంటుంది. బలహీనుడు బలవంతుని ఆశ్రయమును విడిచిపెట్టడు.

851 మర్కట మదిరాపానాది న్యాయము.

అసలేకోతి. అదికల్లుతాగినది. దుష్టుని రేపెట్టడము అట్టిదే.

852 మర్దనం గుణవర్ధనమ్.

శిక్షవల్ల సద్గుణములు కలుగుతవి.

853 మలినదర్పణన్యాయము.

అద్దముమలినముగాఉంటే దానిలోనిప్రతిబింబము సరిగా కనబడదు. ప్రతిబింబముకూడా మలినముగానేఉంటుంది. అట్లే, హృదయముస్వచ్ఛమైనదైతే లోకము మంచిదిగా కనబడుతుంది. అది స్వచ్ఛముగాలేకపోతే లోకముకూడా దుష్టముగానే కనబడుతుంది.

854 మల్లగ్రామన్యాయము.

ఒకగ్రామములో ఇతరజాతులవారుకూడా ఉన్నా, మల్లజాతివారు విశేషముగాఉంటే, ఆగ్రామమునకు మల్లగ్రామమని పేరుపడుతుంది. (చూ. బ్రాహ్మణగ్రామన్యాయము. ఆమ్రవణన్యాయము.)

855 మహాత్మో నాస్తి పాతకమ్.

గొప్పవారిని పాపమంటదు.

856 మహాగజా పలాయంతే మశకానాంతు కా గతిః

గొప్పపశుగులే పారిపోతూఉన్నప్పుడు దోమలగతి చెప్పనేల!
(చూ. ఆషాఢవాతే చలతి ద్విపేంద్రే చకీ్రవతో వారిధి రేవ కాష్ఠా.)

857 మహాదోషత్యాగోఽల్పదోషాంగీకారో యథాలోకప్రసిద్ధిః

దోషముచిన్నదయినా దానినిఒప్పుకొనడము, గొప్పదోషమును విడిచిపెట్టినట్లు అవుతుంది.

858 మహామత్స్య తీరన్యాయము.

పెద్దచేప నదిలో ఈఒడ్డునుంచి ఆఒడ్డుకు తిరుగుతూఉంటుంది. అయినా, అది ఆఒడ్డులకంటె వేరయిఉంది, ఒడ్డులనుతాకదు. అట్లే, దేహిఅయిన ఆత్మ జాగ్రిదాద్యవస్థలలోసంచరించినా, ఆఅవస్థలకంటె భిన్నమయి, ఆఅవస్థలధర్మములను పొందదు.

859 మహాన్ మహత్స్వేవ కరోతి విక్రమమ్.

గొప్పవాడు గొప్పవారిమీదనే శౌర్యము చూపిస్తాడు. అల్పులపైకిపోడు.

860 మహిషీ ప్రసవోన్ముఖీ, మహిషో మదనాతురః

గేదె ఈనడమునకు సిద్ధముగాఉన్నసమయములో, దున్నపోతు దానితోరమించడమునకు సిద్ధమయినట్లు, విషయాతురులైనవారు పరులకు బాధలుకలిగినాసరే, తమభోగములను విడువరు.

861 మా జీవన్యః పరాఽవజ్ఞా దుఃఖదగ్ధోపి జీవతి

ఇతరులచేత అవమానముపొంది దుఃఖముచేతకాలిపోతూ ఉండేవాడు చస్తేనేమేలు. (అట్టివాడు పుట్టకపోతేనే బాగుండును.)

862 మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమోనమః

తల్లికీ బిడ్డకూ విరోధముపుట్టించేబంగారమునకు నమస్కారము.

863 మాత్స్యన్యాయము.

చిన్నచేపలను పెద్దచేపలున్ను. ఆపెద్దచేపలను అంతకంటే పెద్దచేపలున్నూ మ్రింగేటట్లు. "అలువుడిని బలువుడుకొట్టితే, బలువుడిని బ్రహ్మదేవుడుకొట్టినా డన్నట్లు" అని తెనుగుసామెత.

864 మానాధీనా మేయసిద్ధిః; ప్రమాణాధీనా ప్రమేయసిద్ధిః
కొలతపాత్రలనుబట్టి ఇదిఇంతఉన్నదని నిశ్చయమవుతుంది. అట్లే ప్రమాణమునుబట్టి, ప్రమేయము సిద్ధిస్తుంది.

865 మాయికాగుణా వాస్తవం నిర్గుణత్వం న విఘ్నంతి.
గుణములు మాయవల్లపుట్టుతున్నవి. అవి సత్యస్వరూపమయిన నిర్గుణపరబ్రహ్మమునకు బాధకములుకావు.

866 మారణాయ గృహీతోఽంగచ్ఛేదం స్వీకరోతి.
చావడానికి సిద్ధపడినవాడు నరుకుకొనడమునకు కూడా ఒప్పుకొంటాడు.

867 మార్జాలకిశోరన్యాయము.
పిల్లి తనపిల్లను నోటితోకరచికొనితిరుగుతుంది. బలవంతుడు బలహీనునిమీద అధికారముకలిగిఉంటాడు.

868 మార్జాలాభ్యంజనమ్.
పిల్లికి నూనెతలయంటినట్లు.

869 మార్దవే బహవో దోషాః.
మెత్తనివారిని మొత్తబుద్ధి అని తెలుగుసామెత. మెత్తగా ఉంటే, అతనిలో ఏవో దోషాలు ఉన్నవనుకొంటారు.

870 మాలతీపుష్ప మశ్మనా హంతు మీహతే.
మాలతీపుష్పమును రాతితో నలగగొట్టినట్లు. కఠినహృదయులు సాధువులయెడల అట్లేసంచరిస్తారు.

871 మాల్యం కస్య విచిత్రపుష్పరచితం ప్రీత్యై న సంజాయతే.
రంగురంగుల పువ్వులుగుచ్చిన పూలదండ ఎవ్వరికి ప్రీతిపుట్టింపదు? ప్రతీవానికీ సుందరవస్తువుల మీద ప్రీతిఉంటుంది.

872 మాంసం మాంసేనవర్ధతే.
మాంసము మాంసాహారముచేతనేవృద్ధిఅవుతుంది.

873 ముఖ మస్తీతి వక్తవ్యం దశహస్తా హరీతకీ.

కరక్కాయకు ఒకమొగమున్ను పదిచేతులున్ను ఉన్నవన్నట్లు. అసంభవకార్యమునుగురించి చెప్పేటప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

874 ముఖే ముఖే సరస్వతీ.

మాటలుచెప్పడములో అందరూగట్టివారే.

875 ముఖ్యాసంభవే గౌణగ్రహణం యుక్తమ్.

ఒకశబ్దముయొక్క ముఖ్యార్థముతెలియనప్పుడు దానిగౌణార్థమును గ్రహించుట యుక్తము.

876 ముంజా దిషీకోద్ధరణన్యాయము.

ముంజగడ్డిలోనుంచి మధ్యనున్నమోవును నేర్పుగాతీసినట్లు బ్రహ్మచర్యాదిసాధనములనుపయోగించి, మూడువిధములయిన శరీరములనుంచి ఆత్మను జాగ్రత్తగా విడదీసినయెడల అది చిదానందరూపముతో ప్రకాశిస్తుంది.

877 మురారే స్తృతీయః పన్థాః

మురారిది మూడోమార్గము. (అతడు కాళిదాసునీ అనుసరింపడు, భవభూతినీ అనుసరింపడు.) స్వతంత్రమార్గమునవలంబించేవానిని గురించి ఈన్యాయమువర్తిస్తుంది.

878 ముసలః కిసలాయతే.

రోకలి చిగిర్చినట్లు (అసాధ్యము, అసంభావ్యము.)

879 మూఢం మూఢభావమైన బోధయేత్.

మొరటువానిని మొరటుమాటలతోనే బోధపరచవలెను.

880 మూర్ఖసేవనన్యాయము.

మూర్ఖుడినికొలిచినట్లు (నిష్ప్రయోజనమన్నమాట.) చూ. ఊషరవృష్టిన్యాయము, మొద.

881 మూర్ఖస్య మూర్ఖో గతిః.

మూర్ఖుడు మూర్ఖునితోకూడిఉండడమే మంచిదనుకొంటాడు.

882 మూర్ఖేణ కిం భాషణమ్.

మూర్ఖునితో మాటలేమిటి?

883 మూషకవిషాణన్యాయము.

ఎలుకకు కొమ్ములువచ్చినట్లు. అసంభావ్యమైనమాట. చూ. గగనారవిందన్యాయము, శశవిషాణన్యాయము.

884 మూషాసిక్త తామ్రన్యాయము.

మూసలోకరిగించినరాగివలె, మూసలోరాగినికరిగించుతే, అది ఆమూసఆకారముపొందుతుంది. అట్లే, రూపాదులను ధ్యానించేచిత్తము ఆరూపములఆకారమును పొందుతుంది.

885 మృగతృష్ణాన్యాయము.

ఎండమావులలోనినీటివలె భ్రాంతినికలిగించడము. సంసారము ఎండమావివంటిదై, భ్రమను పుట్టిస్తుంది.

886 మృగభియా సస్యాఽనాశ్రయణన్యాయము.

పశువులుతినివేస్తవని పొలములో సస్యమునుపెంచనట్లు.

887 మృగవాగురాన్యాయము.

వాగుర అంటేనే మృగబంధనమని అర్థమయినా, మృగవాగురా అని మృగశబ్దముతోకలిపి ప్రయోగిస్తాము. (చూ. కరిబృంహితన్యాయము, కరకంకణన్యాయము, గజఘటాన్యాయము, చంద్రజ్యోత్స్నాన్యాయము, నీలేందీవరన్యాయము, పర్వతాధిత్యకాన్యాయము, పర్వతోపత్యకాన్యాయము, వాజిమందురాన్యాయము.)

888 మృతమారణన్యాయము.

చచ్చినవానినిచంపినట్లు (నిష్ప్రయోజనమన్నమాట) చూ. ఊషరవృష్టిన్యాయము, మొద.

889 మృతం స్యా ద్యాచితం భక్ష్య మమృతంస్యా దయాచితమ్.

అడుగుకొనితిన్నఅన్నము మృత్యువుతోసమానము. అడుగుకోకుండాలభించినఅన్నము అమృతముతోసమానము.

890 మేఘోదయే శాలిసమృద్ధౌ కోద్రవాః (న) శనమ్

వర్షముకురిసి మంచిధాన్యము పండిఉండగా ఊదలువండుకొని ఎవరుతింటారు? జ్ఞానోదయమయిన తరువాత కర్మలననుసరించడము తుచ్ఛమే. ఈన్యాయములో 'మేఘోదయే' అనేమాటనుకొందరు విడిచి పెట్టుతారు

891 మౌనం పండితలక్షణమ్.

ఊరకుండడమే పండితునిలక్షణము.

892 మౌన మర్ధాంగీకారః

ప్రత్యుత్తరము చెప్పకుండాఊరుకొంటే సగముఒప్పుకొన్నట్టే.

893 మౌనం సర్వార్థసాధకమ్.

ఊరకుండువాని కూరెల్లనోపదు.

894 మౌనాత్సత్యం విశిష్యతే.

ఊరుకొనిఉండడముకంటె, సత్యముపలుకడము ఎక్కువది.

895 మౌనేన కలహో నాస్తి నాస్తి జాగరతో భయమ్.

ఊరకొంటేజగడముపుట్టదు, మేలుకొనిఉంటే భయముకలుగదు

896 యః కల్పః స కల్పపూర్వకః

ఈకల్పమునకుముందు మరిఒకకల్పముండనేఉన్నది. కాలము అనంతమయినది. కారణకార్యములు నిరంతరమున్ను సాగుతునేఉంటవి.

897 యః కారయతి స కరోత్యేవ.

ఒకపనినిచేయించేవాడు దానిని తానుచేసినట్లేఅగును. సైనికుల చేతయుద్ధముచేయించినా, యుద్ధము రాజుచేసినట్లేఅగును. (చూ. కారయితుః కర్తృత్వమ్.)

898 యః కురుతే స భుంక్తే.

ఎవడుచేసుకొన్నది వాడే అనుభవిస్తాడు.

899 యచ్ఛ్రూయతే తద్విధీయతే.

దేనినిపొగడుతారో, దానినిచేయవలెనని ఉన్నదన్నమాట.

900 యతో ధర్మ స్తతో జయః.

ఎక్కడధర్మముంటే అక్కడజయముకలుగుతుంది.

901 యత్కార్యం జాయతే యస్మాత్తస్మిం స్తత్ప్రతితిష్ఠతి.

దేనినుంచికార్యముపుట్టుతుందో, అదేఆకార్యమునకుఆధారమున్నూ కారణమున్నూ అవుతుంది.

902 యత్కృతకం తదనిత్యమ్.

కృతకమయినవస్తువు అనిత్యమయినదే, కృతకమంటే కార్యమన్నమాట, కార్యమెప్పుడూ అనిత్యమయినది. ఎందుచేతనసగా అదే కారణమయి మరిఒకకార్యముగా మారిపోతుంది.

903 యత్పరః శబ్దః అనున్యాయము.

అర్థముకలదేశబ్దము. అర్థములేనిది శబ్దముకానేరదు.

904 యత్ప్రాయః శ్రూయతే అనున్యాయము.

ఏదిసాధారణముగా వినబడుతూఉంటుందో, అదేనిజమనిఅనుకొంటాము. లోకులు నలుగురూఅనుకొనేమాటను నమ్ముతారు. దానిలోని సత్యాసత్యములను గ్రహించరు.

905 యత్ప్రాయే యచ్ఛ యాదృక్ఛ తత్తాదృగవగమ్యతే.

ఏదిసాధారణముగా ఎట్లుకనబడుతుందో దానిని ఆవిధముగానే గ్రహిస్తాము.

906 యత్ర తిష్ఠతి ధర్మాత్మా తత్ర దేవోఽపి తిష్ఠతి.

ధర్మాత్ముడెక్కడఉంటే దేవుడుకూడా అక్కడఉంటాడు.

907 యత్ర ధూమ స్తత్ర వహ్నిః

పొగఉన్నచోట అగ్నికూడాఉంటుంది.

908 యత్రార్థావగతిరేవ నాస్తి తత్రసందేహస్య కాకథా.

అసలుఅర్థమే తెలియకపోతేసందేహముఎక్కడనుంచిపుట్టుతుంది

909 యత్రోభయోస్సమోదోషో నతత్రైకోఽనుయోజ్యః

(చూ. యత్రోభయోస్సమోదోషః పరిహారోఽపివాసమః)

910 యతోభయోః సమోదోషః పరిహారోఽపి వా సమః
నైకః పర్యనుయోక్తవ్య స్తాదృగర్థవిచారణే.

పరస్పరమువివాదము చేస్తూఉన్నవారిలో ఇద్దరివల్లను దోష ముంటే ఇద్దరినీకూడా విడువవలెను. అందులో ఒకరిపక్షమును బలపరుపకూడదు.

911 యథాక్రతున్యాయము.

మనుష్యుడు తానుపూజించే దేవతతో సమానుడౌతాడు.

912 యథాదేవ స్తథాభక్తః

దేవుడెటువంటివాడయితే భక్తుడుకూడా అట్టివాడే అవుతాడు.

913 యథానామ తథాగుణః

పేరుకుతగినట్లే గుణములుకూడా ఉంటవి.

914 యథాపితా తథాపుత్రః

తండ్రిఎటువంటివాడయితే, కొడుకుకూడా అటువంటివాడవుతాడు.

915 యథాబీజం తథాంకురమ్.

విత్తనమెట్టిదవుతే, మొక్కకూడా అట్టిదేఅవుతుంది.

916 యథాభావ స్తథా దేవః

మనమెట్లుభావించుకొంటే దేవుడట్లేఉంటాడు.

917 యథా రాజా తథా ప్రజా.

రాజెట్టివాడయితే ప్రజలుకూడా అట్టివారవుతారు.

918 యథార్థవాదీ స లోక (బంధు) విరోధీ.

యథార్థమునుపలికేవాడు లోకమునకు (బంధువులకు) విరోధి అవుతాడు.

919 యథాసంఖ్యన్యాయము.

ఇదిపాణినీయములోని ఒకన్యాయము. 'యథాసంఖ్యమనుదేశః

సమానామ్' 'టాజసిజసామినాత్ స్యాః" అనగా తృతీయాపంచమీషష్ఠీ ఏకవచనములలోయథాసంఖ్యముగా ఇన, అత్, స్య, అనేప్రత్యయము లుచేరుతవి. అంటే, ఏకవచనమందు తృతీయావిభక్తిలో 'ఇన' ప్రత్యయమున్ను, పంచమిలో 'అత్, ప్రత్యయమున్ను, షష్ఠిలో 'స్య, ప్రత్యయమున్ను చేరుతవి—అనిఅర్థము, ఇట్లే ఇతర స్థలములయం దున్ను తెలుసుకొనేది.

920 యథేచ్ఛం విహర నృషభ రాజ.

బసవన్నా, నీయిష్టమువచ్చినట్టూ తిరుగు. అచ్చువేసివిడిచిన ఆంబోతు.

921 యదంతరేణ య న్నసంభవతి తస్య తదర్థత్వంతద పేక్షమ్.

ఏదిలేకపోతే ఒకకార్యము జరుగదో, అది ఆకార్యమునకుకార ణమవుతుంది. అగ్నిలేకపోతే ఇల్లుతగులబడదు. అందుచేత, అగ్నిఇల్లు కాలుటకుకారణమని చెప్పబడుతుంది.

922 యదన్నః పురుషో లోకే తదన్నాస్తస్య దేవతాః.

ఎవడు ఏమిఅన్నముతింటే, వాడుపూజించే దేవతలకుకూడా ఆఅన్నమునే నైవేద్యము పెట్టుతాడు.

923 యది హృదయమశుద్ధం తస్య సర్వం విరుద్ధమ్.

హృదయము మంచిదికాకపోతే, అంతా విరుద్ధముగానేకనబడు తుంది.

924 యదేవోపనతం దుఃఖాత్ సుఖం తద్రసవత్తరమ్.

దుఃఖమ్ము ననుభవించిన తరువాత కలిగినసుఖము మరీసుఖవంత ముగాఉంటుంది.

925 యద్గతం తద్గతం గతమ్,

పోయినది పోయేపోతుంది, తిరిగీరాదు.

926 యద్గ్రహే యదపేక్షం చక్షుస్తదభావగ్రహేపి తదపేక్షతే.

ఒకవస్తువున్నదని తెలియడమునకు కన్ను కావలసినట్లే, అదిలేదని తెలుసుకోవడమునకుకూడా కన్ను కావలెను.

927 యద్దినం తద్దినం నాస్తి తద్దినం దుర్దినం మమ.

ఏరోజుతద్దినము (పితృభోజనము) లేదో, ఆరోజునాకుదుర్దినము (తిండిపోతులుచెప్పేమాట.)

928 యద్దృష్టం దృశ్యతే స్వప్నేఽననుభూతం కదాపి న.

జాగ్రదవస్థలో చూచినవస్తువు కలలోకూడా కనబడితే, అది ఎన్నడున్ను అననుభూతముకానేరదు.

929 యద్యథావర్తతే తస్య తథాత్వం భాతి మానతః.

ఏదిదేనితోకలసివర్తిస్తుందో, దానికారూపము కలుగుతుంది. నీరు ముత్తెపుచిప్పలోపడి, ముత్యముయొక్క ఆకారమునుపొందుతుంది.

930 యద్యదా యత్కరణసమర్థం తత్తదా తత్కరోతి.

ఏదియెప్పుడు ఏమిచేయసమర్థమైఉంటుందో, అదిఅప్పుడు దానినిచేస్తుంది.

931 యద్యదా యన్న కరోతి తత్తదా తత్రాసమర్థమ్.

ఏదియెప్పుడుదేనినిచేయ సమర్థముకాదో, అదిఅప్పుడు దానిని చేయసమర్థముకాదు.

932 యద్వివాహ స్తద్గీతగానమ్.

పెండ్లిఎట్టిదైతే వాద్యముకూడా అట్టిదేఉంటుంది. అట్లే,పురాణములలో ఏదేవతనుగురించి ఒకపురాణముచెప్పుతుందో, దానిలో ఆదేవతయొక్క మాహాత్మ్యమే ఉంటుంది.

933 యద్విశేషయోః కార్యకారణభావోఽసతి బాధకే తత్సామాన్యయోరపి.

రెండు విశేషవస్తువులకు కార్యకారణ సంబంధములేకపోతే, అవి

శేషవస్తువులకు సంబంధించిన సామాన్యజాతులకుకూడా కార్యకారణ సంబంధముండదు.

934 యన్నివృత్తిమద్వస్తు తదుత్పత్తిమదపి.

చచ్చిపోయేవస్తువు మరిఒకవస్తువును పుట్టిస్తూఉంటుంది. అట్లే, చచ్చినవానికి పునర్జన్మముకూడా ఉంటుంది. ఆకూ, అలమూ, చచ్చి, కుళ్ళి, ఎరువయి, మరికొన్ని మొక్కలు మరింతబలముగా పుట్టడమునకు హేతువులవుతవి.

935 యమస్య కరుణా నాస్తి తస్మాత్ జాగృత జాగృత.

యమునికి కరుణలేదు. మేలుకోండి, మేలుకోండి, ప్రతిక్షణమూ ధర్మమునాచరించండి.

936 యవాః ప్రకీర్ణా న భవంతి శాలయః.

యవలనువెదజల్లుతే, వరిపండదు.

937 యశస్తు రక్ష్యం పరతో యశోధనైః

యశస్సేధనముగాగలవారు తమయశస్సును ఎక్కువగా రక్షించుకోవలెను.

938 యశ్చార్థాదర్థో న స చోదనార్థః

వేదములోనున్నవాక్యములనుబట్టియే వేదములకు అర్థమును నిర్ణయించకపోతే అదివేదార్థముకానేరదు.

939 యశ్చోభయోస్సమోదోషో న తే నైకశ్చోద్యోభవతి.

వివాదముచేస్తూఉన్నవారిద్దరిలోనూ దోషమున్నప్పుడు వారిలో ఒక్కనినిమాత్రమే నిందించకూడదు.

940 యః సర్వజ్ఞ మాత్మానం మనుతే స ఏవ మూఢః

సర్వజ్ఞుడననుకొనేవాడే మూఢుడు.

941 యః సర్వజ్ఞోఽపి మూఢమానీ భవతి స ఏవవిద్వాన్.

అన్నీ తెలిసినవాడయినా ఏమీ తెలియని వాడ ననుకొనేవాడే విద్వాంసుడు.

942 యస్యదండ స్తస్య మహిషీ.

ఈగేదెవరిది అనిఅడుగుతే ఈకఱ్ఱెవరిదో వానిది అన్నాడట. ఈకఱ్ఱెవరిది అనిఅడుగుతే, గేదెవరిదో కఱ్ఱకూడావానిదేఅన్నాడట.

943 యస్యాజ్ఞానం భ్రమస్తస్య భ్రాంతస్సమ్యఙ్నవేద సః

అజ్ఞానముగలవానికి భ్రమకలుగుతుంది. భ్రాంతుడయినవాడు తానజ్ఞానినని తెలుసుకోలేడు.

944 యాగానాం దైక్షస్య చేతరేషు.

యజ్ఞముచేయడమునకు దీక్షపూనినవాడు, ఇతరకార్యములను చేయడములో దీక్షను పొందడమునకుకూడా అర్హుడై ఉంటాడు.

945 యాదృశం తాదృశమేవ సాధయతి.

ఎటువంటిది అటువంటివానినే సాధిస్తుంది. చూ. అస్త్రమస్త్రేణ శామ్యతి; చౌరాన్వేషణే చౌరఏవ ప్రయోక్తవ్యః.

946 యాదృశః పురుషస్యాత్మా తాదృశం సంప్రభాషతే.

పురుషుని అంతఃకరణము ఎట్లుంటే పలుకుకూడా అట్లేవస్తుంది.

947 యాదృశం ముఖం తాదృశం చపేటికా.

మొగ మేలాంటిదయితే చెంపకాయకూడా ఆలాగేకొట్టుతారు ముద్దుమొగముచూచి మెల్లగాబుగ్గలుపుణుకుతారు. కురూపిమొగము చూచి గట్టిగాచెంపకాయవేస్తారు. అట్లే వారివారిగుణములను బట్టి ఆదరమో, అనాదరమో కలుగుతుంది.

948 యాదృశీభావనా యస్య సిద్ధి ర్భవతి తాదృశీ.

ఎవనిఊహ ఎట్లుపరుగెత్తుతుందో కార్యసిద్ధికూడా ఆరీతిగానే అవుతుంది.

949 యాదృశీమాతా తాదృశీపుత్రీ.

తల్లియెట్టిదైతే కూతురూ అట్టిదేఅవుతుంది.

950 యాదృశీ శీతలాదేవీ తాదృశీ ఖరవాహనమ్.

శీతలాదేవిఅనే క్షుద్రదేవత స్వరూపమునకు తగినట్లే గాడిద మీాద కూర్చోబెట్టిఊరేగిస్తారు. ఎవరికితగినట్లు వారికిచేయడము.

951 యాప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ
త్వామనుస్మరత స్సా మే హృదయా న్మాపసర్పతు.

విషయసుఖములందు అవివేకులకు ఎంతదృఢమయిన ప్రీతిఉండు నో నాకునీయందు (ఈశ్వరునియందు) అట్టిదృఢమైనప్రీతి నాహృద యమునుండి వదలిపెట్ట కుండునుగాక.

952 యా యస్యాభిమతా తాత సురూపా తస్య సా భవేత్.
ఎవనికి ఏదిఇష్టమయిఉంటుందో అదిచాలాచక్కనిదిగాతోస్తుంది.

953 యావచ్ఛిర స్తావతీ శిరోవ్యథా.
తలఉంటేనే తలనొప్పి.

954 యావత్తైలం తావద్వ్యాఖ్యానమ్.

దీపమునకు చమురున్నంతసేపేచదువు. తరువాత మానివేయ వచ్చును. ధనమున్నంతసేపే దానిననుభవించడముకూడాను. ఎంతమట్టు కుఉంటే అంతతోనేకాలక్షేపముచేసుకొనే సందర్భములో ఈన్యాయ మువర్తిస్తుంది.

955 యావత్సంపాతముషిత్వా.

పుణ్యఫలముల నెంతకాలమనుభవింపవలసియున్నదో అంత పర్యంతమే స్వర్గలోకమునవసింతురు. "క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశంతి" పుణ్యముక్షీణించగానే పునర్జన్మమునెత్తుతారు.

956 యావత్స్నానం తావత్పుణ్యమ్.

ఎంతస్నానముచేస్తే అంతేపుణ్యము. ఎక్కడికక్కడే సర్దుకొన్న ప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

957 యావదేవ భవేత్కల్య స్తావత్ శ్రేయః సమాచరేత్.
దేహము ఆరోగ్యముగాఉన్నప్పుడే మంచిపనులనుచేయవలెను.

958 యావద్వచనం వాచనికమ్.

మాటకుఎంతఅర్థముంటే, అంతమట్టుకే గ్రహింపవలెను.

959 యావన్ముఖగతం పిండం తావన్మధురభాషణమ్.

నోటిలో అన్నముపెట్టుతూ ఉన్నంతసేపూ ఇంపయినమాటలు వస్తవి.

960 యుక్త ముక్తం వచో గ్రాహ్యం బాలాదపి శుకాదపి.

బాలుడుపలికినా, చిలుకపలికినా, యుక్తముగా మాట్లాడిన మాటను గ్రహింపవలెను.

961 యుగపదేవ విశేష్యేవిశేషణంతత్రైవచవిశేషణానంతరం.

విశేష్యమున్ను విశేషణమున్ను ఒక్కటే అయినప్పుడు, ఆవిశేషణమునకు మరిఒకవిశేషణముంటుంది.

962 యూకాభియా కంథా ఽనాశ్రియణన్యాయము.

నల్లులుకుట్టుతవని బొంతమీదపరుండకుండడము.

963 యూపరశనాన్యాయము.

యజ్ఞములో రెండు యూపస్తంభములకు ఒకతాడుకట్టినట్లు, (ఒకపురుషుడుఇద్దరుభార్యలను పెండ్లిచేసుకోవచ్చును.)

964 యేనకేనా ప్యుపాయేన ప్రసిద్ధఃపురుషో భవేత్.

ఏఉపాయముచేతనయినా ప్రసిద్ధినిపొందవలెను.

965 యేన నాప్రాప్తే యోవిధిరారభ్యతే సతస్య బాధకోభవతి.

ఒకపనిచేయడమువల్ల ఒకఫలముకలుగక పోయినప్పుడు, మరిఒకపనినిఆరంభిస్తే, ఈరెండోపని మొదటిదానికిబాధకమవుతుంది.

966 యేనోపక్రమ్యతే యేనోపసంహ్రియతే స వాక్యార్థః

చెప్పేదానికి మొదలూ తుదా ఉండవలెను. తర్కశాస్త్రముప్రకారము ఒకసిద్ధాంతముచేయడములో వాక్యార్థమునకు అయిదుఅవయవములున్నవి. ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగ

మనము అనునవి అవయవములు. కొండలో అగ్ని ఉన్నది; ఇది ప్రతిజ్ఞ. పొగ ఉన్నదికనుక, ఇది హేతువు. పొగఉన్నచోట్లనెల్లా అగ్ని ఉంటుంది, వంటింటిలోవలె—ఇదిఉదాహరణము. ఈకొండమీదకూడా పొగకనబడుతున్నది—ఇదిఉపనయము; అందుచేతకొండలో అగ్ని ఉన్నది—ఇది నిగమనము, (చెప్పేదానికి తలాతోకాఉండవలెను, అని తెనుగువాడుక.)

967 యేషాం పునరవయవా అనర్థకా స్సముదాయా అపి తేషామనర్థకాః

సముదాయముయొక్క అవయవములు అనర్థకములయితే, ఆసముదాయముకూడా అనర్థకమవుతుంది. ఒక్కొక్క ఇసుకరేణువునుంచి నూనెరాకపోతే, ఇసుకకుప్పనుంచికూడా నూనెరాదు.

938 యేషాంసంఘాతా అర్థవంతో ఽవయవా అపి తేషామర్థవంతః

వేటియొక్క సముదాయము అర్థవంతమవుతుందో, వాటిభాగములుకూడా అర్థవంతములవుతవి. నువ్వులనుండినూనెవస్తే, ఒక్కనువ్వుగింజలోనుంచికూడా నూనెవస్తుంది.

969 యోగాద్రూఢి ర్బలీయసీ.

యోగార్థముకంటె రూఢ్యర్థముబలమైనది.

970 యోగ్యప్రయుక్తం సాధనం కార్యసాధకమ్.

సాధనముమంచిదే అయినా, దానిని ఉపయోగించేవాడు దానినుపయోగించడమునకు సమర్థుడైఉంటేనేకాని ఆకార్యము సిద్ధింపదు. బాడిదమంచిదే అయినా, అలవాటులేనివాడు కట్టెను చెక్కబోయి కాలిని చెక్కుకొంటాడు. అట్లే, సర్వకర్మములును ఈశ్వరాధీనములని తలంచి, వాటినిచేస్తూ, మోక్షమునుకోరేవాడు మోక్షమును పొందుతాడు.

971 యోగ్యో యోగ్యేన సంబధ్యతే.

ఎవరికితగినవారితో వారు స్నేహముచేస్తూఉంటారు.

972 యోజనప్రియాయాంకావేర్యాం మల్లబంధనన్యాయము.

కావేరీనది జ్ఞాపకమునకురాగానే, చేపలవానిని, (ఓడనడిపేవానిని,) పట్టి బంధించినట్లు, కావేరిని దాటడమునకు ఓడనడిపేవాడు దొరుకుతాడో దొరకడో అని, అట్టివాడు కనబడగానే వానిని నిర్బంధించి పట్టుకోవడము ఆచారము. కావేరీనది దగ్గరలేకపోయినా, ఆనది జ్ఞాపకమునకురాగానే ఒకనిని బంధించడము, అధికారదార్ఢ్యమును తెలియజేస్తుంది.

973 యో యద్వపతి బీజం హి లభతే సోఽపి తత్ఫలమ్.

ఎవడు ఏవిత్తులను విత్తుతే ఆపంటనే పొందుతాడు. పుణ్యము చేస్తే సుఖమున్నున్ను, పాపముచేస్తే దుఃఖమున్నున్ను అనుభవిస్తాడు.

974 యోయన్నిరూపిత సాంసిద్ధిక ప్రాకారాక్రాంత స్స తన్నిరూపిత తజ్జాతీయ విశేణాధాన విశేష సంతానకః.

ఏది దేనిచేత నిరూపింపబడ్డ మర్యాదచేత అర్థసిద్ధిని పొందుతుందో, అది ఆజాతికి సంబంధించిన విశేషణములనుకూడా స్ఫురింపజేస్తుంది.

975 యో యం ప్రతి సేవ్య స్స తస్మాద్భిన్నః.

సేవింపబడేవాడు సేవించేవానికంటె ఇతరుడై ఉంటాడు.

976 యోయస్య ప్రసంగే లభతేఽసౌతత్కృతాని కార్యాణి.

శిష్యుడు గురువుమూలముగా గొప్పప్రజ్ఞావంతుడయితే, శిష్యుని ప్రజ్ఞావిశేషములను బట్టి గురువునకు కీర్తివస్తుంది.

977 యో యస్య మిత్రం న హి తస్యదూరమ్.

స్నేహితునికి దూరమన్నదిలేదు. ఎంతదూరములో ఉన్నా మిత్రులు ఒకరినొకరు ప్రేమించుకొంటారు.

978 యోవై చిత్తేన దూరస్థః సమీపస్థో హి దూరతః.

మనస్సుదూరమయితే, దగ్గరగాఉన్నవాడుకూడా దూరముగా ఉన్నట్టే కనబడుతాడు.

979 యోహిభుక్తవంతం ప్రతి బ్రూయాన్నా భుక్థా ఇతి కిం తేన కృతం స్యాత్.

కడుపునిండాతిన్నవానితో "నీవుతిండితినవద్దు" అని చెప్పడము వల్ల ఏమిప్రయోజనము.

980 రక్తపటన్యాయము.

'బట్ట' అనిఅంటే 'ఎటువంటిబట్ట' అనిప్రశ్నవస్తుందేమో అని ఆకాంక్షచేసుకొని 'ఎఱ్ఱనిబట్ట' అనిముందేచెప్పినట్లు.

981 రజ్జు సర్ప న్యాయము.

త్రాటినిచూచి పామనుకొన్నట్లు, జగత్తునుచూచి అదియేఈశ్వరుడనుకొన్నట్లు.

982 రథకారాధికరణన్యాయము.

"రథకారుడు హోమాగ్నిని ప్రజ్వాలింపజేయవలెను" అన్నప్పుడు 'రథకారుడు' అనే పేరుగలబ్రాహ్మణుడని అర్థము, కాని, రథములను నిర్మించేశూద్రుడని అర్థముకాదు.

983 రథ వడవాన్యాయము.

రథమునకు పూచినరెండు గుఱ్ఱములున్న ఒకదానికొకటిసహాయముచేసి ఐకమత్యముగా ఉంటేనే అవి రథమునులాగగలవు. ఒకటి ముందుకూ, ఒకటివెనుకకూలాగుతే రథమునడవదు. అట్లే, సంసారములో భార్యాభర్తలకు అన్యోన్యము అనుకూలముగాఉంటేనే ఆసంసారము అభివృద్ధికివస్తుంది.

984 రథ్యాదీపన్యాయము.

దారిలోదీపముపట్టుకొని నడుస్తూఉన్నప్పుడు, దీపమువెలుతురు ముందున్నస్థలముమీద పడుతుంది. తరువాత ఆస్థలముమీదికి దీపమే వస్తుంది. వెలుతురుముందుకుపోతుంది, వెనుకటిచోటునుంచి వెలుతురు పోతుంది.

985 రశ్మితృణాది న్యాయము.

సూర్యరశ్మి గడ్డిపోచలమొనలను వెలిచి రంగురంగులుగా కనబడుతుంది. సూర్యకాంతపు రాతిపైబడి, భగ్గునమండజేస్తుంది. అట్లే, మనుష్యునికి ఒకరిమీద అనుగ్రహమున్న, మరొకనిమీద కోపమున్న ఉంటవి.

986 రాజపుత్రవ్యాధన్యాయము.

ఒక రాజకుమారుని అతనిసవతితల్లి ఎక్కడికోతోలివేసింది. అతడుఒకబోయవానిచేతచిక్కి, పెంపబడి, తానుబోయవాడనేఅనుకొన్నాడు. కొన్నాళ్ళకు మంత్రులు, అతనిముఖలక్షణములవల్ల రాజపుత్రుడని తెలుసుకొని, తీసికొనివచ్చి, సింహాసనముమీదకూర్చపెట్టినారు. చూ. కర్ణకౌంతేయన్యాయము.

987 రాజపురప్రవేశన్యాయము

రాజుగారిపట్టణములోనికి అనేకమంది ఒకసారిగాప్రవేశంచడమునకు నగరద్వారరక్షకులు ఒప్పుకొనరు, ఒకరితరువాతనొకరు ఎంతమంది అయినా ప్రవేశింపవచ్చును.

రాజుగారిపట్టణములోనికి ఒకొక్కరిచొప్పునపోతే రాజపురుషులువారినిహింసిస్తారు. కాని అనేకమందికలసిఒక్కసారిగా వెళ్ళినట్టయితేభయముచేత రక్షకభటులేమీచేయలేరు.

988 రాజసం తామసంచైవ దూరతః పరివర్జయేత్.

రాజస తామసగుణములను దూరముగా విడిచిపెట్టవలెను. అవి సత్త్వగుణమును ఆవరించుకొనిఉండి, దానినిర్మలత్వమును బయలుపడనీయవు. వాటిని విడిచిపెట్టినట్టయితే జగత్కల్యాణ హేతువయినసత్త్వగుణము బయటపడుతుంది.

989 రాజానుసృత వివాహ ప్రవృత్త భృత్యన్యాయము.

రాజుగారు పెండ్లికిపోతే, అతనివెంట భృత్యుడుకూడాపోతాడు.

మంచివారిననుసరించినవారు, వారికికలిగేమేలును తాముకూడా పొందుతారు.

990 రాజా ప్రత్యక్షదేవతా.

రాజే ప్రత్యక్షదైవము.

991 రాత్రి సత్రన్యాయము.

"రాత్రియందుచేసినయజ్ఞము" అని చెప్పడమువల్ల అట్లురాత్రి చేసినయజ్ఞమునకు ఫలమేమో తెలియనప్పుడు, దానికిప్రతిష్ఠయేఫలమని కల్పింపబడుతున్నది.

992 రాత్రౌ దీపశిఖాకాంతి ర్న భానావుదితే సతి.

దీపపుకాంతి రాత్రియందే కావలెనుగాని, సూర్యుడుదయించిన తరువాత అక్కరలేదు.

993 రామాయ స్వస్తి, రావణాయ స్వస్తి.

రాముడూఅక్కరలేదు, రావణాసురుడూ అక్కరలేదు. లాభమూఅక్కరలేదు, నష్టమూ అక్కరలేదు. ఉన్నదినిలిస్తే చాలును.

994 రాసభరుత న్యాయము.

గాడిద ఆరంభములో గట్టిగాఅర్చి, అంతకంతకూ స్వరమును తగ్గిస్తుంది. అట్లే, దుర్జనులస్నేహముకూడాను. చూ. పూర్వాహ్ణచ్ఛాయాన్యాయము.

995 రాహోశ్శిరః

రాహువుయొక్క శిరస్సునుగురించి అనేకాభిప్రాయములున్నవి. కొందరు రాహువు శిరస్సనిన్నీ, కేతువు అతని మొండెమనిన్నీ అంటారు. కొందరు రాహుకేతువులిద్దరులేరు. ఇద్దరూ ఒకరేఅంటారు. సూర్యచంద్రులను పట్టుకొనే రాహువు ఒకగ్రహముకాదు, అది ఒకానొక ఛాయ అని అంటారు. ఈరీతిగా అనేకవాదములున్నవి. వివాదగ్రస్తమైన ఒకవిషయమును గురించి ఈన్యాయము చెప్తారు.

996 రూఢిర్యోగ మపహరతి.

రూఢ్యర్థము స్పష్టముగా తెలుస్తూ ఉన్నప్పుడు, యౌగికార్థమును చెప్పకూడదు. 'పంకజ' శబ్దమునకు 'పద్మము' అని రూఢ్యర్థమున్నది గనుక పంకజమునందుపుట్టిన నత్తగుల్ల అని దానికి యౌగికార్థమును చెప్పకూడదు.

997 రూపసామాన్య న్యాయము.

రూపసామాన్యముచేత రెండువస్తువులు ఒక్కటిగానే తలంచడము. నీవిచ్చినరూపాయి నీవుతీసుకో అంటే, మొదటపుచ్చుకొన్న ఆ రూపాయే కానక్కరలేదు. ఆవూళ్లో తిన్నబియ్యమేఇవి, అంటే, ఈబియ్యమూ ఆబియ్యమూ ఒక్కటికాదు. ఈబియ్యము ఆబియ్యము వలె నున్నవన్నమాట.

998 రేఖాగవయన్యాయము.

ఒకడుగవయమనే జంతువునెప్పుడూ చూడలేదు. గవయమెట్లుండునని మరిఒకనినిఅడుగగా వాడు గీతలతోగవయముయొక్క బొమ్మ వేసిచూపించినాడు. ఆగీతలబొమ్మయే గవయమని వాడనుకొన్నాడు. ఒకనాడు వాడుఅరణ్యమునకుపోయి అచటగవయమనేజంతువునుచూచి గీతలతోవ్రాసినబొమ్మగవయముకాదు. అది ఒకజంతువు. ఈరూపముగాఉంటుంది అని తెలుసుకొన్నాడు. అట్లే, అజ్ఞాని ‹ఆత్మఎట్లుంటుంది› అనిఅడిగి, ఈలాగునఉంటుంది అనిచెప్పగా ఆత్మకానిదేదో ఒకవస్తువే ఆత్మఅనుకొని, కొన్నాళ్ళకు గురూపదేశమువల్ల నిజమైనఆత్మఏదో తెలుసుకొంటాడు.

999 రోగిన్యాయము.

రోగిచస్తే, రోగముకూడాచస్తుంది.

1000 లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః

ఇదియీవస్తువు అనిసిద్ధాంతముచేయుడమునకు మొదటదానిప్ర

ధానలక్షణములను తెలుసుకొని, అదిఆవస్తువని తెలుపడమునకు గల ప్రమాణములను కూడా తెలిసిఉండవలెను.

1001 లక్షణాశ్రయాః లక్ష్యస్యవ్యవస్థా న్యాయ్యా.

లక్ష్యము లక్షణమునాశ్రయించి ఉంటుంది.

1002లక్ష్యాశ్రయేణ తు లక్షణవ్యవస్థాపనంగత్యంతరాభావాత్

లక్షణమునిర్ణయించడానికి మరిఒకగతిలేనప్పుడు లక్ష్యమునుంచే లక్షణమును ఏర్పాటుచేసుకోవలసిఉంటుంది.

1003 లంఘనం పరమౌషధమ్

ఉపవాసముచేయడమే గొప్ప ఔషధము.

1004లఘుయర్ఖలు తేజసా జగన్న మహానిచ్ఛతి భూతిమన్యతః

మహాత్ముడు తన తేజస్సుచేత జగత్తును తూలనాడి ఐశ్వర్యమును కోరడు.

1005 లజ్జా కుతో ఽంతర్మలినాశయానామ్.

లోపలకుళ్ళు ఉన్నవారికి లజ్జఎక్కడిది?

1006 లజ్జా స్త్రీభూషణం.

సిగ్గే స్త్రీకి అలంకారము.

1007 లతాయాం పూర్వలూనాయాం ప్రసూనస్యాగమంకుతః

అసలు లతనే వేరుతో ఊడబీకివేస్తే దానినుంచిపువ్వుఎట్లుపుట్టు తుంది? (భార్యయే చనిపోతే పుత్రోదయమెట్లుకలుగుతుంది?)

1008 లపోరశంఖన్యాయము.

శంఖమువలె ఘోషించడమేకాని, క్రియమాత్రము శూన్యమ యినప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

1009 లాక్షారసావసిక్త కార్పాసబీజన్యాయము.

ఎఱ్ఱరంగులో నానవేసినప్రత్తిగింజలనుంచి ఎఱ్ఱనిప్రత్తిపుట్టు తుంది. అట్లే, పూర్వకర్మానుసారముగా ఫలముకూడా కలుగుతుంది.

1010 లాంగలం జీవనమ్.

'నాగలిజీవనము' అంటే నాగలి జీవనమునకు నిమిత్తకారణమన్న మాట (చూ. అంతరేణాపి నిమిత్తశబ్దం నిమిత్తార్థో గమ్యతే.)

1011 లూతాతంతు న్యాయము.

సాలెపురుగు తనలోనుంచే దారము ఏర్పాటుచేసుకొని వలపన్నినట్లు (పరమాత్మకూడా తనలోనుంచే జగత్తును నిర్మిస్తాడు)

1012 లోకే గురుత్వం విపరీతతాం వా
స్వచేష్టితాన్యేవ నరం నయంతి.

మనుష్యుడుతనచేష్టలవల్లనే గొప్పవాడో, పేదవాడో అవుతాడు.

1013 లోకో భిన్నరుచిః

లోకములో ఒకొక్కరికి ఒకొక్కటిఇష్టము.

1014 లోభో మూల మనర్థానామ్

లోభమే సమస్తానర్థములకున్ను కారణము.

1015 లోష్ఠ ప్రస్తరన్యాయము.

లోష్ఠమంటే మంటిముద్ద. ప్రస్తరమంటే పాషాణము. ఈరెండింటినిఎత్తిచూస్తే ఏదిబరువైనదో, ఏది తేలికయినదో తెలుస్తుంది.

1016 లోష్ఠప్రస్తారన్యాయము.

మంటితో కుమ్మరివాడు కుండలను, గూనలను, పిడతలను, ఈరీతిగా అనేకరూపములుగలపాత్రలనుచేసేటట్లు, ఈశ్వరుడు ప్రకృతిని అనేకరూపములుగా రచించినాడు.

1017 లోష్ఠలగుడన్యాయము

మట్టిముద్దా, కఱ్ఱావలె. మట్టిముద్దను కఱ్ఱతో కొట్టి, కుమ్మరిమర్దిస్తాడు. బాధపెట్టేవాడున్నూ, బాధపెట్టబడ్డవాడున్నూ, చెప్పబడేటప్పుడు ఈన్యాయమును ఉదాహరిస్తారు.

1018 లోహచుంబక న్యాయము.

సూదంటురాయి ప్రత్యేకముగా తన ప్రభావమును చూప

లేదు. కాని దానిని ఇనుముదగ్గరకుచేరుస్తే, ఇనుమును ఆకర్షించడమే కాకుండా, దానికికూడా ఆకర్షణశక్తినిస్తుంది. అట్లే చేతనుడైన పురుషుడు ప్రత్యేకముగా ఏపనినీ చేయలేకపోయినా, శరీరముతో సంయోగమునుపొంది, దానికి మహత్త్వము నిస్తాడు.

1019 లోహాగ్ని న్యాయము.

లోహముఅగ్నితో చేరిఉంటే అగ్నివలెనే ప్రవర్తిస్తుంది. అట్లే, సుగుణ దుర్గుణములు సహవాసమువల్ల కలుగుతవి.

1020 వక్రిణి బహవో గుణాః.

వక్రమార్గములో సంచరించేవాడు అనేకగుణములు కలవాడుగా ఎంచబడుతాడు. విదియచంద్రుని శివుడు తలపై పెట్టుకొన్నాడు, అతనికి అందరూ నమస్కారముచేస్తారు.

1021 వచనే కో దరిద్రః.

మాటలకు బీదతనములేదు.

1022 వజ్రలేపన్యాయము.

వజ్రమునుచూర్ణముచేసి పూతపూస్తే వస్తువు అతిదృఢముగా ఉంటుంది. ఏదయినా సుదృఢముగాఉన్నప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

1023 వటే యక్ష న్యాయము.

ఈమఱ్ఱిచెట్టుమీాద భూతము (యక్షుడు) ఉన్నది, అనిఎవడో ఒకమాట ఆరంభిస్తే, తక్కినజనులు మొదటివానివలె ఆభూతమునుచూడకపోయినా, భూతమున్నదనినమ్ముతారు. ఇట్లు వక్తృపరంపరచేతమఱ్ఱిచెట్టుమీాద భూతమున్నమాట స్థిరపడిపోతుంది.

1024 వత్సక్షీరన్యాయము

పాలుఅచేతనపదార్థమయినా, దూడకు వృద్ధిహేతువయినట్లు (అచేతనప్రకృతి ఆత్మమోక్షణమునకు సహాయపడుతుంది.)

1025 వదతోవ్యాఘాతన్యాయము.

చెప్పినదానికివిరుద్ధముగా మాట్లాడడము. "నాకునాలుకలేదు, నాతల్లిగొడ్రాలు" అనిచెప్పినట్లు.

1026 వధ్యఘాతకన్యాయము

వధింపయోగ్యులయినవారున్ను, వధించేవారున్ను, ఒక్కచోట ఉండరు. ఒకవనములో పాములుఎక్కువగా ఉన్నవంటే, అచ్చటగరుత్మంతులు ఎక్కువగాలేవనితెలుసుకోవచ్చును.

1027 వనవ్యాఘ్రన్యాయము.

అడవి పులినిరక్షిస్తుంది. పులిభయమువల్ల అరణ్యమునకు నాశము కలుగదు. అవిఅన్యోన్యమున్ను కాపాడుకొంటవి. కాని వాటికి ఎడబాటు కలుగుతే, రెండూనశిస్తవి. అడవిలో పులిలేదని భయము విడిచి చెట్లనుకొట్టివేస్తారు. మరుగులేకపోవడముచేత పులినిచంపివేస్తారు.

1028 వధ్యతాం వధ్యతాం బాలో నాఽనేనాఽర్థోఽస్తి జీవతా
స్వపక్షహానికర్త్రాఽద్యః కులాంగారతాం గతః

ఈకొడుకువల్లఎట్టిప్రయోజనమున్ను లేదు. వీడుతనవారికే హాని చేస్తూ కులమునకు అగ్నివలెఉన్నాడు. వీనినిచంపివేయవలెను. సదాచారమును వదలిపెట్టినవాడు కొడుకైనను విడిచిపెట్టవలెను.

1029 వరగోష్ఠీ న్యాయము.

కన్యకకోసము వరుని నిశ్చయించడమునకు బంధువులందరూ ఒకచోటచేరి, ఒకనిశ్చయమునకువస్తే అప్పుడు వివాహమనేకార్యరూపమునకు వస్తుంది. అనేకులు అనేకరీతులుగా మాట్లాడినా తుదకు ఒక నిర్ణయము చేసుకొనేటప్పుడు అందరూ ఆనిర్ణయమును ఆమోదించి ఆచరణలోనికి తెస్తారు.

1030 వరఘాతాయ కన్యావరణమ్.

పెండ్లికొడుకును చంపడానికి పెండ్లికూతురును వెదకినట్లు. మనకభీష్టమయినదైనను అదిఅనిష్టాంతరమునుకలుగజేస్తే దానిని కోరకూడదు. (చూ. న హి వరఘాతాయ కన్యా ముద్వాహయంతి.)

1031 వరమద్యకపోతః శ్వో మయూరాత్.

రేపు నెమలిదొరకడముకంటె నేడు పావురము దొరకడము మంచిది. చూ. వరం సాంశయికాన్నిష్కాదసాంశయికః కార్షాపణః

1032 వరంసాంశయికాన్నిష్కాదసాంశయికః కార్షాపణః

బంగారపునాణెము లభించడము సందేహముగానున్నప్పుడు, వెండినాణెము సందేహములేకుండా లభించడమునుంచిది. చూ. వర మద్యకపోతః శ్వోమయూరాత్

1033 వరాటకాన్వేషణే ప్రవృత్త శ్చింతామణిం లబ్ధవాన్

గవ్వకోసము వెతకడానికి బయలుదేరగా చింతామణిరత్నము దొరకినట్లు

1034 వస్తుశక్తిన్యాయము.

వస్తువుయొక్క బలాబలములు దానిశక్తిననుసరించి ఏర్పడుతవి, "జలేతైలంఖలేగుహ్యం పాత్రేదానం మనాగపి ప్రాజ్ఞేశాస్త్రం స్వయం యాతి విస్తారం వస్తుశక్తితః"

1035 వస్తూని మానా న్యపేక్షంతే న ప్రయోజనాని.

వస్తువులకు స్వయముగా ఏమీప్రయోజనములేదు. వాటిప్రయోజనము వాటిని ఉపయోగించుకొనే వారిలోఉన్నది. కత్తిని ఒక మూలఉంచుతే ఎందుకూపనికిరాదు. దానినికట్టెలుకొట్టేనాడు ఒక ప్రయోజనమునకున్నూ, గొంత్రులు నరికేవాడు మరిఒక ప్రయోజనము నకున్నూ ఉపయోగిస్తారు. అట్లే, శ్రుతులకుస్వయముగా ప్రయోజనము లేకున్నా వారిలోని వాక్యములను తీసికొని ఒకొక్కరు ఒకొక్కరీతిగా ఉపయోగించుకొంటారు.

1036 వహ్నిధూమన్యాయము.

అగ్ని ఉన్నదగ్గరపొగఉంటుంది, పొగఉన్నదగ్గర అగ్నిఉంటుంది. దుష్టుడుఉన్నదగ్గర దుష్టత్వము ఉండనేఉంటుంది,

1037 వహ్ని న్యాయము.

అగ్ని ఒక్కటేఅయినా ఒకప్పుడది కొంపలు తగలపెట్టుతుంది. ఒకప్పుడు వంటచేస్తుంది, ఒకప్పుడు వెలుతురునిస్తుంది. చూ. భామతీ న్యాయము.)

1038 వహ్ని విస్ఫులింగ న్యాయము.

అగ్నినుండి అగ్నికణములుబయలుదేరినట్లు, పరమాత్మనుండి జీవాత్మలు బయలుదేరినవి.

1039 వాక్యాన్యపి ద్విగతాని భవంతి.

వాక్యములకురెండేసి అర్థములువస్తవి. "పాండురాజయశమెన్నవైతివి" అంటే, "పాండురాజా, యశస్సును ఆలోచించినావుకావు" అనిభారతార్థమున్ను, పాండుర అజయశమెన్నవైతివి'' అనిరామాయణార్థమున్నువచ్చినవి.

1040 వాక్యార్థప్రతిపత్తిన్యాయము.

వాక్యముయొక్క అర్థము స్పష్టముగా ఉండేటట్లు. ఇది మీమాంసాశాస్త్రములో వచ్చేన్యాయము.

1041 వాఙ్నియమన్యాయము.

ఎక్కువమాటలనాడకుండా నియమ మేర్పరచుకొన్నట్లు. ఇది మీమాంసాశాస్త్రములో వచ్చేన్యాయము.

1042 వాచః కర్మాతిరిచ్యతే.

మాటలకంటెపని ఎక్కువఅయినది.

1043 వాజిమందురాన్యాయము.

మందురాఅంటేనే గుఱ్ఱపుశాల అయినా, వాజిమందురా అని వాజిశబ్దముతో కలిపిప్రయోగిస్తాము. (చూ. కరిబృంహితన్యాయము, కరకంకణన్యాయము, గజఘటాన్యాయము, చంద్రజ్యోత్స్నన్యాయము, నీలేందీవరన్యాయము, పర్వతాధిత్యకాన్యాయము, పర్వతోపత్యకాన్యాయము, మృగవాగురాన్యాయము.)

1044 వాతప్రదీపన్యాయము.

గాలికి దీపమారిపోయినట్లు.

1045 వాయుభక్షణన్యాయము.

చూ. అబ్భక్షణన్యాయము.

1046 వాయు ర్నావ మివాంభసి అనున్యాయము.

నీటిలోనున్న ఓడ గాలికి చలించినట్లు, (మనస్సు విషయసుఖము లచేత సంక్షోభముపొందుతుంది.)

1047 వాయుశైత్యౌష్ణ్య న్యాయము.

వాయువునకు శైత్యమును, ఉష్ణత్వమును ఆరోపించినట్లు. చూ. జలౌష్ణ్యన్యాయము, భూశైత్యౌష్ణ్య న్యాయము.

1048 వాలి సుగ్రీవన్యాయము.

వాలిసుగ్రీవులుయుద్ధముచేసినప్పుడు, శ్రీరాముడు సుగ్రీవునిపక్షమై వాలినిచంపినాడు. అయినా, వాలికంటె సుగ్రీవుడేబలవంతుడని అంటారు.

1049 విక్రీతే కరిణి కి మంకుశే వివాదః.

ఏనుగును అమ్మివేసినతరువాత, అంకుశముకోసము గ్రుద్దులాట ఎందుకు? పెద్దవస్తువునువదలుకొని, చిన్నవస్తువుకోసము దేవులాడడము

1050 విద్యయాసహ మర్తవ్యం న చైనామూషరే వపేత్.

తనకున్నవిద్యను ఎవ్వరికీచెప్పకుండా చచ్చిపోవచ్చునుగాని, దానిని గొడ్డుబుద్ధిగలవానికి మాత్రము చెప్పకూడదు.

1051 విద్యావాన్ ధనవాన్ భవేత్.

విద్యావంతుడే ధనవంతుడవుతాడు.

1052 విద్యావిహీనః పశుః.

విద్యలేనివాడు (వింత) పశువు.

1053 విధేయం స్తూయతే వస్తు.

ఒకవస్తువుకావలసిఉంటే, దానిని పొగడుకోంటాము.

1054 వినా మలయ మన్యత్ర చందనం న ప్రరోహతి.

మలయపర్వతముమీఁదతప్ప మరెక్కడా గంధపుచెట్టుపెరుగదు. అట్లే, మంచివంశములోనే మంచివాఁడుపుట్టుతాఁడు.

1055 వినాశకాలే విపరీతబుద్ధిః.

చావుదగ్గరపడితే ఉత్పన్నబుద్ధులుపుట్టుతవి.

1056 వినిగమన విరహన్యాయము.

ఒకవిషయమును గురించి రెండురీతులుగా ఆలోచించుటకువీలున్నప్పుడు, వానిలోఏదో ఒక్కరీతిగానే ఆలోచించవలెననే పక్షపాతమునకు వినిగమనమనిపేరు. సూర్యసిద్ధాంతము ప్రకారముగామాత్రమే జ్యోతిర్గణితమును చేయవలెనని చెప్తూతారు. మరికొందరు దృగ్గణితమునుమాత్రమే అనుసరింపవలెననిచెప్తూతారు. ఈరెండుపక్షములవారున్నూ, తమతమపక్షములప్రకారము మాత్రమే గణితముచేసేటప్పుడు విపరీతఫలము సంభవిస్తే, తమతమవాదములు నిరర్థకములవుతవిగదా.

1057 విప ద్విపద మనుబధ్నాతి.

ఒకఆపదవెంటనే మరిఒకఆపద వస్తుంది.

1058 విపులకదలీఫలలిప్సయా జిహ్వాచ్ఛేదనమ్.

అరటిపండ్లన్నీ దొరకలేదని నాలుకకోసుకొన్నట్లు.

1059 విముంచే న్ముచ్యమానేషు. అనున్యాయము.

విడువవలసినవారినిలెను. విడిచివేయవ తల్లిదండ్రులు, అన్నదమ్ములు, స్నేహితులూ, మొదలయినవారు అనిత్యులుగనుక బుద్ధిమంతులు వారిని మొదటనేవిడిచిపెట్టితేమంచిది.

1030 వివేకభ్రష్టానాం భవతి వినిపాతః శతముఖః.

వివేకము పోయినవారు నూరువిధములభ్రష్టులవుతారు.

1061 విశిష్టధర్మే వృత్తస్య విశేషణాప్రవృత్తిత్వనియమః.

విశిష్టధర్మముగలవస్తువు ఒకరీతిగా ప్రవర్తిస్తూఉన్నదనిచెప్పిన

ప్పుడు ఆవిశిష్టధర్మముతోనే ప్రవర్తిస్తున్నదని తెలుసుకోవలెను. సూదిఅనేది బట్టలుకుట్టడమనే ధర్మముగల ఒకపనిముట్టు. సూదితో పని చేస్తున్నాడు అన్నప్పుడు బట్టలుకుట్టుతున్నాడు అని ఊహించవలెనుగాని దానితోగోయిత్రవ్వుతున్నాడని ఊహింపకూడదుగదా.

1062 విశిష్టస్య వైశిష్ట్యమ్.

పదములు ప్రత్యేకముగా ఉన్నప్పుడు ప్రత్యేకార్థములను కలిగిఉన్నా ఆపదములనన్నిటినీ ఒకవాక్యములోనికి తీసికొనివచ్చినప్పుడు వాటికూడికవల్ల మరిఒకగొప్పఅర్థము కలుగుతుంది.

1063 విశేషణాభావే విశిష్టాభావః.

విశేషణముతో కూడుకొన్నదే విశిష్టమవుతుంది. విశేషణము లేకపోతే విశిష్టముకూడాఉండదు. మంచిగుణములు గలవాడే గౌరవింపబడుతాడు.

1064 విశేషవాక్యాదర్శనే హి సామాన్యవాక్యస్య నానా విధోఽర్థో వ్యాకర్తుం శక్యతే.

ఒకవిషయమునుగురించి ఇదమిత్థమని చెప్పబడనప్పుడు, దానికి అనేక అర్థములు చెప్పుకోవచ్చును.

1065 విశేషసన్నిధానే హ్యామ్నాతం సామాన్యం తద్వ్యతిరిక్తే సామాన్యే వర్తతే.

ఒకవిషయమునుగురించి విశేషముగాచెప్పి, దానికివ్యతిరిక్తములయినవానిని గురించి సామాన్యముగాచెప్పుతే, ఈసామాన్యమునుంచి మొదటచెప్పిన విశేషవిషయములను వర్జించవలెను. "బ్రాహ్మణులు వచ్చినారు. వసిష్ఠుడుకూడా వచ్చినాడు" అన్నప్పుడు వసిష్ఠుడు బ్రాహ్మణుడుకాడని అర్థముకాదు. వసిష్ఠుడువచ్చినాడు, ఇతరబ్రాహ్మణులు కూడా వచ్చినారు అని అర్థము.

1066 విశేషాఽభావే విశిష్టాభావః.

విశేషములేకపోతే, విశిష్టవస్తువుకూడా ఉండదు. చూ. విశేషణాభావే విశిష్టాభావః.

1067 విశేష్యే విశేషణం తత్రాపి చ విశేషణమ్.

'భూమికుండవలె ఉన్నది' అన్నప్పుడు, కుండకూడా పృథ్వీవికారమే అయినా, అది భూమిఆకారమును తెలుపడమునకు విశేషణమవుతుంది.

1068 విశుద్ధ సత్త్వా విరలాః పునః స్త్రియః.

విశుద్ధప్రవర్తనముగల స్త్రీలు ఎంతోమంది ఉండరు.

1069 విశ్వజిన్న్యాయము.

"విశ్వజిత్తనే యజ్ఞమునుచేయవలెను" అంటే, ఆయజ్ఞము యొక్క ఫలము విశ్వమును జయించడము కాదనిన్నీ, దానికి ఫలము స్వర్గమేఅనిన్నీ తెలుసుకోవలెను.

1070 విశ్వాసః ఫలదాయకః.

విశ్వాసమే ఫలమునిస్తుంది.

1071 విషకీటన్యాయము.

విషకీటకము విషములో పుట్టి, విషముతింటూ, విషములోనే జీవిస్తుంది. అట్లే, దుష్టుడుకూడాను. ఈక్రిందిశ్లోకములో ఈన్యాయము ఉదాహరింపబడినది.

విప్రాఽస్మిన్నగరే మహాన్ కథయ కః? తాలద్రుమాణాం గణః;
కో దాతా? రజకో దదాతి వసనం ప్రాతర్గృహీత్వా నిశి;
కో దక్షః? పరవిత్తదారహరణే సర్వోఽపి పౌరోజనః;
తత్కిం జీవసి హేసఖే? విషకృమిన్యాయేన జీవా మ్యహమ్.

"ఓ బ్రాహ్మణుడా, ఈనగరములో అందరికంటె ఉన్నతుడెవడు?" "తాటిచెట్లు." "ఇచ్చట మిక్కిలిసమర్థుడెవడు?" "ఇతరుల ధనమును భార్యలను దొంగిలించడములో ఈఊరివారందరూ సమర్థులే"

"ఇక్కడ దాతఅయినవాడున్నాడా?" "చాకలివాడున్నాడు, గొప్ప దాత. బట్టలు ఉదయము తీసుకొనిపోయి రాత్రికి తెచ్చియిచ్చివేస్తాడు." "అయితే, మిత్రుడా, ఈఊరిలో ఎట్లుజీవిస్తున్నావోయి?" "విషక్రిమి న్యాయముగా జీవిస్తున్నాను."

1072 విషభక్షన్యాయము.

విషమునుతాగి జీవించేటట్లు. ఏవిషపదార్థమునైనా కొంచెము కొంచెముగా సేవించడమారంభించి, అంతకంతకూ మోతాదుఎక్కువ చేస్తూఉంటే ఆవిషమువల్ల హానికలుగక, కొంతకాలమునకు అదేఆహార మవుతుంది. అట్లే, దుష్టవర్తనము కొంచెము కొంచెముగాఆరంభిస్తే కొన్నాళ్ళకు దుష్టత్వమే స్వభావముగా ఏర్పడుతుంది.

1073 విషం మృత్యుః.

'విషము మృత్యువు' అంటే విషము మృత్యువునకు నిమిత్తకార ణము అన్నమాట (చూ. అంతరేణాపి నిమిత్తశబ్దం నిమిత్తార్థోగమ్యతే)

1074 విషయాకృష్యమాణా హి తిష్ఠంతి సుపథేకథమ్

విషయానందములకు లోనయినవారు మంచిమార్గము నెట్లవలం బింపగలరు?

1075 విషవృక్షో౽పిసంవర్ధ్య స్వయం ఛేత్తుమసాంప్రతమ్.

విషవృక్షమునైనాతనచేతులతో పెంచితా నేనరకివేయడముఎక్క డాచూడలేదు. (ఈన్యాయము "వధ్యతాం వధ్యతాం బాలో... అనేన్యాయమునకు వ్యతిరేకమయినది.)

1076 విషస్య విష మౌషధమ్.

విషమునకు విషమేఔషధము. దుష్టునికి నిగ్రహమే చేయవలెను.

1077 విహంగమన్యాయము.

పక్షియెగిరినట్లు. చెట్టుమీది ఒకపండును తినవలెనంటే, పక్షి తిన్నగా ఎగిరి దానిని తినగలదు. అట్లే, పూర్వజన్మములో సంపూర్ణమై

నకృషిచేసిన ఉత్తమజ్ఞాని, ఈజన్మములో వెంటనే బ్రహ్మానందమును అనుభవిస్తాడు.

1078 వీచీతరంగన్యాయము.

మొదట చిన్న అలలుగా బయలుదేరి తుదకు పెద్దకెరటముల య్యేటట్లు. ఏపనియైనా స్వల్పముగా ఆరంభించి, అంతకంతకూ అల్లకల్లోలముగా పరిణమించేటప్పుడు ఈన్యాయమును ఉపయోగిస్తారు.

1079 వృకబంధనన్యాయము.

కొంగను పట్టుకొనేకథ. "కొంగను పట్టుకొనడమునకు దానిదగ్గరకుపోయి, దానితలమీద వెన్నముద్దను పెట్టితే, ఆవెన్న ఎండకు కరిగి నేయిదానికంటిలోపడుతుంది. అప్పుడుదానికి కన్నులు కనబడవు. వెంటనేదానిని పట్టుకోవచ్చును." అని చెప్పినట్లు.

1080 వృక్షప్రకంపనన్యాయము.

కొంతమంది చెట్టుక్రింద నిలబడి, ఒకనిని చెట్టెక్కమన్నారు. క్రిందనున్నవారిలో ఒకడు ఒకకొమ్మను కదల్చమన్నాడు. మరిఒకడు మరిఒకకొమ్మను కదల్చమన్నాడు; ఇట్లు, తలా ఒకకొమ్మను కదల్చమన్నారు. చెట్టెక్కినవాడు కొమ్మలను ఒకదానితరువాత మరిఒకదానిని కదలించినాడు. మరిఒకడు చెట్టునంతా కదల్చమన్నాడు. అప్పుడు వాడు ద్రమానిని పట్టుకొని చెట్టును కదల్చగా కొమ్మలన్నీ ఒక్కసారికదలినవి. అప్పుడు క్రిందనున్నవారి అందరి అభీష్టములు చెల్లినవి. అట్లే, అనేకమతములవారు ఈశ్వరుని అనేకవిధములుగా భావించినా ఉపనిషత్తులలో చెప్పబడిన మహేశ్వరుడు వీతరాగులైన ముముక్షువులకు ఇష్టుడై ఉంటాడు.

1081 వృక్షవృత్తిన్యాయము.

ప్రయత్నములేకుండానే అభివృద్ధికలుగునప్పుడు ఈన్యాయము

వర్తిస్తుంది. చెట్టు మేఘమునుంచి పడినసీటిచేతను చంద్రకిరణముల చేతను పెరుగుతుంది.

1082 వృద్ధి మిష్టవతః మూలం వినష్టమ్.

వడ్డీ ఎక్కువగాకోరేవాడికి అసలుకూడా పోతుంది. అత్యాశ కూడదు అని అభిప్రాయము.

1083 వృక్షమూలనిషించనన్యాయము.

చెట్టుమొదట నీళ్ళుపోస్తే అవి దానిని మాత్రినిని శాఖలనుకూడావర్ధిల్లజేయును. అట్లే ఇంద్రియములకును ప్రాణములకునుతృప్తికలుగజేయుటచేత అచ్యుతుని పూజజరుపుటకు వీలుకలుగుచున్నది.

1084 వృద్ధకుమారీవరన్యాయము.

ఒకకన్యకకు ఎన్నాళ్ళకయినా వరుడులభించలేదు. ఆమెచాలా కాలముకన్యకగాఉండి, తుదకు తపస్సుచేయడానికి అడవికిపోయినది. ఆమెతపస్సుకుమెచ్చి, ఇంద్రుడు ప్రత్యక్షమై, వరముకోరుకోమన్నాడు. అప్పుడామె "నాపుత్త్రిలుబంగారుపళ్ళెరములో పాలునేతులతోఅన్నముతిందురుగాక" అనివరముకోరినదట. అనగా ఒక్కవరములోనే భర్తను, పుత్త్రిలను, ధనధాన్యగోసంపత్తిని కోరుకొన్నది. ఒక్కపనిచేయడమువల్ల అనేకఫలములుకలిగేటప్పుడు ఈన్యాయమును ఉపయోగిస్తారు. కొందరు 'కాశీమరణా న్ముక్తిః' కాశిలోచచ్చిపోతేముక్తికలుగుతుంది. అనిచెప్పేసందర్భములో ఈన్యాయమును ఉపయోగిస్తారు. ఎన్నిసాధనములచేతముక్తి కలుగకపోయినా కాశిలోమరణించుటవల్ల అదిసిద్ధిస్తుందనిదానిభావము. (ఈన్యాయమునకే వృద్ధకుమారీన్యాయము, వృద్ధకుమారీవాక్యన్యాయము, అనికూడాపేళ్ళున్నవి.) (చూ. వృద్ధబ్రాహ్మణవరన్యాయము.)

1085 వృద్ధబ్రాహ్మణవరన్యాయము.

ఒకబ్రాహ్మణుడుండేవాడు. అతడుపుట్టుగ్రుడ్డి. గర్భదరిద్రుడు.

వివాహముకాలేదు. అతడనేకదుఃఖములనుభవించి, అడవికితపస్సుకు పోయి పరమేశ్వరుని ఆరాధించినాడు. పరమేశ్వరు డతని తపస్సుకుమెచ్చి ఏదయినాఒకవరము కోరుకొమ్మన్నాడు. అప్పుడా బ్రాహ్మణుడు "నాకీ గ్రుడ్డితనముపోవలెనని వేడితినా, దరిద్రముపోదు. భార్యనుకోరితినా దారిద్ర్యము, గ్రుడ్డితనముపోవు. సంతతికూడాకలుగదు. ధనముకోరితినా గ్రుడ్డివాడనై ధనమునెట్లనుభవింపగలను" అని అనేకవిధములఆలోచించి, "నామనుమడు రాజ్యసింహాసనముమీదకూర్చొనిఉండటే, చూచేభాగ్యముఇమ్మ" అనివరము వేడినాడు. అతనిబుద్ధికుశలతకుమెచ్చి పరమేశ్వరుడతనికి ధనమును, చూపును, చక్కనిభార్యను, సంతతినికూడా ఇచ్చినాడు. (చూ. వృద్ధకుమారీవరన్యాయము.)

1086 వృశ్చికీగర్భన్యాయము.

తేలుయొక్క గర్భమువలె. తేలు పిల్లలనుపెట్టి తానుచస్తుంది. చూ. అశ్వతరీగర్భన్యాయము, కదలీఫలన్యాయము.

1087 వృషభకలహే వత్సపాదభంగః.

ఆబోతూ ఆబోతూ పోట్లాడి లేగకాలువిరుగకొట్టినవన్నట్లు. (బలవంతులుకలహిస్తే, ఆమధ్యనున్న బలహీనులకు అపాయముకలుగుతుంది.)

1088 వేణ్యాకాశన్యాయము.

ప్రయాగవద్ద గంగా యమునా సరస్వతులు ఒక్కచోటకలుస్తున్నవి. దీనికే త్రివేణీసంగమమనిపేరు. గంగతెల్లగాఉంటుంది; యమున నలుపువర్ణముగాఉంటుంది; సరస్వతి ఎఱ్ఱగాఉంటుంది; ఈమూడురంగులూకలిసి ఆకాశముయొక్కరంగు ఏర్పడుతున్నది. అట్లే త్రిగుణాధిష్ఠాతలును పరమేశ్వరులును అయిన బ్రహ్మవిష్ణుశివులు అన్యోన్యసంసర్గముచేత భేదములేక ఉంటారు.

1089 వైద్యే మిత్రే నిరంతరాః కథా.

వైద్యునితోను, స్నేహితునితోను, చెప్పుకొనేమాటలకు అంత మంటూఉండదు.

1090 వైశేష్యాత్తు తద్వాదః అనేన్యాయము.

వైశేషికశాస్త్రమునువదిలి, ఆశాస్త్రమునుగురించివాగించేటట్లు

1091 వ్యక్తి న్యాయము.

కొన్నిలక్షణములచేత ఒకవ్యక్తికి ఒకఅర్థమున్నప్పుడు, ఆవ్యక్తి నిగురించి మాట్లాడేటప్పుడు, లక్షణావృత్తిచేత మరి ఒక అర్థము చెప్పకూడదు.

1092 వ్యాఘ్రీక్షీరన్యాయము.

పులిపాలు బంగారుగిన్నెలోమాత్రమే ఉంచవీలవుతుంది. చూ. సింహీక్షీరన్యాయము.

1093 వ్యంజకవ్యంగ్య న్యాయము

వ్యంజకమంటే ఒకఅర్థమును తోపజేసే సంజ్ఞ. అది ఒకశబ్దము తోచేరి దానికి విలక్షణమైన అర్థమునిస్తుంది. "అయ్యో, తమవంటి పండితులున్నారా?" అన్నప్పుడు 'అయ్యో' అనే శబ్దమువల్ల తాము పండితులుకారు అనేవిలక్షణమైన అర్థము వచ్చినది.

1094 వ్యపగతలేపాలాబూన్యాయము.

ఆనబతుంబలో మట్టినింపి నీటిలో పడవేస్తే మునిగిపోతుంది. ఆమట్టి నీటిలో కరిగిపోతే తిరిగి తేలిపోతుంది. అట్లే ఆత్మ దేహముతో కూడి ఉండి సంసారములో ప్రవర్తిస్తుంది. దేహము నశించగానే ఊర్ధ్వగతిని పొందుతుంది. చూ. ఏరండబీజన్యాయము.

1095 వ్యపదేశిన్యాయము

ఒక్కధర్మమునందే రెండుధర్మములను ఆరోపించడము వ్యపదేశము. దేవదత్తునికి ఒక్కడే కొడుకు. అతడేజ్యేష్ఠుడు, అతడేకనిష్ఠుడు, అన్నప్పుడు ఒక్కనియందే జ్యేష్ఠత్వమూ, కనిష్ఠత్వమూ కూడా ఆరోపించినాము. దానికే వ్యపదేశిన్యాయమని పేరు.

1096 వ్యభిచారిణీన్యాయము.

వ్యభిచారిణి అయిన స్త్రీ ఇంటిపనులు చేసుకొంటూ ఉన్నా తన కాముకుని హృదయములో తలంచుకొంటూ, ఆనందిస్తూనే ఉంటుంది. అట్లే, యోగి కర్మలను చేస్తూఉన్నా బ్రహ్మానందపరుడై ఉంటాడు.

1097 వ్యాఖ్యానతోవిశేషప్రతిపత్తిర్నహి సందేహాదలక్షణమ్

ఒకవిధియొక్క అర్థమును గురించి సందేహ మున్నప్పుడు దానిని శిష్టులు చేసిన వ్యాఖానమువల్ల తెలుసుకోవలెను.

1098 వ్యాఘ్రచోరధనుర్న్యాయము.

పెద్దపులి పొదలలో పొంచుండి మృగములమీదికి ఎగురుతుంది. దొంగ ఒకచోటదాగుండి కన్నము త్రవ్వతాడు. విల్లు మొదట వంగి బాణమును విడిచిపెట్టుతుంది. అట్లే, దుష్టుడు వినయమును నటిస్తూ కొంప తీస్తాడు.

1099 వ్యాపకవ్యావృత్యా వ్యాప్య వ్యావృత్తిః

వ్యాపకముంటేనే కాని వ్యాప్యముండదు. వ్యాపకమనగా అన్యాన దేశకాలవృత్తిత్వము. అనగా, దేశకాలభేధములచేత విభజింప రానిది. వ్యాప్యమనగా అనధి దేశకాల నియమము. ఆకాశమును దేశ కాలభేదములచే విభజింపవీలులేదు. అయినా ఆఆకాశమనే వ్యాపకము లేకపోతే, శబ్దమనే వ్యాప్యము ఉండదు.

1100 వ్రీహిబీజ న్యాయము

ధాన్యముగింజలోని బియ్యపుగింజమీద పైని డళసరి పొల్లు తొక్క ఒకటిన్నీ దానిక్రింద సూక్ష్మమయిన తవుడు రేణువులున్ను ఉంటవి. ఈ రెండింటినీ తీసివేస్తే బియ్యపుగింజబయలుపడుతుంది. అట్లే సత్త్వగుణము పైని తమోగుణముచేతను దానిక్రింది రజోగుణముచేతను ఆవరింపబడి ఉంటుంది. ఆరజస్తమో గుణములను తొలగిస్తే నిర్మలమైన సత్వగుణము బయలుపడుతుంది.

1101 వ్రీహిబీజన్యాయము.

ధాన్యము పండేఅప్పుడు మొదట పైపొల్లుబయలు దేరుతుంది. తరువాతదానిలో మెత్తనిపదార్థముకలుగుతుంది. అంతకంతకూ ఆమెత్తని పదార్థము గట్టిపడి బియ్యపుగింజ అవుతుంది. పైపొల్లు తమోగుణముతో పోల్చవచ్చును. మెత్తనిపదార్థమును రజోగుణముతోను బియ్యపుగింజను సత్త్వగుణముతోను పోల్చవచ్చును. బియ్యపుగింజకు పైపొల్లు మొదలయినట్లు సత్త్వగుణమునకు తమోగుణము మొదలయిఉన్నది. అందుచేతనే తమోగుణప్రధానుడయిన శివుడు జగత్తునకు మూలకారణమని శైవులంటారు.

1102 శంకాభిస్సర్వ మాక్రాంతమ్.

ప్రతీవిషయమున్నూ సందేహముతో కూడుకొనిఉన్నది. ఏ పని కూడా తప్పకుండా అయితీరుతుందని చెప్పడానికి వీలులేదు.

1103 శంకూత్ఖాత దంష్ట్రోరగన్యాయము

కోరలు ఊడబెరికినపామువలె. (తనకుసహాయులైన వారిని నాశనము చేస్తే శత్రువు అపకారము చేయలేడు.)

1104 శకుని సూత్రన్యాయము

పక్షిన్ని దానిని పట్టుకొనేవలయున్ను, ఎట్లుభిన్నములో అట్లే జీవమున్ను ఈశ్వరుడున్ను భిన్నులు. చూ. నదీసముద్రన్యాయము, శుద్ధోద లవణన్యాయము, చోరాపహార్యన్యాయము, పుంవిషయన్యాయము, నానావృక్షరసన్యాయము.

1105 శంఖవేలాన్యాయము.

ఒకవేళఅప్పుడు శంఖమును ఊదవలెనని నియమమున్నప్పుడు శంఖముయొక్క ధ్వనివినబడగానే ఆవేళఅయినదని తెలుస్తుంది.

1106 శతపత్రపత్రభేదన్యాయము.

పద్మములోని రేకులను ఒకదానితరువాత ఒకదానిని చిదిమి

వేస్తే, తుదకుపద్మమంతా నాశనమవుతుంది. ఒకపనిక్రమక్రమముగా జరుగగా అదిఒక్కసారిగానే అయినదని భ్రమపడినప్పుడు ఈన్యాయము వర్తిస్తుంది.

1107 శతం విహాయ భోక్తవ్యమ్

నూరుగురినుండి తప్పించి తాను భోజనము చేయవలెను.

1108 శతశ్లోకేన పండితః

నూరుశ్లోకములునేర్చుకొంటే పండితుడవుతాడు.

1109 శతే పంచాశత్ అనున్యాయము

నూటిలో ఏభయిఇమిడిఉన్నట్లు ఒకలాభము అందరికీ సమానముగాకలిగినప్పుడు వారిలోకొందరికి కలుగకపోదు.

1110 శత్రోరపి గుణావాచ్యాదోషావాచ్యాగురోరపి.

శత్రువునివైనా మంచిగుణములను చెప్పవలెను. గురువువైనా దోషములను చెప్పవలెను.

1111 శనైః శనైః క్షిపేత్పాదమ్

అడుగులు మెల్లమెల్లగా వేయవలెను.

1112 శరపురుషీయః-అనున్యాయము

బాణముకొట్టగానే కోటగోడవెనుకనుంచి ఒకపురుషుడు లేవగా అదివానికి తగిలిచచ్చినాడు. చూ. కాకతాలీయన్యాయము

1113 శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్

ధర్మమును సంపాదించడమునకు శరీరమేముఖ్యసాధనము.

1114 శరీరం వ్యాధిమందిరమ్

శరీరము రోగములకుఇల్లు.

1115 శర్కరోన్మజ్జనీయ న్యాయము.

పైనుండి ఒకరు కంకర నీటిలోనికి విసరినాడు, ఆసమయమందే

నీటిలో మునిగి ఉన్నవాడు పైకిలేచినాడు. ఇదివెళ్ళి వానికి తగిలినది. చూ. కాకతాళీయన్యాయము, శరపురుషీయన్యాయము.

1116 శల్యకవానాఖున్యాయము.

చుంచువలె. చుంచుచిన్నఎలుక. అది పరుండి ఉన్నవారిపాద ములను మెల్లగా కరుస్తుంది. అట్లేరాజుకూడా ప్రజలను అట్టే కష్ట పెట్టకుండా పన్నులను గ్రహింపవలెను.

1117 శవోద్వర్తన న్యాయము.

శవమును మేల్కొనజేయ ప్రయత్నించునట్లు (నిష్ప్రయోజన మన్నమాట.) చూ. ఊషరవృష్టి న్యాయము, మొ||.

1118 శశవిషాణ న్యాయము.

చెవులపిల్లికొమ్మువలె అసంభావ్యమన్నమాట. చూ. మూష కవిషాణ న్యాయము, గగనారవిందన్యాయము.

1119 శశినాసహ యాతి కౌముదీ, సహమేఘేన తడి త్ప్రలీ యతే, ప్రమదా పతివర్త్మగాఇతి, ప్రతిపన్నం హి విచేతనైరపి.

వెన్నెల చంద్రుని అంటిపెట్టుకొని ఉంటుంది; మేఘముతో కూడా మెరుపుతీగ అంతరిస్తుంది; ఉత్తమస్త్రీలు పాతివ్రత్యమును పరి పాలిస్తారని అచేతనవస్తువులుకూడా తెలుపుతున్నవి.

1120 శాకాయ వా స్యాత్ లవణాయ వాస్యాత్.

(దమ్మిడీ) కూరకయినా పనికివస్తుంది. ఉప్పుగల్లుకయినా పనికి వస్తుంది (అనిపేదవాడనుకొంటాడు.)

1121 శాఖాచంక్రమణ న్యాయము.

(కోతులు) కొమ్మమీదనుంచి కొమ్మమీదికి ఎగురునట్లు.

1122 శాఖాచంద్ర న్యాయము.

శుక్లద్వితీయచంద్రుని చూపుమని ఒకడు తన స్నేహితుని అడిగి నాడు. అప్పుడాస్నేహితుడు అతనిదృష్టిని ఒకప్రక్కకు మాత్రమే త్రిప్ప

డమునకు "అదిగో, ఆచెట్టుకొమ్మలలో విదియచంద్రుడున్నాడు" అని చూపినాడు. తరువాత, ఇతరనక్షత్రములనుంచి అతనిదృష్టిని మరల్చి డమునకు "అదిగో, ఆనక్షత్రములమధ్య ప్రకాశమానముగా ఉన్న వాడేచంద్రుడు" అనిచెప్పినాడు. అట్లే, బ్రహ్మమునుబోధించే అప్పుడు గురువు క్రమక్రమముగా శిష్యునిబుద్ధిని ఇతరనశ్యవస్తువులనుంచి మరల్చి బ్రహ్మముమీదనే బుద్ధి ఏకాగ్రముగా ఉండేటట్లు చేస్తాడు.

1123 శాబ్దీ హ్యాకాంక్షా శబ్దేనైవ పూర్యతే.

మాటకుమాత్రము కలిగినకోరిక మాటతోనే ఫలిస్తుంది.

1124 శామ్యే త్ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః.

దుర్జనుడు అపకారమువల్ల లొంగుతాడుగాని, ఉపకారమువల్ల లొంగడు.

1125 శిరశ్ఛేదేఽపిశతం న దదాతి వింశతిపంచకంతుప్రయచ్ఛతి శాకటికః.

బండివాడు "తలతరిగినా నూరురూపాయలివ్వను, ఐదుఇరవైలు ఇస్తాను." అంటాడు. మూర్ఖునికి ఏదోఒకటేపట్టు. దానిని విడువడు.

1126 శిరో నాస్తి శిరోవ్యథా.

తలయేలేకపోతే తలనొప్పి ఎక్కడనుంచివస్తుంది. (బుద్ధిలేకపోతే శాస్త్రవాదము చేయగలడా?)

1127 శిరోవేష్టనేన నాసికాస్పర్శన్యాయము.

చూ. ద్రవిడప్రాణాయామన్యాయము.

1128 శిష్యాపరాధే గురో ర్దండః.

శిష్యుడుతప్పుచేస్తే గురువుకుదండన.

1129 శీతకిరణ కరావలంబన న్యాయము.

చంద్రునికిరణములను పట్టుకొనప్రయత్నించినట్లు. శక్తికిమించిన పనిని చేసేటప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

1130 శీతలాపప్రస్తరన్యాయము

చలువరాతిని విగ్రహముగా చెక్కి పూజిస్తారు. దానినే తూనిక రాయిగాకూడా ఉపయోగిస్తారు. పూజ్యభావముగాని నిరసనభావము గాని భావనవల్లకలుగుతవి.

1131 శీర్షే సర్పో దేశాంతరే వైద్యః

తలమీద పాముఉన్నది. సర్పవైద్యుడు దూరదేశములో ఉన్నాడు. సమయమునకు సహాయముదొరకనప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

1132 శీలం హి విదుషాం ధనమ్

విద్వాంసులకు శీలమేధనము.

1133 శుక నలికా న్యాయము

శుకము, నలికము, అనేవి అస్త్రవిశేషములు. ఫిరంగులవలె ఉంటవి. అవిపైకిఅందముగా కనబడినా యుద్ధములో రథగజతురగములకు చాలాహానిచేస్తవి. అట్లే పైకిమంచివాడుగా కనబడినా, దుష్టుడు వెనుక నుండి హానిచేస్తాడు.

1134 శుద్ధోదలవణన్యాయము.

మంచినీళ్ళూఉప్పూ ఎట్లుబిన్నములో అట్లే జీవేశ్వరులుకూడా భిన్నులు. చూ. శకునిసూత్రన్యాయము, నదీసముద్రన్యాయము, చోరాపహార్యన్యాయము, పుంవిషయన్యాయము, నానావృక్షరసన్యాయము.

1135 శునఃపుచ్ఛమివానర్థం పాండిత్యం ధర్మవర్జితమ్.

ధర్మములేనిపాండిత్యము కుక్కతోకవలె నిరర్థకము.

1136 శుభస్య శీఘ్ర మశుభస్య కాలహరణమ్

మంచికార్యము చేయడమునకు త్వరపడవలెను. చెడుకార్యము చేయడమునకు కాలహరణముచేయువలెను.

1137 శుష్కవైరం వివాదంచ న కుర్యాత్ కేనచిత్ సహ

ఎవరితోనూ వృథాశతుత్వముకాని వృథావాదముగాని పెట్టుకొనకూడదు.

1138 శూకరవాటికాన్యాయము.

చక్కనిపువ్వులు, పండ్లుగలతోటలోనికి పంది ప్రవేశించి వాటి ననుభవించక అచ్చటి అమేధ్యమునే తింటుంది. అట్లే దుష్టుడు గుణములను గ్రహించక దోషములనే గ్రహిస్తాడు.

1139 శూరా హి ప్రణతిప్రియాః.

శూరులయినవారు అణకువగానే ఉంటారు.

1140 శూర్పన్యాయము.

చేట ఊకను తౌడును వేరుచేసి బియ్యమునుమాత్రము మిగుల్చినట్లు శిష్యుడు గురువుయొక్క సుగుణములనుమాత్రము గ్రహించి, ఆతని దోషములను విడిచిపెట్టును.

1141 శృంగగ్రాహికాన్యాయము.

ఆవులమందలోనికి పోయి ఇందులో నాఆవు యేది? అని ఆవుల కాపరిని అడుగుతే, వాడు ఆఆవును కొమ్ములతో పట్టుకొని చూపించేటట్లు, వస్తునిర్దేశముచేసేటప్పుడు దానిప్రధాన లక్షణమును నిరూపిస్తాము.

1142 శైలూషీన్యాయము.

నాటకములో వేషమువేసేస్త్రీ ఒక్కతేఅయినా, వివిధవేషములను ధరించి, వివిధపాత్రములుగా నటిస్తుంది. అట్లే, ఉపమ అనే అలంకారము ఒక్కటేఉన్నా, అనేకార్థభేదములచేత ప్రతిపాద్యనేక అలంకారభేదములుగా కనిపిస్తుంది.

1143 శ్మశానవైరాగ్యన్యాయము.

శ్మశానమునకు పీనుగను తీసుకొనిపోయి తగల బెట్టేవరకూ, "అయ్యో, ఈజీవనమనిత్యమే" అని వైరాగ్యము కలుగుతుంది. ఇంటికి రాగానే తిరిగి సంసారముమీద భ్రాంతి కలుగుతుంది. చూ. పురాణవైరాగ్యన్యాయము, ప్రసూతివైరాగ్యన్యాయము.

1144 శ్యామరక్తన్యాయము.

బట్టకు శ్యామలవర్ణముపోతే, ఎరుపురంగువస్తుంది. వస్తువులకు ఏదో ఒకగుణము అంటియే ఉంటుంది. గుణరహితమైన వస్తువుండదు.

1145 శ్యాలశునకన్యాయము.

ఒకడు తనభార్యకు కోపమురానడముకోసము ఒకకుక్కను పెంచి దానిని 'బావా' అనిపిలుస్తూ, కొట్టడము ఆరంభించినాడు. అతని భార్యకూడా ఆకుక్క తనతమ్ముడే అనుకొని దుఃఖించడానికి ఆరంభించినది. ఇట్లే, భ్రాంతిచేత 'ఇదినాది' అనుకొని దానికి హానికలిగినప్పుడు దుఃఖించడముకూడాను.

1146 శ్యేన కపోతీయన్యాయము.

డేగావచ్చింది, పావురమూ అక్కడనేవాలింది. డేగ పావురమునుచంపివేసినది. చూ. కాకతాలీయన్యాయము.

1147 శ్యేనాధికరణన్యాయము.

గ్రద్దను చేపలకు రాజుగా నియమించినట్లు (దుష్టునికి అధికారమివ్వడము.)

1148 శ్రద్ధామూలా భక్తిః.

శ్రద్ధఉన్న దేభక్తి.

1149 శ్రియం హి సతతోత్సాహీ దుర్బలోపి సమశ్నుతే.

బలహీనుడయినా నిరంతరప్రయత్నముచేత భాగ్యవంతుడవుతాడు.

1150 శ్రుతయౌగికలాభే సత్యనన్వితరూఢ్యార్థ స్త్యాజ్యః.

ఒకశబ్దమునకు ప్రసిద్ధమయిన యౌగికార్థమున్నప్పుడున్ను, దానికినరియైన రూఢ్యర్థములేనప్పుడున్ను, రూఢ్యర్థమును విడిచిపెట్టి, యౌగికార్థమునే గ్రహింపవలెను. "మండనుడు త్రాగుచున్నాడు" అన్నప్పుడు మండశబ్దమునకు మండపమనియు, సారాయమనియు, అని

ర్థాంతరముగా రెండర్థములున్నవి. అందుచేత, (త్రాగుచున్నాడు అనేక్రి) యతో అన్వయించుచున్నది గనుక, మండశబ్దమునకు సారాయి అనే యౌగికార్థమునే చెప్పుకోవలెను.

1151 శ్రుతానుమితయోః శ్రుతసంబంధో బలీయాన్.

శ్రుతి, అనుమానము, అనేవాటిలో శ్రుతిప్రమాణమే ఎక్కువ బలముగలది.

1152 శ్రేయాంసి బహువిఘ్నాని భవంతి మహతామపి.

గొప్పవారికికూడా శ్రేయస్సునకు అనేకవిఘ్నములుకలుగుతూ ఉంటవి.

1153 శ్వః కర్తవ్య మద్యైవ కురు.

రేపుచేయవలసినపనిని ఈదినముననే చేయుము.

1154 శ్వపిశునన్యాయము.

లోభి కుక్కవంటివాడు. లోభి అస్థిరత గలిగిఉంటాడు; కుక్కకూడా అస్థిరత (ఎముకలమీదప్రీతి) కలది. లోభి వక్రమయిన బాలధీ కలవాడు (చిన్నబుద్ధి, వక్రబుద్ధి)కలవాడు; కుక్కవక్రమయిన వాలముకలది; లోభికి జ్ఞాతివిరోధము హెచ్చు. కుక్కకూడా తక్కిన కుక్కలనుచూచి మొరుగుతుంది.

1155 శ్వపుచ్ఛోన్నామనన్యాయము.

కుక్కతోక పైకెత్తినట్లు. (నిష్ప్రయోజనమన్నమాట) చూ. ఊషరవృష్టిన్యాయము మొ||.

1156 శ్వశురగృహం పరమసుఖం, త్రిరాత్రాత్ శునకసమానః

మామగారిఇల్లు మంచిసుఖముగాఉంటుంది, మూడురాత్రులు దాటితే అల్లుడు కుక్కతోసమానుడవుతాడు.

1157 శ్వశుష్కాస్థి న్యాయము.

కుక్కఎండినఎముకనునాకినట్లు. దానినోటిలోనుండి రక్తముకారు

తూఉన్నా, అది ఆ ఎముకనువిడిచిపెట్టదు. అల్లేమూర్ఖుడు పనికి మాలి నవస్తువును పట్టుకొని విడిచిపెట్టడు.

1158 శ్వశ్రూనిర్గచ్ఛోక్తి న్యాయము.

ఇంటికివచ్చినబిచ్చగాడిని కోడలుపొమ్మంటూ ఉంటే, అత్తగారు కోడలితోకొట్లాడి, తానేస్వయముగా బిచ్చగాడిని పొమ్మన్నదట.

1159 శ్వానారోహే కుతః సౌఖ్యమ్.

కుక్కమీద స్వారిచేస్తే ఏమిసౌఖ్యముకలుగుతుంది?

1160 షట్కర్ణో భిద్యతే మంత్రః.

ఆరుచెవులలో (అనగా మూడోవానికి తెలుస్తే) పడితే రహస్యము బయలుపడుతుంది.

1161 షణ్ణాం రసానాం లవణం ప్రధానమ్.

ఆరురుచులలోను ఉప్పురుచి మొదటిది.

1162 షష్ఠాద్యన్యాయము

'ఆరింటిలోమొదటిది' అంటే ఏది మొదటిదో తెలియకపోతే దానిని నిర్దేశముచేయలేము.

1163 షాష్ఠ తిర్యగధికరణన్యాయము.

ఆరువంకలుగా చేసినసిద్ధాంతము. సరియైనసిద్ధాంతముకాదనుట.

1164 సకృదుచ్చరిత శ్శబ్దః సకృదేవార్థ మవగమయతి.

ఒకశబ్దమును ఉచ్చరించే ఉచ్చరించడములో దానిఅర్థమును కూడా తెలుపుతుంది. శబ్దమునకున్ను అర్థమునకున్ను అవినాభావసంబంధమున్నది.

1165 సక్తున్యాయము.

పేలపిండివలె. ముఖ్యమయినదానినివదలిపెట్టి తేలికఅయినపనులనుచేయడము.

1166 సంగగుణదోషన్యాయము.

గుణదోషములు సాంగత్యమువల్ల కలుగుతవి. నీరు కాలినఇనుు

మువీఁదపడి ఆవిరిఅయి నశిస్తుంది; తామరాకుమీఁద ఒక్కక్షణము నిలిచి ముత్యమువలెప్రకాశిస్తుంది. ముత్తెపుచిప్పలోపడి ముత్యమేఅవుతుంది.

1167 సచ్ఛిద్రఘటాంబున్యాయము.

కన్నము పడినకుండలోనినీటివలె. మీఁదినుంచి నీరుపోస్తూఉంటే క్రిందినుంచి నీరుకారిపోతూఉంటుంది. అల్లే ఖర్చుపెట్టేవాఁడు ఎంతసంపాదించినా ధనముకూడబెట్టలేఁడు.

1168 సంతముపతిష్ఠతే సాధుః.

మంచివాఁడు మంచివానితో స్నేహముచేస్తాఁడు.

1169 సంతః స్వయం పరహితే విహితాభియోగాః

సజ్జనులు స్వయముగా పరోపకారమునుచేస్తారు.

1170 సతి కుడ్యే చిత్రమ్.

గోడఉంటే చిత్రమువ్రాయవచ్చును. భార్యపోయిన వానిని ఓదార్చడమునకు ఈన్యాయము ఉపయోగిస్తారు.

1171 సత్యేన లోకాన్ జయతి.

సత్యమువల్ల లోకములను జయింపగలము.

1172 సత్రే భుక్తిర్మఠే నిద్రా.

సత్రములోభోజనము, మఠములోనిద్ర. (నిర్విచారపురుషుఁడు.)

1173 సత్సంగజాని నిధనాన్యపి తారయంతి.

సజ్జనసహవాసముచేత చావునుకూడా దాటవచ్చును.

1174 సందంశపతితన్యాయము.

పట్టుకారులో చిక్కుకొన్నట్లు. ఇటూ అటూ కదలలేకుండా వాదములో పట్టుపడినప్పుడు ఈన్యాయము పనికివస్తుంది.

1175 సందిగ్ధం సప్రయోజనం చ విచారమర్హతి.

ప్రయోజనముగలకార్యము సందిగ్ధావస్థలోఉంటే, దానినిగురిం

చి విచారము చేయవలసిఉంటుంది. తెలియని దానిని గురించిన్నీ, తెలిసినదానిని గురించిన్నీ, విచారముచేయనక్కరలేదు. సందిగ్ధముగాఉన్న దానిని గురించే విచారము ఆవశ్యకము.

1176 సందిగ్ధేషు వాక్యశేషాత్ -

సగముచదివినప్పుడు సందేహముకలుగుతే, మిగిలినదికూడా చదివితే సందేహము తీరిపోతుంది.

1177 సదసతోరుత్పత్తి నివృత్త్యసంభవేన పరస్పర విరోధే చ ప్రకారాంతర స్థితిః.

ఉన్నదానికి ఉత్పత్తిలేదు, లేనిదానికి నాశములేదు. గనుక, ఆ రెండింటికిని విరోధము కలిగినప్పుడు, మరిఒకస్థితి సంభవిస్తుంది.

1178 సద్భావార్ద్రః ఫలతి న చిరే ణోపకారో మహత్సు.

ఉపకారమనేవృక్షము సద్భావమనేనీటిచేత గొప్పవారియందు అచిరకాలములోనే ఫలిస్తుంది.

1179 సద్యో దదాతి చతురః సద్యోనాస్తీతి చతురతమః

వెంటనేఇచ్చేవాడు జాణ. ప్రస్తుతములేదనిచెప్పేవాడు అంతకంటెజాణ.

1180 సన్నియోగశిష్టానామన్యతరాపాయఉభయోరప్యపాయః

కలసి ఉన్న రెండువస్తువులలో ఒకదానికి అపాయము కలుగుతే రెండోదానికికూడా అపాయము కలుగుతుంది. "దేవదత్తుడు, యజ్ఞదత్తుడు, అనేవారిద్దరూ కలసి ఈపనినిచేయవలసినది" అనిచెప్పినప్పుడు, దేవదత్తుడు ఆపనినిచేయకపోతే యజ్ఞదత్తుడుకూడాచేయడు.

1181 సన్నిహితే బుద్ధి రంతరంగమ్.

రెండుశబ్దములు కలిసి ఉన్నప్పుడు అవి వాక్యములో దూరముగా ఉన్నప్పటికంటె ఎక్కువదగ్గరఅన్వయముకలిగిఉంటవి.

1182 సంప్రీతిభోజ్యాన్యన్నాని.

అన్నమును సంతోషముతో తినవలెను.

1183 సంబంధిశబ్దైర్వా తుల్యమేతద్.

అర్థమునుబట్టి శబ్దములసంబంధమును నిర్ణయింపవలెను. తల్లికి నమస్కరింపవలెను, తండ్రికిశుశ్రూషచేయవలెను, అనిచెప్పినప్పుడు ఎవనితల్లికివాడు నమస్కరింపవలెను. ఎవనితండ్రికివాడు శుశ్రూష చేయవలెను, అని సంబంధమువల్లనే తెలుస్తుంది, ప్రత్యేకముగాచెప్ప నక్కరలేదు.

1184 సంభవతి సామానాధికరణ్యే వైయధికరణ్యస్యా౽ న్యాయ్యత్వమ్.

ఏకాశ్రయముగల వస్తువులకు, అనేకాశ్రయత్వమును చెప్ప కూడదు.

1185 సంభవవ్యభిచారాభ్యాం స్యాద్విశేషణ మర్థవత్.

'కుండనీలముగాఉన్నది' అన్నప్పుడు నీలత్వమునీలికుండయందు వర్తిస్తుంది. పచ్చకుండయందు పట్టదు. అందుచేత 'కుండ' అనేదానికి నీలము అనే విశేషము అర్థవంత మవుతుంది.

1186 సంభవత్యేకవాక్యత్వే వాక్యభేదో హి నేష్యతే.

ఒకవాక్యములో అర్థము స్పష్టముగాఉన్నప్పుడు, దాని అర్థ మును తెలుపడమునకు మరిఒకవాక్యమును ఉదాహరింప నక్కరలేదు 'పశునా యజేత' అనేవాక్యములో యాగమును పశువుతో చేయవలెను, అనేచోట యజ్ఞములో ఒకపశువును వేయవలెను, అని అర్థముకాని ఒక్కపశువుతో ఒక్కయజ్ఞమును మాత్రమే చేయవలెననిఅర్థముకాదు.

1187 సమం స్యాదశ్రుతత్వాత్.

ప్రత్యేకముగా కొన్నివిధులనుగురించి చెప్పనప్పుడు, ఆవిశే షము ప్రతీవిధికిన్ని ప్రత్యేకముగా వర్తిస్తుంది. ఒకొక్కమంత్రము చెప్పి, ఒకొక్క ఆహుతి చేయవలెనని స్మృతి.

1188 సమాగమాః సాపగమాః.

ఒకదగ్గరచేరేవస్తువులు, ఎప్పటికయినా విడిపోవలసినవే. అట్లే, బంధుమిత్రకళత్రాదులు కూడాను.

1189 సమానశీలవ్యసనేషు సఖ్యమ్.

సమానస్వభావమున్ను, సమానవ్యసనములున్ను గలవారికి స్నేహము కలుగుతుంది.

1190 సమీపలక్షకశబ్దమంగీకృత్య తదర్థః క్రియతే.

ఒకశబ్దమునకు సరియైన అర్థమునుగురించి వివాదమున్నప్పుడు, దానికిదగ్గరగా ఉన్న అర్థమునుచెప్పవలెను. "రాహుదర్శనమువల్ల సర్వవర్ణములవారికిన్ని సూతకముకలుగును" అని స్మృతి. అయితే, రాహువనేవాడేలేడు. భూమియొక్క ఛాయకే రాహువనిపేరు, అని కొందరంటారు. అప్పుడు, సూర్యచంద్రగ్రహణకాలములందు అని అర్థముచెప్పుకోవలెను.

1191 సముదాయే వాక్యపరిసమాప్తిః.

మొత్తముమీదచెప్పిన అర్థము మొత్తమునకే చెందుతుంది గాని, దానిలో ప్రత్యేకభాగములకు చెందదు. "ఈగ్రామమువారినుండి వేయిరూపాయలు అపరాధము రాబెట్టవలెను" అంటే, మొత్తము మీద వేయిరూపాయలు రాబెట్టవలెనని అర్థముగాని, గ్రామములోని ఒక్కొక్కని వద్దనుండి రాబెట్టవలెనని అర్థముకాదు.

1192 సముద్రమాపః ప్రవిశంతి యద్వత్.

గంగా, నర్మదా, గోదావరీ, కృష్ణా, కావేరీ, సింధు, మొదలయినగొప్పనదులు, అనేకవిధములయిన వర్ణ, రస, గంధ గుణములు కలిగినవయినా, తెలుపు, ఎరుపు, నలుపు మొదలయిన వర్ణములను కలిగిఉన్నా, తీపి, ఉప్పు, మొదలయిన రుచులుకలిగిఉన్నా, సువాసన, దుర్వాసన మొదలయినవాసనలు కలిగిఉన్నా, తేలిక, బరువు, మొదలయిన గుణములుగల నీళ్ళను కలిగిఉన్నా, వేరువేరుపేళ్లనుకలిగిఉన్నా,

సముద్రములోనికిపోయి, తమప్రత్యేకగుణములనువిడిచి, అఖండానంత సముద్రములో లీనములయిపోయేటట్లు, ప్రత్యేకజీవాత్మలు తమతమ ప్రత్యేకగుణములను విడిచిపెట్టి, అఖండానంతపరబ్రహ్మములో తుదకు లీనములై పోవును.

1193 సముద్రవృష్టిన్యాయము.

సముద్రములోపడిన వర్షమువలె (నిష్ప్రయోజనమయినది.) చూ. ఊషరవృష్టి, జలతాడన, జలమంథన, శవోద్వర్తన, మృతమారణ, పిష్టపేషణ, అంధదర్పణ, శ్వపుచ్ఛోన్నామన, కాకదంతపరీక్షా, గర్దభరోమగణనా, అరణ్యరోదన, మూర్ఖసేవన, బధిరకర్ణజప, నహివివాహానంతరం వరపరీక్షా, కృతేకార్యే కింముహూర్తప్రశ్న, సుప్తడింభముఖచుంబనన్యాయములు.

1194 సమూహాలంబనన్యాయము.

ఒకవాక్యములో అనేకశబ్దములుండి, వాటిలో ప్రత్యేకశబ్దములకు అన్వయముకుదురకపోతే, శబ్దముల కన్నిటికిన్నీకలిపి అన్వయముకుదురుతుంది.

1195 సర్వ ఇమే స్వభూత్యర్థం ప్రవర్తంతే.

ప్రతీవారున్ను తమ అభివృద్ధికోసమే ప్రయత్నిస్తారు. చూ. సర్వః స్వార్థంసమీహతే; నను స్వార్థపరో లోకః.

1196 సర్వః కల్యే వయసి యతతే లబ్ధు మర్థాన్ కుటుంబీ.

సంసారి సరియైనవయస్సులోనే ధనమును సంపాదించప్రయత్నిస్తాడు.

1197 సర్వం కార్యం సకారణమ్.

కారణములేనిదీ కార్యముపుట్టదు. మట్టీ,కుమ్మరీ,లేనిదీకుండపుట్టదు. చిత్రకారుడులేనిదీ చిత్రముపుట్టదు. అట్లే, జగన్నిర్మాతయైన యీశ్వరుడులేనిదీ జగత్తుకలుగదు.

1198 సర్వం ఖలస్య చరితం మశకః కరోతి.

దోమసరిగా దుష్టునివలె సంచరిస్తుంది. దోమ దుష్టునివలెనే ముందరఉన్నప్పుడు కాళ్ళమీదపడి (కరుస్తుంది), వెనుకకుపోయి గట్టిగా పొడిచిరక్తముపీల్చుతుంది. చెవిదగ్గరచేరిచక్కగా సంగీతముపాడుతుంది. (ముక్కులోను, చెవులలోను) అవకాశముచూచుకొని చప్పునలోనికి ప్రవేశిస్తుంది.

1199 సర్వనాశే సముత్పన్నే హ్యర్థం త్యజతి పండితః
అర్థేన కురుతే కార్యం సర్వనాశో హి దుస్సహః
(అర్థనాశే సముత్పన్నే సర్వం త్యజతి దుర్మతిః.)

పండితుడయినవాడు తనసర్వధనమున్నూ పోబోయేటప్పుడు, దానిలో సగమునువదలిపెట్టుకొని, మిగిలినసగముతో కార్యముచేసుకొంటాడు. సర్వమున్ను నాశముచేసుకొనడము దుస్సహముకదా. (మూర్ఖుడు తనధనములో సగమునకునాశముకలుగునప్పుడు అంతటినీవదలుకొంటాడు.)

1200 సర్వం పదం హస్తిపదే నిమగ్నమ్.

చిన్నజంతువుల అడుగుజాడలు ఏనుగుకాలిజాడలో ఇమిడిఉన్నట్లు. పెద్దదానిలో చిన్నవస్తువుఇమిడిఉన్నప్పుడు ఈన్యాయమువర్తిస్తుంది.

1201 సర్వమేకం జగన్నాథే.

జగన్నాథములో అందరూ సమానమే (జాతిభేదములేదు.)

1202 సర్వం వాక్యం సావధారణమ్.

అవధారణము క్రియాన్వితము, విశేషణాన్వితము, విశేష్యాన్వితము, అని మూడువిధములు. ఉత్పలమునల్లగాఉండును, అనేవాక్యము క్రియాన్వితమయిన అవధారణమును కలిగిఉన్నది. శంఖము తెల్లనిది అన్నప్పుడు విశేషణాన్వితమయిన అవధారణముచెప్పబడినది. పార్థుడు మాత్రమేధనుర్ధరుడు అన్నప్పుడువిశేష్యాన్వితమయిన అవధారణము.

1203 సర్వం విశేషణం సావధారణమ్.

ఒకవస్తువునుగురించి ఒకవిశేషణముచెప్పినప్పుడు, అది అవిశేషణమాత్రమేకాని అంతకెక్కువలయిఉండదు. శంఖము తెల్లనిది అని చెప్పినప్పుడు అది మరియొకరంగుకలిగి ఉండదని చెప్పినట్లే.

1204 సర్వవేదాంత ప్రత్యయః.

సర్వవేదాంతములవల్లను ఒక్కపరబ్రహ్మమే తెలియబడుతుంది.

1205 సర్వశాఖాప్రత్యయ మేకంకర్మ.

ఆయాశాఖలవారు చేసేకర్మ భిన్నభిన్నముగా ఉన్నా, చేసేకర్మ మాత్రము ఒక్కటే. ఎట్లనగా సర్వవేదశాఖలవారున్ను అగ్నిహోత్రము భిన్నముకాకుండా చూచుకొంటారు. కాని, కొందరు 'ఉదితేజుహోతి' అని శ్రుతిని ఆశ్రయించి సూర్యోదయమయినతరువాతను మరికొందరు 'అనుదితేజుహోతి' అనేశ్రుతినాశ్రయించి సూర్యోదయముకాక ముందును అగ్నిహోత్రమును వేల్చుతారు. కాని, ఇద్దరుచేసేకర్మకూడాఒక్కటే.

1206 సర్వస్య ఖలు కులవిద్యా బహుమతా.

ప్రతీవారికిన్ని కులవిద్యమీద గౌరవముంటుంది.

1207 సర్వః స్వార్థం సమీహితే.

ప్రతీవాడున్ను తనలాభమునే కోరుతాడు. సర్వ ఇమేస్వభూత్యర్థం ప్రవర్తంతే, నను స్వార్థపరోలోకః.

1208 సర్వాపేక్షన్యాయము.

అనేకశబ్దములకు కలిపిచెప్పబడిన అర్థము, ప్రత్యేకశబ్దములకు అన్వయించదు. భోజనమునకు అనేకులను పిలిచి, అందులో ఒక్కడు ముందుగావస్తే, అందరూవచ్చేదాకా వాడు కూర్చోవలసినదేకాని, వానికి ప్రత్యేకముగా ముందుగా భోజనముపెట్టముగదా.

1209 సర్వారంభాహిదోషేణ ధూమేనాగ్నిరివావృతాః.

అగ్నిని పొగకప్పి ఉన్నట్లు సమస్తప్రయత్నములున్ను దోష ములచేత చుట్టుకొనబడి ఉన్నవి.

1210 సర్వేగుణాః కాంచనమాశ్రయంతి.

ధనవంతునే జనులు సద్గుణములు గలవాడని అంటారు. ధనము పోతేవాడు అధమగుణములుగలవాడని అంటారు.

1211 సర్వే జనాః కాంచనమాశ్రయంతి.

అందరూ ధనమునే ఆశ్రయించి ఉంటారు.

1212 సర్వే జనాః సుఖినోభవంతు.

సమస్తజనులూ సుఖముగా ఉందురుగాక.

1213 సర్వే వేదా యత్పద మామనంతి.

వేదములన్నీ బ్రహ్మజ్ఞానమునే ప్రతిపాదిస్తూఉన్నట్లు; ఒకఊరికి అనేకమార్గములున్నప్పుడు అన్నీ ఆఊరికేపోవును.

1214 సర్వోఽపి నవో వరో లజ్జాతురో భవతి.

క్రొత్త పెండ్లికొడుకుకు సిగ్గుహెచ్చు.

1215 సర్వో హి లోకో హ్రియతే ప్రియేణ.

లోకమంతా మంచిమాటకు లోబడుతుంది.

1216 సలిలభాస్కరన్యాయము.

నీటిలో సూర్యుడు ప్రతిఫలించి అనేకవిధములుగా ప్రకా శించేటట్లు, ఈశ్వరుడు అనేకశరీరములను ఆవేశించి, అనేకవిధములుగా కనబడుతాడు.

1217 సలిలాదగ్నిరుత్థితః.

నీటిలోఅగ్నిపుట్టినట్లు, స్నేహముగాఉండేవట్ల నిష్కారణకలహ ముపుట్టడము.

1218 సంవాదిభ్రమన్యాయము.

మణియొక్క కాంతియే మణిఅనుకొని ఆకాంతినిపట్టుకొనప్రయ త్నించి మణిని విడిచినట్లు చేసే భ్రమ సంవాదిభ్రమ.

1219 న విశేషణానాం వృత్తిర్న వృత్తస్య వా విశేషణం న ప్రియుజ్యతే.

విశేషణములను అపేక్షించే విశేష్యముతో ఆవిశేషణమేదో తెలియకపోతే, ఆవిశేష్యము అర్థరహితమవుతుంది.

1220 న విశేషేణ హి వర్తమానా విధినిషేధా సతి విశేష బాధే విశేషణ ముపసంక్రామతే.

ఇది తర్కశాస్త్రములోనిన్యాయము. విధినిషేధములు ఒకవిశేషమునుగురించి చెప్పబడినప్పుడు, ఆవిశేషమునకు బాధకలుగుతే, ఆ విధినిషేధములు దానివిశేషణమునకు సంబంధించుతవి. ఘటాకాశము నుతీసుకొనిరా, మణ్యాకాశమువద్దు, అనిచెప్పినప్పుడు ఘటాకాశమనే దానిని ప్రత్యేకముగాతీసికొనివచ్చుటకు వీలులేదుగనుక ఘటమును మాత్రమే తెచ్చినాడట. ఘటమునుతేగా, ఘటాకాశమును కూడా తెచ్చినట్లైఅయినది.

1221 సంశయాత్మా వినశ్యతి.

ఈపనిచేయగలనా, లేనా, అని సందేహిస్తూఉంటే, ఆపనిని చేయలేడు. ఆత్మవిశ్వాసముగలవాడు ఎంతటిపనినైనాచేయగలడు.

1222 సంసర్గజా దోషగుణా భవంతి.

మంచిగుణములయినా, చెడ్డగుణములయినా, సహవాసముచేత వస్తవి. నీరు కాలుతూఉన్న ఇనుము మీదపడి, పేరులేకుండానశిస్తుంది. అదేతామరాకుమీదపడి ముత్యమువలె ప్రకాశిస్తుంది. ముత్తెపుచిప్ప అసలుముత్యమేఅవుతుంది.

1223 సంసార సాగరే దుఃఖమ్.

సంసారసాగరములో దుఃఖముతప్పదు.

1224 సంసారే దుఃఖీ సన్న్యాసే సుఖీ.

సంసారములో ఉన్నవానికి దుఃఖమున్ను, సన్న్యసించినవానికి సుఖమున్ను కలుగుతుంది.

1225 స సుహృద్ వ్యసనే యః స్యాత్.

కష్టమునకయినవాడే స్నేహితుడు.

1226 సస్త్రీకో ధర్మమాచరేత్.

భార్యతోకలసి ధర్మమునాచరింపవలెను.

1227 సహచరితాసహచరితయోః సహచరితస్యైవగ్రహణమ్.

కలసిఉండేవస్తువులు, కలసిఉండని వస్తువులు, వీటిలోకలసిఉండే వస్తువులనే గ్రహించవలెను. (రామలక్ష్మణులు, అన్నప్పుడు రాముడు దశరథకుమారుడైన రాముడవుతాడుగాని పరశురాముడుగాని బలరాముడుగానికాడు. ఎందుచేతనంటే లక్ష్మణుడు దశరథరామునితోనే ఉంటాడుగనుక.

1228 సహవాసతః పుణ్యగుణాభవంతి.

సహవాసతః దోషగుణాభవంతి.

సహవాసమువల్లనే మంచిగుణములుకాని, చెడుగుణములుగాని కలుగుతవి.

1229 సహసా విదధీత న క్రియామ్.

ఏపనిన్ని తొందరపడి చేయకూడదు.

1230 సాక్షాత్ప్రకృతౌ వికారలయః.

కుండపగిలినప్పుడు దాని పరమాణువులకు నష్టముకాలేదు. అట్లే ప్రకృతిలో ఆయావికారములు లయములగుచుగాని, ప్రకృతిమాత్రము నిత్యముగానే ఉంటుంది.

1231 సాధనానుష్ఠానతంత్రా హి సాధ్యసంసిద్ధిః.

ఒకపనిని నిర్వహించడమునకు తగినసాధనముల నుపయోగింపవలెను. బ్రహ్మానందప్రాప్తికి నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థఫలభోగవిరాగము, శమదమాదిష్కటసంపత్తి, ముముక్షుత్వము, అనే సాధనములుండవలెను.

1232 సాపేక్ష మసమర్థవత్.

శబ్దార్థమునకు మరిఒకశబ్దముకావలసిఉండగా, ఆ అపేక్షితశబ్ద మును చెప్పకపోతే, మొదటిదానికి అర్థముండదు.

1233 సామర్థ్యయోగన్యాయము.

సామర్థ్యమువల్ల పనులు సిద్ధిస్తవి. స్వతంత్రుడై శక్తి గలిగినవాడు తనయిష్టమువచ్చిన పనిని చేయగలడు.

1234 సామాన్య వాక్యస్య విశేషవాక్యానురోధాద్విశేష పర్యవసానమ్.

సామాన్యవాక్యము వెంట విశేషవాక్యముకూడా ఉంటే, విశేష వాక్యమునకే ప్రాబల్యము. ఈపనిని చేయవలెను, ఈవిధముగా చేయ వలెను, అన్నప్పుడు విశేషముగా చెప్పినవిధముగానే చేయవలెనని యభిప్రాయము.

1235 సామాన్యాతిదేశే విశేషానాతిదేశః.

ఒకవిషయమును ఒకవ్యక్తియందు ఆరోపించినప్పుడు, ఆవిశేష ణము ఇతరవ్యక్తులకు కూడా అన్వయించకూడదు. "ఈక్షత్రియుని యెడల బ్రాహ్మణునియందువలెనే సంచరింపవలెను" అన్నప్పుడు ఇతర క్షత్రియులయెడలను అట్లే సంచరింపవలెనని అర్థముకాదు.

1236 సామృతైః పాణిభిర్ఘ్నంతి గురవో న విషోక్షితైః
లాలనాశ్రయిణో దోషా స్తాడనాశ్రయిణో గుణాః.

గురువులు అమృతహస్తములతో శిక్షిస్తారు. విషముపూసిన చేతులతో కొట్టరు. శిష్యునిలాలించుతే దోషములుఅబ్బుతవి, శిక్షిస్తే గుణములు అబ్బుతవి.

1237 సారల్యం సత్తమో మార్గః.

సరళబుద్ధి కలిగిఉండడమే అన్నిటికంటె మంచిమార్గము.

1238 సారల్యం సరలే కుర్యాత్, శఠే శాఠ్యం సమాచరేత్.

సరళముగాపోయేవానితో సరలముగా ప్రవర్తించవలెను. దుష్టునితో దుష్టముగా ప్రవర్తించవలెను.

1239 సార్వజనీన స్తుల్యాయవ్యయః.

అనేకమందిని సేవించేవారికి ఆయమూ ఉండదు. వ్యయమూ ఉండదు. (చూ. సుతజన్మమృతి న్యాయము.)

1240 సావకాశ నిరవకాశయో ర్నిరవకాశో బలీయాన్.

ఒకవిధిని ఎల్లప్పుడూ చేయవలెను, ఒకవిధిని కొన్ని సమయములందు మాత్రమే చేయవలెను, అనేవాటిలో ఎల్లప్పుడూ ఆచరింపవలసినవిధి బలవంతమైనది. "మాహింస్యాత్సర్వభూతాని" ఏభూతమును హింసించకూడదు, అనేవిధి నిరవకాశమయినది. "శ్వేతమాలభేత" యజ్ఞపశువుగా తెల్లనిమేకను తేవలెను. అనేవిధి సావకాశమైనది. అంటే, యజ్ఞకాలమందే ఆవిధివర్తిస్తుంది. అందుచేత జీవహింస కూడదు అనే విధి బలవంత మైనది.

1241 సిద్ధమన్నం పరిత్యజ్య భిక్షామటతి దుర్మతిః.

తెలివితక్కువవాడు సిద్ధముగాఉన్న అన్నమువదలిపెట్టి, బిచ్చమెత్తుకొంటాడు.

1242 సిద్ధమవయుత్యానువాదః.

సముదాయమునుంచి, ఒక అవయవమును వేరుచేయడమునకు అవయుత్యానువాదమని పేరు. అట్లుచేయుటయే సులభసాధ్యము.

1243 సింహమృగన్యాయము.

సింహములకున్ను, లేడికిన్ని, ఎడతెగని వైరము. చూ. అహినకులన్యాయము.

1244 సింహ మేష న్యాయము.

ఒకగొల్లవాడు ఒకసింహపుపిల్లను పట్టుకొని, తనగొఱ్ఱెలతోకూడా పెంచుతున్నాడు. ఆసింహపుపిల్ల గొఱ్ఱెలతోకలసి, వాటిమోస్తరు

గానే సంచరిస్తూపెద్దదయిన తరువాతకూడా, తానుగొఱ్ఱెకాదని తెలుసుకోలేక, ఒకరీతిగొఱ్ఱెననుకొని, వాటివలె గడ్డిని, ఆకులుతిని జీవిస్తున్నది. అట్లే, అజ్ఞానముచేత ఆత్మ తాను దేహమునే అని అనుకొంటుంది.

1245 సింహావలోకనన్యాయము.

సింహము ఒకమృగమునుచంపి, ముందుకుపోయి, తిరిగీవెనుకకుచూచి, మరొకమృగము కనబడితే, మళ్ళీవెనుకకుపోయి, దానినికూడా చంపివేస్తుంది. అట్లే, ఒకసిద్ధాంతమును చేసేవాడు తనబుద్ధికి తోచినయుక్తులన్నీచెప్పి, తుదకు తనప్రతిపక్షిచెప్పే ఇతరప్రతియుక్తులనుకూడా ఖండించడమునకు, ఉత్తరగ్రంథమును ఆరంభిస్తాడు.

1246 సింహీ క్షీరన్యాయము.

సింహముపాలు బంగారుగిన్నెలోమాత్రమే విరిగిపోకుండాఉంటవి. అట్లే, గురూపదేశము శమాదిసాధనసంపన్నుడైన సచ్ఛిష్యునియందేఫలిస్తుంది.

1247 సుఖం హి దుఃఖాన్యనుభూయ శోభతే.

దుఃఖము లనుభవించినతరువాత కలిగినసుఖము ఎక్కువసుఖముగాకనబడుతుంది.

1248 సుగుణో నిర్గుణో వాఽపి సహాయోబలవత్తరః

గుణవంతుడుకానీ, గుణహీనుడుకానీ, సహాయుడుండుటేఎక్కువబలము.

1249 సుతజన్మ మృతిన్యాయము.

ఒకడు ఒకదేవతనారాధించి ఒకకొడుకునుపొందినాడు. తరువాత మరొకదేవుని ఆరాధిస్తే ఆదేవుడు మరొకకొడుకునిచ్చినాడు. ఇందువల్ల మొదటిదేవుకినికోపమువచ్చి తానిచ్చినకొడుకును చంపివేసినాడట. ఎవరో ఒకరిని నమ్ముకొనిఉండవలెనని దీనిఅభిప్రాయము

1250 సుందోపసుందన్యాయము

సుందోపసుందులనే ఇద్దరురాక్షసులుండేవారు. వారుఅన్నదమ్ము లు. వారు అన్యోన్యప్రేమతో ఉండి, లోకులను హింసిస్తూఉండేవారు. వారినిచంపడమునకు దేవతలు తిలోత్తమఅనే అప్సరసనుపంపించగా, దానికోసము వారిద్దరూ జగడమాడి ఒకరినొకరుచంపుకొన్నారు.

ఇతరసమయాలలో అన్యోన్యముగా ఉన్నా, ఇద్దరికీ ఒకటేవస్తు వుకావలసివచ్చినప్పుడుమాత్రము ఆస్నేహము ఎందుకూపనికిరాదు.

1251 సుప్తడింభముఖచుంబన న్యాయము.

పరుండిఉన్న శిశువు మొగమును ముద్దుపెట్టుకొన్నట్లు (నిష్ప్ర యోజనమన్నమాట.) చూ. ఊషరవృష్టిన్యాయము, మొ.

1252 సుపేటికాస్థాపనన్యాయము.

తమకున్నమంచివస్తువులను ప్రాతపెట్టెలలోనుంచితీసి, క్రొత్త పెట్టెలోఉంచుకొన్నట్లు, ప్రాజ్ఞులుతమబుద్ధిని ఈశ్వరునియందు స్థాపించు కొంటారు.

1253 సుప్తప్రబుద్ధ న్యాయము.

నిద్రపోయిమేల్కొన్నట్లు. నిద్రిస్తూఉన్నప్పుడు అంతకు పూర్వ మున్న జ్ఞానమువిస్మృతమయినా, మేల్కొనగానే పూర్వజ్ఞానముకలు గుతుంది. అట్లే, ఆత్మ అజ్ఞానములో ఉన్నంతకాలమూ తన్నుతాను మరచిఉన్నా, ఆ అజ్ఞానముపోగానే నిజతత్త్వమును తెలుసుకొంటుంది.

1254 సుభగాబాలోదితాఖ్యాయికా న్యాయము.

దాది బాలునికి చెప్పినకథవలె. ఒకదాది ఈక్రిందికథను చిన్నపిల్ల వానికిచెప్పుతున్నది. "అనగా అనగా ముగ్గురు రాజకుమారులుండే వారు. అందులో ఇద్దరుపుట్టలేదు. మూడోవాడు తల్లికడుపులోనే ఉన్నాడు. వారుధర్మాత్ములై ఉత్తుత్తిపట్టణములో ఆయుకొంటూఉండే వారు. వారుముగ్గురూ తమఉత్తుత్తిపట్టణమును వదలి వేటకు పోతూ దారిలో ఆకాశముమీద పండ్లతోవంగిఉన్నచెట్లనుచూచినారు. వారు

అచ్చటికిపోయి భవిష్యన్నగరమును ప్రవేశించి, ఇప్పటికికూడా వేటా డుతూ ఉన్నారు" అని. పిల్లవాడు ఊఁకొట్టుతూ, కథనిజమనుకొని వింటున్నాడు. అట్లే ఈఉత్పత్తి సంసారము నిజమనుకొని, విచారము చేయక, మనముప్రవర్తిస్తూఉంటాము.

1255 సుభగాభిక్షున్యాయము.

షోకుగానూడఉండవలెను, సన్యాసికూడాకావలెను. రెండువిరుద్ధ ధర్మములు ఏకవస్తువునందు ఏకకాలమున సిద్ధింపవు అనుట.

1256 సువర్ణన్యాయము.

బంగారమును సుత్తెతోకొట్టి సాగదీసి ముక్కలుచేసి కాల్చుతూ ఉన్న కొద్దీ దానికివన్నెవస్తుంది. అట్లే, శాస్త్రమునుగురించి మననము చేస్తూ ప్రశ్నలుచేస్తూ విచారిస్తూ ఉన్నకొద్దీ రేణుకువస్తూఉంటుంది.

1257 సూచీకటాహన్యాయము.

కమ్మరివానివద్దకు ఒకడుపోయి 'నాకుఒక పెద్ద అండానుచేయుము, అనిచెప్పినాడు. ఆవెంటనే మరిఒకడుపోయి "నాకొక సూదిచేసిఇయ్యి" అని అడిగితే కమ్మరి అండాను చేయడమునకు ఆరంభించక సూదినే మొదటచేస్తాడు. సులభమైనపనిని వదలిపెట్టి కష్టమయినదానిలోనికి ఎవ్వరూదిగరు.

1258 సుచీముఖన్యాయము.

చలికాలములో కొన్ని కోతులు చలిచేతవణకుతూ, గురివింద గింజలు అగ్నికణములనుకొని వాటినిప్రోగుచేసి చుట్టూకూర్చున్నవి. కాని, వాటికి చలిపోలేదు. మిక్కిలివణకుతూఉన్నవి. అప్పుడు, సూచీ ముఖమనే ఒకపక్షివాటినిచూచినవ్వి, "ఓమూర్ఖులారా, అవి అగ్ని కణములుకావు, గురివిందగింజలు. గాలిలేని ఒకగుహాలోనికిపొండి" అన్నది. దానిని ఒకముసలికోతివిని, "నీకు మాఊసు ఎందుకు, నీదారిని నీవుపో" అన్నది. ఆసూచీముఖము ఊరుకోక తిరిగీ అట్లేఅన్నది. దాని

మీాద ఒకకోతికికోపమువచ్చి, దానిరెక్కలుపట్టుకొని నులిమి చంపివేసి నది. అక్కరలేని ఊసులలోనికి పోకూడదు.

1259 సూచీ ముఖీన్యాయము.

చూ. సూచీముఖన్యాయము.

1260 సూత్ర శాటికా న్యాయము.

ఒకడు ఒకనేతగానివద్దకుపోయి "ఈనూలుతో బట్టనునేయుము" అనిచెప్పినాడు. ఆనేతగాడు, "బట్టనునేయడమేమిటి? నేసినతరువాతగదా బట్టఅవుతుంది? అందుచేత నూలుమంమగాని, బట్టముందుకాదు. నూలును ఉపయోగించి బట్టఅయేటట్టు చేయుమని ఈతని అభిప్రాయ మైఉంటుంది" అని తర్కించుకొన్నాడు.

1261 సూర్యాస్త న్యాయము.

సూర్యుడస్తమించగానే జారదోరాములు బయలుదేరేటట్లు, రాజుమృతినొందగా నేశత్రువులుబయలుదేరుతారు.

1262 సేవకాన్నం పురాతనమ్.

ప్రాతసేవకునికి ప్రాచినఅన్నము.

1263 సైంధవోదకన్యాయము.

సముద్రములోని ఉదకమువలె. సముద్రోదకము సూర్యకిరణ ములచేత ఆవిరిఅయి మేఘరూపమునుపొంది, వర్షించి, నదులద్వారా తిరిగీసముద్రములోనేకలుస్తుంది. అట్లే, పరమాత్మ ఉపాధిభేదముచేత వివిధజీవాత్మలుగా కనిపించి, తుదకు పరమాత్మలోనే కలుస్తుంది.

1264 సోపానావరోహన్యాయము.

మేడమెట్లను ఒకదానితరువాత మరిఒకదానిమీాదుగా ఎట్లు ఎక్కుతామో మేడమీాదినుంచి దిగినప్పుడుకూడా ఒకమెట్టుతరువాత మరియొక మెట్టుదిగుతూ క్రిందికిరావలెను. అట్లే బ్రహ్మమనేపదా ర్థమును తెలుసుకొనడమునకు దానిలోఅంతర్భూతములయిన ఇతర విషయములను క్రమక్రమముగా విభజించి తెలుసుకోవలెను.

1265 సోపానారోహన్యాయము.

మేడమీదికివెక్కేవాడు ఒక్కసారిగా మీదికివెగిరిపోలేడు. మేడ మెట్లను ఒకదానితరువాతమరొకదానిమీదికిపోతూ తుట్టతుదకు మేడ మీదికిపోతాడు. అట్లే, బ్రహ్మజ్ఞానముపొందగోరేవాడు క్రమక్రమముగాసాధనచేసి అజ్ఞానమును క్రమేణవదలిపెట్టి తుదకు బ్రహ్మమును తెలుసుకొంటాడు. (చూ. భిక్షుపాదప్రసరణన్యాయము.)

1266 సైషా మహతో వంశస్తంబాల్లట్వా౽నుకృష్యతే.

ఊరబిచ్చుకను పెద్దవెదురుతోకొట్టినట్లు (చిన్నపనిచేయుటకు పెద్దప్రయత్నముచేయడము.) పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమని తెనుగు సామెత.

1267 స్తనంధయన్యాయము.

పాలుకుడిపి పరుండబెట్టినశిశువు మెత్తనిపక్కమీదనిద్రపోతూ జ్ఞానరహితుడేలయినా, సుఖమూర్తివలెకనిపిస్తాడు. అట్లే, బ్రహ్మానందతత్పరుడైనవాడుకూడాను.

1268 స్తుత్యే బలే తు బలవాన్ పరికోప మేతి.

బలవంతుడు బలవంతునిమీదనే విక్రమముచూపిస్తాడు.

1269 స్థవిరలగుడన్యాయము.

ముసలివాడు చేతితోవిసరినకఱ్ఱ గురితప్పిపోయేటట్లు, (సరిగా ప్రయోగించనిశబ్దము అనుకొన్న అర్థమునివ్వదు.)

1270 స్థాన స్థితః కాపురుషో౽పి సింహః.

తనస్థానములోఉన్న బలహీనుడు కూడా సింహమవుతాడు. (స్థానబలముగాని తనబల్మికాదయా.)

1271 స్థాలీపులాకన్యాయము.

అన్నము ఉడికినదోలేదో తెలుసుకొనడమునకు గిన్నెలోని ఒక మెతుకు పట్టుకొనిచూస్తే చాలును. అట్లే, ఒకడు పండితుడోకాడో తెలుసుకొనడమునకు ఒక్కప్రశ్నకిచ్చిన ప్రత్యుత్తరమే చాలును.

1272 స్థావరజంగమ విషన్యాయము.

నాభి మొదలయిన స్థావరవిషములున్ను, సర్పములు మొదలగు వాటి జంగమవిషములున్ను, ఇతర విషముల చేత విరుగుడుపొందును. అట్లే, శుక్తిలో రజతమున్న దనేభ్రాంతి, జ్ఞానముచేత నిరస్తమవుతుంది.

1273 స్థితస్యగతిశ్చింతనీయా.

పోయినదానికోసమువిచారించక, ఉన్నదానినిచూచుకోవలెను.

1274 స్థూణానిఖనన న్యాయము.

ఒకకఱ్ఱస్తంభమును భూమిలో పాతేటప్పుడు దానిని ఇటూ అటూ గుంజి స్థాపిస్తే దృఢముగా నిలుస్తుంది. అట్లే, శిష్యునికి గురువు పదిసార్లు పాఠముచెప్తూఉంటే, అది దృఢముగా నాటుకపోతుంది.

1275 స్థూలాత్ సూక్ష్మం జ్యాయః.

స్థూలమైనదానికంటె సూక్ష్మమయినదిమేలు. మొద్దుబుద్ధికంటే, సూక్ష్మబుద్ధి ఉత్తమమైనది గదా.

1276 స్నిగ్ధజన సంవిభక్తం దుఃఖం సహ్యావేదనం భవతి.

స్నేహితులతో పంచుకొన్న దుఃఖవేదనను సహించుకోవచ్చును.

1277 స్నిగ్ధోజనో న ఖలు చింతయతే స్వపీడామ్.

స్నేహితులుగలవాడు తన బాధనుగురించి ఆలోచించడు.

1278 స్నేహదీపన్యాయము.

చమురులేకపోతే దీపమారిపోయినట్లు (ధనములేకపోతే, గొప్ప కూడాపోతుంది.) చూ. వాతప్రదీపన్యాయము, జ్ఞానమజ్ఞానస్యైవ నివర్తకమ్.

1279 స్నేహాత్మక స్తంతు రంతర్మర్మాణి సీవ్యతి.

స్నేహమనేదారము మనస్సులోకలిగే ఛిద్రములను కుట్టుతుంది.

1280 స్నేహే చ బంధు ర్న కదాఽపి దూరః.

స్నేహముంటే, స్నేహితుడు దూరముగా ఉన్నా దూరమని పించదు.

1281 స్ఫటిక లౌహిత్యన్యాయము.

స్ఫటికశిలమీద మోదుగుపువ్వునుంచితే ఎఱ్ఱగాకనబడుతుంది. ఆపువ్వును తీసివేస్తే యథాప్రకారముగాఉంటుంది. అట్లే, ఆత్మకు దేహముతో సంబంధముకలుగుతే త్రిగుణాత్మకమవుతుంది. ఆసంబంధము పోతే నిర్గుణముగాప్రకాశిస్తుంది.

1282 స్యాలకో గృహనాశాయ సర్వనాశాయ మాతులః.

బావమరది ఇంటినిపాడుచేస్తాడు, మామఉన్నదంతాపాడు చేస్తాడు.

1283 స్రజమపి శిర స్యంధః క్షిప్తాం ధునోత్యహిశంకయా.

గుడ్డివానిమెడలో పూవులదండవేస్తే, పామనుకొనిపారవేస్తాడు.

1284 స్వకరకుచన్యాయము.

తనచేతులతో తనచన్నులనే పిసుకుకోవడము. అనగాసుఖావహముకానిపనినిచేయడము.

1285 స్వకార్యధురంధరాః స్వామికార్యవంచకాః.

తమకార్యములనుచూచుకొనేవారు స్వామికార్యములలోవంచనచేస్తారు.

1286 స్వజాతి ర్దురతిక్రమా.

ఎవ్వడూతనజాతిని విడిచిపెట్టలేడు. ఒకమునీశ్వరుడుఅర్ఘ్యమిస్తూ ఉండగా, అతనిదోసిటిలో ఒకఎలుకపిల్లపడినది. ఆమునిదానినిచూచి, కనికరించి, దానినొకమనుష్యకన్యగామార్చి, పెంచుటకు తనభార్యకు ఒప్పగించినాడు ఆకన్యయౌవనవతికాగా, దానికి పెండ్లిచేయుడమునకు సూర్యుడిని, మేఘుడిని, వాయుదేవుడిని, పర్వతమును, పిలిచి, వీరిలో ఒకరినివరించుకో అని ఆమెతోచెప్పినాడు. ఆకన్యసూర్యుడువేడిగా

ఉన్నాడనీ, మేఘుడునల్లగా ఉన్నాడనీ, వాయుదేవుడుచపలుడనీ, పర్వత ముకఠినమైనదనీచెప్పి వారినెవ్వరినీఒల్లలేదు. అప్పుడు ముని ఒకఎలుక నుతీసుకొనివచ్చి, దీనినిపెండ్లాడుతావా? అని అడిగినాడు. "మహాప్రభో, ఈఎలుకనుపెండ్లాడవలెననిఉన్నది. నన్నుపూర్వమువలె ఎలుకనుచేయు ము" అన్నది. మునిదానిని ఎలుకగామార్చివేసినాడు.

1287 స్వత ఏవ సతాం పరార్థతా గ్రహణానాం హి యథా యథార్థతా.

గ్రహణములనగా ఇంద్రియములు. ఇంద్రియములు తమతమకు నియతములయిన విషయములను యథార్థముగా ఎట్లు గ్రహిస్తవో అట్లే, మంచివారు స్వభావముచేతనే ఇతరులకు మేలుచేస్తారు.

1288 స్వప్న వ్యాఘ్రన్యాయము.

కలలోకనబడిన పెద్దపులి కలలోనే భయపెట్టి, కలతోనేమాయ మవుతుంది.

1289 స్వప్నే నృపః

స్వప్నములో మనుష్యుడు తానురాజయినట్టూ, రాజ్యభోగ ములనుభవించినట్టూ, శత్రువుతోయుద్ధముచేసి ఓడిపోయి అడవులలో తిరిగినట్టూ, ఏమేమోఅనుకొంటాడు. మేల్కొనగానే, యథాప్రకార ముగాఉంటాడు. అట్లే, జీవాత్మసంసారములోపడి సంచరిస్తుంది. జ్ఞాన మునుపొంది, జగత్తంతాస్వప్నమువంటిదని తెలుసుకొంటుంది.

1290 స్వప్రకాశాశ్రయన్యాయము.

సూర్యునికిన్ని ఆతనితేజస్సుకున్ను భేదములేదు. తేజస్సుసూ ర్యునాశ్రయించుకొనియేఉన్నది. ఆతేజస్సువల్లనే సూర్యుడుమనకుకన బడుతున్నాడు. సూర్యునికిన్ని అతనితేజస్సునకున్ను అభేదమయినా, తేజస్సువల్ల సూర్యుడుకనబడడములో ఆరెండింటికిన్ని భేదముకలుగుతు న్నది. అట్లే, నిర్గుణసగుణబ్రహ్మములవిషయములోకూడాను.

1291 స్వభావసిద్ధన్యాయము.

వస్తువులు తమస్వాభావికగుణములను విడిచిపెట్టవు. గంధపుచెక్కనుఎంతఅరుగదీస్తే అంతసువాసన నిస్తుంది. చెఱుకును ఎంతగట్టిగా నమలితే అంతతీపికలిగిఉంటుంది. బంగారము ఎంతకాల్చితే అంతవన్నె కెక్కుతుంది. అట్లే, ఉత్తములయినవారు ప్రాణముమీదికివచ్చినా తమ సద్గుణములను విడిచిపెట్టరు.

1292 స్వభావో దురతిక్రమః.

స్వభావమును అతిక్రమించడమునకు సాధ్యముకాదు.

1293 స్వభావో మూర్ధ్ని వర్తతే.

తరువాత సంపాదించుకొన్న విద్యకంటె స్వభావము ఎక్కువ బలముకలిగిఉంటుంది.

1294 స్వయం తీర్ణః పరాన్ స్తారయతి.

తాను నదినిదాటగలిగినవాడు, ఇతరులనుకూడా దాటించగలడు. అట్లే, గురువు బాగుగాచదువుకొన్నవాడయితే, శిష్యులనుకూడా పండితులనేటట్లుచేయగలడు.

1295 స్వయమశక్తః కథం పరాన్ సాధయిష్యతి.

తనపనిని తానేసాధించుకొనలేనివాడు ఇతరులనెట్లు సాధించగలడు?

1296 స్వస్థే చిత్తే వృత్తయః సంస్ఫురంతి.

మనస్సు స్వస్థముగాఉంటే, జీవనము సుఖముగాగడుస్తుంది.

1297 స్వాంగం స్వవ్యవధాయకం న భవతి.

తనశరీరము తనమార్గమునకు అడ్డమురాదు.

1298 స్వాంగుష్ఠమపి చుంబంతే మిత్తూనండ మయాచత.

తనవ్రేలిని నమలుకొంటూఉన్నవానిని చెఱుకుకఱ్ఱయిమ్మనిఅడిగినట్లు. శ్రౌతస్మార్తసనాతనధర్మములు తెలియకవర్ణాశ్రమభ్రష్టులయిన

మూర్ఖజనులు తమతమకు ఇష్టమయిన కృతిమాచార్యులవద్దకుపోయి, తమతమపనులనుచేయించుకొని, తమకోరికలను పొందుతూఉన్నప్పుడు ఈన్యాయమును ఉపయోగిస్తారు.

1299 స్వామిభృత్యాదిన్యాయము.

భృత్యులు తమయజమానుని ఆస్తిని తమప్రయోజనముకోసము ఉపయోగింపకోరుతూఉంటారు.

1300 హలాంతం బ్రహ్మవర్చసమ్.

"రాజ్యశ్రీర్బ్రహ్మపాంతా, హలాంతం బ్రహ్మవర్చసమ్,
ఆచారో ఘోషవాసాంతః, కులస్యాంతం స్త్రియశ్చలాః."

ఈ శ్లోకము శ్రీమద్భాగవతము, తృతీయస్కంధము, నవమాధ్యాయములోనిది. బ్రాహ్మణశాపముపోగానే రాజునకు రాజ్యలక్ష్మి కలుగుతుంది. దుక్కిముచ్చుతనమును విడిచిపెట్టితే బ్రహ్మవర్చస్సు కలుగనారంభిస్తుంది. బోయపల్లెనువిడిచిపుట్టితే ఆచారము సాగుతుంది. స్త్రీ చంచలవృత్తి కలిగిఉంటే కులమునశిస్తుంది.

1301 హంసకాకన్యాయము.

మూఢులు ఏనుగులమీదా, గుఱ్ఱాలమీదాపోతారు. గుణవంతులయిన పండితులు కాలినడకనేపోతారు. కాకులన్నీ కొండకొనను పంక్తులుతీరికూర్చున్నా, ఇసుకతిప్పలపైతిరుగు రాజహంసలతోసరిరావు. లేదా, పంజరములలో హంసనూ, కాకినీ ఉంచుతే, కాకికి హంసకున్న గౌరవము రాదు.

1302 హంసబకన్యాయము.

ఒకహంసకును, కొన్నికొంగలకును, ఈక్రిందిసంభాషణము జరిగినది.

"కస్త్వమ్ లోహితలోచనాస్యచరణో," "హంసః" "కుతః?"
"మానసాత్"; "కింతత్రాస్తి?" "సువర్ణపంకజవనం, నీరంసదా
నిర్మలమ్। రత్నానాం నిచయాః, సువర్ణలతికాః, వైడూర్యరో

హాః క్వచిత్। మండూకా అపి తత్రసంతి," స బకై రాకర్ణ్య
హీ హీంకృతమ్.

"కళ్ళు, మొగము, కాళ్ళు, ఎఱ్ఱగాఉన్న నీవెవరవు?" "హంస
ను," "ఎక్కడనుంచివస్తున్నావు?" "మానససరోవరమునుంచి," "అక్కడ
ఏమున్నది?" "బంగారుపద్మములవనము, ఎప్పుడూనిర్మలముగాఉండే
నీరు, రత్నసమూహములు, బంగారుతీగలు, వైడూర్యవృక్షములు,
ఉన్నవి. కొన్నికప్పలు కూడాఉన్నవి." ఈమాటలను కొంగలు వినకుం
డానే 'హీ, హీ,' అనినవ్వినవి.

పై న్యాయమే ఈక్రిందిశ్లోకములో ఇమిడిఉన్నది.

హంసః శ్వేతో బకః శ్వేతః కో భేదో బకహంసయోః
క్షీరనీరపృథక్కారే హంసోహంసో బకోబకః.

హంస తెల్లగాఉంటుంది. కొంగకూడా తెల్లగానేఉంటుంది. అయితే హంసకున్న కొంగకున్న భేదమేమిటి? పాలను నీటిని ఏర్పాటుచేయడములో హంస హంసే, కొంగకొంగే.

1303 హసద్భిః క్రియతే కర్మ రుదద్భిరనుభూయతే.

ఒకడునవ్వుతూ ఒకచెడుకార్యముచేస్తే, మరిఒకడుదానిని ఏడుస్తూ అనుభవిస్తాడు.

1304 హస్తామలకన్యాయము.

చేతిలోని ఉసిరికకాయవలె (అంతస్పష్టముగా కనబడుతుంది అన్నమాట.) చూ. కరస్థబిల్వన్యాయము.

1305 హితం మనోహారి చ దుర్లభం వచః.

హితమయినదిన్నీ, మనస్సుకుప్రియమయినదిన్నీ అయినమాట ఉండదు.

1306 హిరణ్యనిధిన్యాయము.

భూమిలో బంగారపు గనిఉన్నా, అదిఅక్కడఉన్నదని తెలుసు

కోలేనివారు, దానిమీదనుంచి నడచిపోతూనే ఉంటారు. అదిఉన్నదని తెలుసుకొన్నవారు, భూమినితవ్వి, బంగారమును సంపాదిస్తారు. అట్లే బ్రహ్మవిషయములో కూడాను.

1307 హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాఽపి వా.

నిప్పులోపెట్టుతే బంగారము మంచిదయినదీ, కానిదీ తెలుస్తుంది.

1308 హేరంబ నరసింహన్యాయము.

ఏనుగూ మనిషీకలిసి వినాయకుడయినాడు; మనుష్యుడూ సింహమూకలిసి నరసింహమూర్తి అయినాడు. పరస్పరవిరుద్ధ వస్తువులకయినా ఒకచోటకలయిక కలుగుతుంది.

1309 హోతారమపి జుహ్వానం స్పృష్టో దహతి పావకః

ముట్టుకొంటే తనలో హవిస్సునువేల్చుచున్న హోతనుకూడా అగ్ని కాలుస్తుంది.

1310 హోలికాధికరణన్యాయము.

ఫాల్గుణ పున్నమనాడు చేయవలసిన హోలీపండుగను చేసేటట్లు. ఇది మీమాంసాశాస్త్రములో వచ్చేన్యాయము.

1311 హ్రదనక్రన్యాయము.

మడువులో మొసలి ఉన్నంతకాలమూ ఆ కెంపింటికీ ఏఅపాయమున్ను కలుగదు. మొసలిపైకివస్తే దానినిప్రత్యేకముగా చంపివేస్తారు. మడువులోని నీళ్ళనుపొలములకుపెట్టి దానిని శుష్కింపజేస్తారు.

